శ్రీరస్తు.

శ్రీపరాశరమునీంద్రవిరచిత

# వృద్ధపారాశర్యము

(దశాభుక్తిఫలచంద్రిక.)

సాంధ్రతాత్పర్యము.





చెన్నపురి

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1923

శ్రీ ర స్తు.

# వృ ద్ధ పా రా శ ర్య ము

(దశాభుక్తిఫలచంద్రిక.)

## సాంధ్ర తా త్ప ర్య ము.

శ్లో. వందే విశ్వేశ్వరం దేవం గణనాథం గజాననమ్,
ధ్యానేన యస్య ప్రత్యూహా విలయం యాంతి దూరతః.

తా. ప్రపంచమునకు నీశ్వరుండును, గణాధిపతియును, ఏనుఁగ మొగమువంటి ముఖము గలవాఁడును, ధ్యానముఁ జేయుటమాత్రమున నన సకలవిఘ్నములఁ దొలఁగించువాఁడు నగు విఘ్నేశ్వరునకు నమస్కారము చేయుదును.

శ్లో. పరాశరమునిం నత్వా తద్ధోరాంశం నిరీక్ష్యచ,
వక్ష్యే మ్యుడుదశామార్గం పూర్వశాస్త్రానుసారతః. 2

తా. పరాశరమునివర్యునకు నమస్కారముచేసి ఆపరాశర హోరను బాగుగఁ బరిశీలించి పూర్వపుశాస్త్రముల ననుసరించియుండు దశామార్గముచేత జాతకఫలములం జెప్పువిధమును జెప్పెదను.

### సూర్యాదిగ్రహములకు దశాసంవత్సరముల నిర్ణయము.

శ్లో. ష ట్సూర్యో దశమ శ్చంద్ర స్స ప్తసంఖ్యా ధరాసుతః,
రాహు రష్టాదశ శ్చైన గురు ష్షోడశవత్సరః. 3
ఏకోనవింశతి స్సౌరి ర్బుధ స్స ప్తదశ స్తథా,
కేతో శ్చ స ప్తవర్షాణి భృగు ర్వింశతిచ క్రమాత్ 4

తా. అనఁగా సూర్యునకు నాఱుసంవత్సరము లనియును, చంద్రునకుఁ బదిసంవత్సరము లనియును, అంగారకునకు నేడుసంవత్సరము లనియును,రాహువుకుఁ బదునెనిమిది సంవత్సరములనియును,గురువుకుఁ బదునాఱుసంవత్సరము లనియును, శనికిఁ బందొమ్మిది సంవత్సరములని

యును, బుధునికిఁ బదునేడు సంవత్సరములనియును, కేతువునకు నేడు సంవత్సరములనియును, శుక్రునకు నిరువదేండ్లనియును దశాసంవత్సరముల నెఱుంగునది.

### దశఁ గనుఁగొనువిధము.

శ్లో. అర్కేందు భౌమ స్వర్భాను జీవ మంద జ్ఞ కేతవః,
కృత్తికాది నవర్క్షాణాం దశానాథా స్తథా పునః. 5

తా. అనఁగాఁ గృత్తికాది తొమ్మిదినక్షత్రములకుఁ గ్రమముగ సూర్యాదినవగ్రహము లధిపతులగుదురు. వారే, దశానాథు లనఁ బడుదురు. అదెట్లనఁగా, ౧ కృత్తిక, ౨ ఉత్తర, ౩ ఉత్తరాషాఢ, ఈ మూఁడునక్షత్రములయందుజనించిన జాతకునకు మొట్టమొదట సూర్య దశ జరుగుచున్నదని యెఱుంగునది. ౧ రోహిణి, ౨ హస్త, ౩ శ్రవణము, ఈమూఁడునక్షత్రములయందు జనించినచో మొట్టమొదట చంద్రదశ జరుగుచున్నదని యెఱుంగునది. ౧ మృగశిర, ౨ చిత్త, ౩ ధనిష్ఠ ఈ మూఁడునక్షత్రములయందు జనించినచో, అంగారకదశయని తెలియఁ దగినది. ౧ ఆరుద్ర, ౨ స్వాతి, ౩ శతభిషము, ఈమూఁడునక్షత్రముల యందు జనించినచో, రాహుదశ జరుగుచున్నదని తెలియఁదగినది. ౧ పునర్వసు, ౨ విశాఖ, ౩ పూర్వాభాద్ర, ఈమూఁడునక్షత్రములయందు జనించినచో, గురుదశయని యెఱుంగఁదగినది. ౧ పుష్యమి, ౨ అనూ రాధ, ౩ ఉత్తరాభాద్ర, ఈమూఁడునక్షత్రములయందుజనించినచో, మొదట శనిదశయని యెఱుంగునది. ౧ ఆశ్రేష, ౨ జ్యేష్ఠ, ౩ రేవతి, ఈ మూఁడునక్షత్రములయందు జనించినచో, బుధదశయనియెఱుంగునది. ౧ మఖ, ౨ మూల, ౩ అశ్విని, ఈమూఁడునక్షత్రములయందుజనించినచో, కేతుదశయని తెలియఁదగినది. ౧ పుబ్బ, ౨ పూర్వాషాఢ, ౩ భరణి, ఈ మూఁడునక్షత్రములయందుజనించినచోశుక్రదశయని తెలియఁదగినది.

### సూర్యాదిగ్రహాభుక్తులఁ గనుఁగొనువిధము.

శ్లో. స్వదశాం త్రిగుణీకృత్య తద్దశాను హతం పునః,
ఖాగ్నినా విభజే న్న్యాసం శేష స్తు దివసాదయః. 6

తా. అనఁగా, నొక్కొక్క గ్రహదశ నాయా గ్రహదశాసంవత్సరములచేతఁ బెంచినచో, నెంత మొత్తమగునో, ఆమొత్తముస మొదటిసంఖ్యను మాసములుగ నెంచవలయును. కట్టకడనుండు సంఖ్యను, మరల మూఁడుతోఁ బెంచినచో, నెంత మొత్తమగునో, యాసంఖ్యను దినములుగ నెంచఁదగినది. అదెట్లనఁగా, సూర్యదశా సంవత్సరములు ౬. ఈయారును నారుతోఁ బెంచినచో ౩౬ అగుచున్నది. ఇందు నాదిలో నుండుసంఖ్య ౩. ఈమూఁడు మాసములని తెలియఁదగినది. కడనుండు ౬ ను మూఁటిచేఁ బెరిచఁగా ౧౮ అగుచున్నది. ఈసంఖ్య దినములని తెలియఁదగినది.

చంద్రదశాసంవత్సరములు ౧౦. ఈపదిని పదితోఁ బెంచినచో ౧౦౦ అగుచున్నది. దీనిలో నాదిలోనుండు౧౦ సంఖ్య మాసములని తెలియఁదగినది. కట్టకడనుండు సంఖ్యగనుక దినములు లేవని తెలియఁదగినది.

అంగారకదశాసంవత్సరరాసులు ౭. ఈయేడు నేడుతోఁ బెంచఁగా ౪౯ అగుచున్నది. ఇందు నాదిలోనుండు౪ సంఖ్య మాసము లని తెలియఁదగినది. కట్టకడనుండు ౯ సంఖ్యను మూఁటిచేఁ బెంచినచో ౨౭ అగుచున్నది. ఈసంఖ్యను దినములుగ నెంచఁదగినది. ఈవిధముగఁ దక్కినది యూహించుకొనునది.

సూర్యదశాయాం సూర్యభుక్తిమాసాః ౩, దినాని ౧౮. తత్ఫలమ్.

శ్లో. ఉచ్చ స్వక్షేత్రగే సూర్యే కేంద్రలాభత్రికోణగే,
రవిదాయే స్వభుక్తౌచ ధనధాన్యాదిలాభకృత్. 7
దేహారోగ్యం మిత్రలాభం రాజప్రీతికరం శుభం,
వాహనాంబర పశ్వాది గ్రామ భూమ్యాది లాభకృత్ 8
మహారాజప్రసాదేన ఇష్టసిద్ధిస్సుఖంభవేత్,
షష్ఠాష్టమవ్యయే సూర్యే దేహజాడ్యం మనోరుజం. 9
యత్నకార్య విఘాతంచ విదేశగమనం తథా,
లగ్నాధిపేన సంయుక్తే ఆదౌ సౌఖ్యం ధనాగమం. 10
యత్నకార్యార్థ సిద్ధిస్స్యా ద్ద్వివాహం రాజదర్శనం,

అరణ్య వస్తు సంప్రాప్తిః సన్న్యాస గురుదర్శనమ్. 11
ద్వితీయ ద్యూనసాథేతు అపమృత్యు ర్భవిష్యతి,
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపం జపేత్. 12
సూర్యప్రీతికరం శాంతిం కుర్యా దారోగ్య మాదిశేత్,

తా. సూర్యదశయందు సూర్యభుక్తి 3-మాసములు. ౧౮-దినములు. ఈసూర్యుఁడు, స్వక్షేత్రోచ్చస్థానములయందు నుండినను, కేంద్రములయందుఁగాని, కోణములయందుఁగాని, లాభస్థానమునంగాని యుండెనేని, ధనధాన్యలాభమును, శరీరారోగ్యమును, మహారాజానుగ్రహమును, శత్రుజయంబును, వాహన పశు గ్రామభూమ్యాదిలాభము, ఇష్టసిద్ధియు, మిత్రజనసల్లాపమునుగల్గును. ఆసూర్యుఁడు ౬-౮-౧౨ స్థానములయందు దుర్బలుఁడై యుండెనేని దేహజాడ్యమును, మనోదుఃఖమును, ప్రయత్నితకార్యాలస్యమును, లేక విఘ్నముగుటయు, పరదేశగమనమును, శత్రుభయమును, శిరోబాధయును, అధికవ్యయమును, స్వజనమనస్తాపమును గల్గును. ఆసూర్యుఁడు లగ్నాధిపతితోఁ జేరినచో, భుక్త్యాదియందు ధనలాభమును, రాజ బంధు మిత్రదర్శనమును, వాహనవైభవమును, అరణ్యవస్తుప్రాప్తియును, లేక అరణ్యప్రాంతగ్రామసంచారమును, గురుసన్న్యాసజనదర్శనమును, తత్వగ్రంథపఠనమును, గోప్యవారిస్నేహమును, మృష్టాన్నభోజనమును, మనోధైర్యమును గల్గును. ఆసూర్యుఁడు లగ్నమునకు ద్వితీయస్థానంబు గాని, సప్తమస్థానంబునంగాని యుండినచో అపమృత్యుభీతిగల్గును. తద్దోషశాంతికై మృత్యుంజయజపంబును, సూర్యనమస్కారమును, విధివిహితముగఁ జేయించినచో నారోగ్యమగును. విధివిహితమనఁగా, మంత్రయామిళోక్తప్రకారముగఁ జేయవలయుననిభావము.

సూర్యదశాయాం చంద్రభుక్తి మాసాః ౬. తత్ఫలమ్.

శ్లో. సూర్యస్యాంతర్గతే చంద్రే లగ్నా త్కేంద్రత్రికోణగే. 13
గురుణా సంయుతే దృష్టే బాంధవానాం సమాగమం,
వివాహం శుభకార్యంచ వ్యాపారా ద్ధనలాభకృత్ 14
ధాన్యక్షేత్రాభివృద్ధించ పశువాహనసంపదం,
తుంగేవా స్వక్ష్వ్ఱ్గేవాపి దారసౌఖ్యం ధనాగమమ్. 15

పుత్రలాభం శుభంచైవ సౌఖ్యం రాజసమాగమం,
క్షీణేవా పాపసంయుక్తే దారపుత్రాదిపీడనమ్. 16

వైషమ్యం కార్యవిఘ్నంచ పశుధాన్యధనక్షయం,
షష్ఠాష్టమవ్యయే చంద్రే జలగండం మనోరుజమ్. 17

బంధనం రోగపీడాచ స్థాన విచ్యుతి కారణం,
దుస్థానేవాధిపత్యేచ దాయాది జనవిష్వరమ్. 18

నిధనం కుత్సితాన్నంచ చోరాగ్నిరిపుపీడనం,
మూత్రకృచ్ఛ్రాది రోగంచ అథవా పాండురోగకృత్. 19

మాతృనాశం మనఃక్లేశం వ్రణపీడా భయం భవేత్,
దాయేశాల్లాభ భాగ్యస్థే కేంద్రేవా శుభసంయుతే. 20

భోగభాగ్యాది సంతోషం దారపుత్రాది వర్ధనం,
వివాహం యజ్ఞదీక్షాంచ మృష్టాన్నాంబరభూషణమ్. 21

వాహనం పుత్రమిత్రాది లభతే సుఖవర్ధనం,
రాజ్యప్రాప్తిం మహోత్సాహం స్థానప్రాప్తించ శాశ్వతమ్. 22

దాయేశాద్రిపురంధ్రస్థే వ్యయేవా నీచరాశిగే,
అకాలభోజనంచైవ నానాకష్టం భవిష్యతి. 23

ద్వితీయ ద్యూననాథేతు అపమృత్యుర్భవిష్యతి,
శ్వేతాంగం మహిషీందద్యాచ్ఛాంతింకుర్యాత్సుఖంభవేత్.

తా. ఈసూర్యదశయందుఁ జంద్రభుక్తి ౬ మాసములు — ఈ చంద్రుఁడు కేంద్రత్రికోణస్థానములనుండి గురువుతోఁ గూడినను, జూడఁబడినను, బంధుసమాగమమును, వివాహమును, శుభకార్యములును, వ్యాపారమూలముగ ధనలాభమును, ధాన్యక్షేత్రముల యభివృద్ధియును, పశువాహనాభివృద్ధియును, ఆచంద్రుఁడు స్వక్షేత్రోచ్చస్థానంబులనుండెనేని కళత్రసౌఖ్యంబును, ధనలాభమును, పుత్రలాభమును, శుభకార్యములును, రాజదర్శనమును, ప్రయత్న కార్యసిద్ధియును, అతిసౌఖ్యము గలుగును. ఆచంద్రుఁడు క్షీణత్వమునొంది పాపగ్రహయుక్తుఁడై యుండినచోఁ గళత్రపుత్రపీడయును, విరోధమును, కార్యవిఘ్నమును, పశుధనధాన్యక్షయమును, స్త్రీకలహమునగును. ఆచంద్రుఁడు ౬-౮-౧౨ స్థానములనుండినను నీచస్థితుఁడైనను జలగండమును, మనశ్చింతయును,

బంధప్రాప్తియును, రోగపీడయును, స్థానభ్రంశహేతువును, దుస్థానాధిపత్యమును, నీచసేవయును, దాయాదిజనవిశ్వరమును, మరణసంబంధవిపత్తును, కుత్సితాన్నభోజనమును, చోరాగ్ని శత్రుబాధయును, మూత్రకృచ్ఛ్రాదిరోగముగాని, లేక పాండురోగముగాని కల్గుటయును, మాతృగండము, లేక మాతృకర్మయును, మాతృవర్గజనమృతియును, మనఃక్లేశమును, వ్రణపీడయును, భయమును గల్గును. ఆచంద్రుఁడు దశానాథునకు ౧-౪-౭-౧౦-౫-౯-౧౧ స్థానములయందు శుభగ్రహయుతుఁడైనంగాని చూడఁబడిగాని యుండినచో, భోగభాగ్యసంతోషమును, కళత్రపుత్రసౌఖ్యమును, గృహమున వివాహాదులును, యజ్ఞదీక్షయును, మృష్టాన్నభోజనమును, వస్త్రభూషణవిక్రయలాభమును, వాహనప్రాప్తియును, పుత్రమిత్రసుఖమును, రాజ్యప్రాప్తియు, లేక భూలాభమును, మనస్సంతోషమును, స్వస్థానప్రాప్తియును గల్గును. ఆదశానాథునికి ౮-౧౨-౬ స్థానములయందుఁ జంద్రుఁడు నీచస్థితుఁడై యుండినచో అకాలభోజనమును, నానాకష్టములు అనఁగా, అకస్మాత్కలహమును, వ్రణఖడ్గగండమును, మృతాశౌచములును, అన్యగ్రామసంచారమును, మిత్రవిరోధమును, ఋణధనపీడయు, రాజదండనభీతియును, మానప్రాణహానికార్యమును, దుర్జనులతో స్నేహమును, సేవయును గల్గును. ఆచంద్రుఁడు లగ్నమునకు ౮-౧౧-౧౨-౬-౨ ఇండ్లకధిపతియైయుండి ౨-౭ ఇండ్లనుండినచో మారకఫలము నిచ్చువాఁడగును. అందులకు మంత్రయామిలో క్త ప్రకారము, శ్వేతధేనువును, మహిషమును దానముచేసి దుర్గాజపమును జేయించినచోఁ దద్దోషపరిహారమగును.

సూర్యదశాయాం కుజభుక్తిర్మాసాః ౪, దినాని ౬. తత్ఫలమ్.

శ్లో. సూర్యస్యాంతర్గతే భౌమే స్వోచ్చస్వక్షేత్ర లాభగే,
లగ్నాత్కేంద్రత్రికోణేవాఽబాంధవానాం సమాగమమ్. 25
భూలాభం కృషిలాభంచ ధనధాన్యాభివృద్ధిదం,
నూతనగృహనిర్మాణం భూషణాంబరలాభకృత్ 26
లగ్నాధిపేన సంయుక్తే రాజప్రీతిం శుభాదికం,
భాగ్యలాభాధిపైర్యుక్తే ధనలాభో భవిష్యతి. 27

శత్రునాశం భ్రాతృసౌఖ్యం బంధు కల్యాణ సంభవం,
దాయేశా ద్రిపు రంధ్రస్థే పాపయుక్తేఽథ వీక్షితే 28
శత్రుభీతి ర్మనః క్లేశం రాజదండా ద్ధనక్షయం,
కారాగృహప్రవేశంచ నిగళం బంధునాశనమ్. 29
భ్రాతృవర్గ విరోధంచ అథవా ఋణపీడితం,
ద్వితీయ ద్యూననాథేతు దేహజాడ్యం రిపో ర్భయం. 30
చోరాగ్ని వ్రణ రోగంచ ఖడ్గగండం మనోరుజం,
సుబ్రహ్మణ్య జపం దాన మనడ్వాహం తథైవచ. 31
శాంతిం కుర్వీంతి విధివ దాయు రారోగ్య సిద్ధయే,

తా. సూర్యదశయందు అంగారకుఁడు స్వక్షేత్రోచ్ఛస్థానం బులయందునైన, లగ్నమునకుఁ బదనొకంపవయింటనైన, కేంద్రత్రికోణంబులనైన, మూలత్రికోణమునన్నైన నుండెనేని బంధుదర్శనమును, భూలాభమును, కృషిలాభమును, ధనధాన్యాభివృద్ధియును, నూతన గృహనిర్మాణమును, వస్త్రభూషణ విక్రయలాభమును గల్గును. ఆ యంగారకుఁడు లగ్నాధిపతితోఁ జేరి దుస్థానంబులయం దుండకుండెనేని రాజప్రీతియును, శుభకార్యములును గల్గును. ఆయంగారకుఁడు ౯-౧౧ స్థానాధిపతులతోఁ జేరియుండినచో ధనలాభమును, శత్రునాశమును, భ్రాతృసౌఖ్యమును, బంధుకల్యాణదర్శనమును, వ్యవసాయమూలకధాన్యలాభమును, వనకూపనిర్మాణప్రతిష్ఠలును గల్గును. ఆ యంగారకుఁడు దశానాథునకు ౬-౧౨-౮ స్థానంబులయందుఁ బాపగ్రహములతోఁ గూడియుండినం జూడఁబడినను శత్రుభీతియును, మనశ్చింతయును, రాజదండనవశాద్ధనక్షయమును, కారాగృహప్రవేశమును లేక నిగళప్రాప్తియును, బంధునాశమును, భ్రాతృవర్గ విరోధమును, ఋణపీడయును, దేహజాడ్యమును,చోరాగ్నివ్రణరోగఖడ్గగండములుగాని గల్గును. ఈయంగారకుఁడు లగ్నమునకు ౨-౭ స్థానములయందు బలహీనుఁడై పాపగ్రహవీక్షణముగలవాఁడై మారకాధిపత్యము గల్గియుండినచో అపమృత్యుదోషము ప్రాప్తించును. అందులకు సుబ్రహ్మణ్యజపంబును, స్వర్ణానడ్వాహప్రతిమాదానమును, యామిళోక్తప్రకారము చేయించినచో నాయురారోగ్యమును ప్రయ

త్న కార్యసిద్ధియును, దోషపరిహారమును, మనస్సంతోషమును, రాజద్వారమునందుఁ గార్యానుకూల్యము నగును.

రవిదశాయాం రాహుభుక్తిమాసాః ౧౦, దినాని ౨౪. తత్ఫలమ్.

శ్లో. సూర్యస్యాంతర్గతే రాహౌ లగ్నాత్కేంద్రత్రికోణగే. 32
ఆదౌ త్రిమాసపర్యంతం ధననాశం మహద్భయం,
చోరాగ్ని ఫణిభీతిశ్చ భూతాపస్మారపీడనమ్. 33
అకస్మాత్కలహంచైవ దారపుత్రాదిపీడనం,
తత్పరం సుఖమాప్నోతి శుభయుక్తే శుభాంశకే. 34
దేహారోగ్యం మనస్తుష్టిః రాజప్రీతికరం శుభం,
లగ్నాదుపచయే రాహౌ యోగకారకసంయుతే. 35
దాయేశాచ్ఛుభరాశిస్థే రాజసమ్మానకీర్తనం,
భాగ్యవృద్ధిర్మహాధైర్యం బంధులాభం ధనాగమమ్. 36
పుత్రోత్సవాదిసంతోషం గృహే కల్యాణవైభవం,
దాయేశాత్షష్ఠ రిఫ్ఫస్థే రంధ్రే వా బలవర్జితే. 37
బంధనం స్థాననాశంచ కారాగృహనివేశనం,
చోరాగ్నివ్రణభీతిశ్చ దారనాశం నృపాద్భయమ్. 38
చతుష్పాజ్జీవనాశంచ ఋణపీడా గృహనాశనం,
పాండుజ్వరాది రోగశ్చ అతిసారాదిపీడనమ్. 39
ద్విసప్తమేచ రాహౌవా తత్స్థానాధిపసంయుతే,
అపమృత్యుభయంచైవ సర్పభీతిశ్చ సంభవేత్ 40
దుర్గాజపం ప్రకుర్వీత ఛాగదానం సమాచరేత్,
కృష్ణాంగాం మహిషీం దద్యాచ్ఛాంతిమాప్నోత్యసంశయః. 41

తా. సూర్యదశయందు రాహుభుక్తి ౧౦ మాసములు, ౨౪ దినములు:—ఈరాహువు కేంద్రములయందుఁ గోణస్థానములయందు బలియుఁడై యుండినచో భుక్తియొక్క మొదట మూఁడుమాసముల పర్యంతము ధననాశమును, అధికభయమును, చోరాగ్నిభయమును,

సర్పభీతియును, భూతపీడయును, పిత్తవికారమును, అకస్మాత్కల
హమును, కళత్రపుత్రపీడయును, అథవా కళత్రనాశమును గల్గును.

అనంతర మీరాహువు లగ్నాత్కేంద్రత్రికోణములయందుం డఁగా, ఆస్థానములయందు శుభులుండినను శుభాంశలైయుండిన నీరాహుభుక్తియందు దేహారోగ్యమును, మనస్సునందు సంతోష మును, రాజప్రీతియును, శుభమును గల్గును. మఱియు నీరాహువు లగ్నమునకు నుపచయస్థానములగు ౩-౬-౧౧-౧౧ రాసులయందు యోగకారకగ్రహముతోఁ జేరియుండినచో లేక దశానాథునకు శుభక్షేత్రములయందు నుండినచో రాజసమ్మానమును, కీర్తియును, భాగ్యాభివృద్ధియును, అధికార్యమును, బంధులాభమును, ధనలాభ మును, పుత్రోత్పత్తియును,గృహమునందు వివాహాదిశుభకార్యములు జరుగుటయును గల్గును. ఈరాహువు లగ్నమునకు ౩-౬-౧౧ స్థాన ములయందుండి పాపగ్రహములచేఁ జూడఁబడక గురువుచేఁ జూడఁబడి నచో రాజతుల్యయోగమును, మిత్రజనసల్లాపమును, గొప్పవారితో స్నేహమును, అధికార్యమును, కించ దంతవాయుపీడయును, దేవ తోత్సవదర్శనమును, కళత్రసుఖమును, పుత్రోత్పత్తియు, స్వాధికార మూలకముగధనలాభమును గల్గును.శుక్రునితో నీరాహువుగూడినను, జూడఁబడినను, స్త్రీజాతక మయ్యేనేని అన్యపురుషునివలన ధనలాభ మును, స్నేహమును గల్గును. పురుషజాతకమయ్యేనేని అన్యస్త్రీమూ లకధనలాభమును, తత్సంభోగమును. స్వాధికారాభివృద్ధిచేత ధన లాభమును, నూతనగృహనిర్మాణాదులును, పశ్చిమోత్తరదిశలయందుఁ బ్రయాణమును. లేక, దక్షిణనిర్ఋతిదిశలయందుఁ బ్రయాణమును, మిత్రజనవశాద్ధనలాభమును, స్త్రీలాభమును, చోరధనలాభమును గల్గును.

ఈరాహువు దశానాథునకు ౬-౮-౧౨ స్థానములయందు శనవ్యంగారకులతోఁ గూడియుండినచో బలహీనుఁడైనను, బంధనప్రా ప్తియును, స్థానభ్రంశమును, కారాగృహదర్శనమును, చోరాగ్నివ్రణ సర్పభయమును, రాజదండనభయమును, కళత్రదోషమును, చతుష్పా

జ్జీవనాశమును, ఋణధనమువలన నానాకష్టమును, గృహావిక్రయము
ను, లేక భూనాశమును, పాండుజ్వరాతిసారవాతశ్లేష్మరోగమును, పితృ
జనమాతృజనారిష్టమును, ఆశౌచమును, లేక నీచజనమూలకకలహము
చే ధనక్షయమును గల్గును.

ఈరాహువు ౨-౭ స్థానాధిపతులతోఁ జేరి యారాసులయందు నుండి పాపగ్రహములచేఁ జూడఁబడుచు నుండెనేని, పైఁజెప్పఁబడిన వ్యాధులలో నొకటిసంభవించి బాధించును. మారకమునకు హేతువగు నందులకు దుర్గాజపమును, స్వర్ణభాగప్రతిమాదానమును, కృష్ణధేనువును, మహిషమ్మును, దానము బోధాయనసూత్రప్రకారము చేసినచో నాయురారోగ్యమును, ప్రయత్నకార్యానుకూలమునుగల్గును.

సూర్యదశాయాం గురుభుక్తిః మాసాః ౯, దినాని ౧౮. తత్ఫలమ్.

శ్లో. రవే రంతర్గతే జీవే స్వోచ్ఛేవా పరమోచ్ఛగే,
ధనధాన్యాదిలాభంచ పుత్రలాభం సుఖాధికమ్. 42
మహారాజప్రసాదేన ఇష్టకార్యార్థలాభకృత్,
బ్రాహ్మణ ప్రభుసమ్మానం ప్రియవస్త్రాది లాభకృత్ 43
భాగ్యకర్మాధిపవశా ద్రాజ్యలాభం సుహోత్సవం,
సేనాధిక్యం మహోధైర్యం వరవాహన లాభకృత్. 44
దాయేశా చ్ఛుభరాశిస్థే భాగ్యవృద్ధి స్సుఖావహం,
దానధర్మదయాయుక్తో దేవతాగురుభక్తితః. 45
మంత్రసిద్ధిః పుణ్యకర్మ సర్వకర్మాది సంగ్రహం,
దాయేశా ద్రిపురంధ్రస్థే నీచేవా పాపసంయుతే. 46
దారపుత్రాదిపీడాచ దేహపీడా మనోరుజం,
రాజకోపం స్థాననాశం బంధుమిత్రవిరోధకృత్. 47
పాపమూలా ద్ద్రవ్యనాశం చతుష్పాజ్జీవనాశనం,
విదేశగమనం చైవ పితృనాశం మహాభయమ్. 48
కళత్రపుత్రనాశం స్యా దన్యగృహ నివాసకృత్,
ద్వితీయ ద్యూన నాథేతు దేహజాడ్యం ధనక్షయమ్. 49

స్వర్ణదానం ప్రకుర్వీత రుద్రజాప్యంచ కారయేత్
గవాం కపిలవర్ణాఖ్య దానే నారోగ్య మాదిశేత్ 50

తా. సూర్యదశయందు గురుభుక్తి ౯ మాసములు, ౧౮ దినములు:— ఈగురువు తనయుచ్ఛస్థానమున నుండెనేని ధనధాన్యలాభమును, పుత్రలాభమును, అధికసుఖమును గల్గును. ఈగురువుకు మారకాధిపత్యముండి శుభగ్రహాయుతుఁడై యుండినచో మహారాజుమూలకము నిష్టకార్యసిద్ధియును, ధనలాభమును, బ్రాహ్మణప్రభుసమ్మానమును, [illegible]య వస్త్రలాభమును గల్గును. ఈగురువు ౯-౧౦ స్థానాధిపతులకు [illegible]-౧౦ స్థానములయందు బలియుఁడై యుండెనేని రాజ్యలాభమును, భూపశు విక్రయలాభమును, అథవాగృహలాభమును, సేనాధిపత్యమును, అధికధైర్యమును, శ్రేష్ఠమగు వాహనలాభమును, రాజతుల్యయోగమును, వ్యాపారమూలాధనలాభమును, బంధుమిత్రప్రియమును, గృహమునఁ గల్యాణాదివిభవమును, సత్కథాశ్రవణమును, కళత్రపుత్రసంతోషమును, పశ్చిమనిర్తృతిదిశ ప్రయాణమును, శత్రుజయమును, రాజద్వారే కార్యానుకూలమును గల్గును.

ఈగురువు దశానాథునకుశుభాంశలయందుఁగాని, శుభగ్రహములయందుఁగాని కేంద్రాధిపత్యదోషములేక కేంద్రకోణములయందు బలియుఁడై యుండెనేని భాగ్యాధిపత్యమును, సుఖమును, దానధర్మోపకారదయయును, దేవతాగురుభక్తియును, మంత్రతంత్రౌష పుణ్యకార్యసిద్ధియును, పితృవర్గజనములయందు శుభములును, వ్యాపారయోగవశమునధనలాభమును, సత్కీర్తియును గల్గును. ఈగురువు దశానాథునకు ౮-౧౨-౬ స్థానములయందుండినను నీచస్థానమునఁ బాపగ్రహములతోఁ గూడియుండినను, లగ్నాదిదుష్టస్థానములయందు శనిరాహుకుజులతో వికలావస్థలో నుండినచో కళత్రపుత్రహానియును, దేహపీడయును, మనఃక్లేశమును, రాజదండనాదిభీయమును, బంధుమిత్రవిరోధమును, పాపకార్యవశాద్ధనవ్యయమును, చతుష్పాజ్జీవనాశమును, విదేశచారమును, పితృజనారిష్టమును, మృతాశౌచమును, కళత్రపుత్రకలమును, లేక తత్పీడయును, అన్యగృహనివాసమును, ప్రయత్నకార్యవిఘ్నమునుగల్గును. ఈగురువు ద్వితీయసప్తమస్థానములకధిపతియై యుండినను

తత్స్థానములయందు నాధిపత్యములేకయుండినను మారకగ్రహము
లచేఁ జూడఁబడుచు నుండినచో దేహజాడ్యమును, ధనవ్యయమును,బం
ధుపత్నీత్యాగమును గల్గును. ఇందులకుఁ బరిహారము రుద్రజపమును, కపి
లధేనువును, స్వర్ణలక్ష్మీనారాయణప్రతిమయును, యామిళోక్తప్రకార
ముగ శాంతిచేసినచో నాయురారోగ్యమును ప్రయత్నకార్యానుకూల
మును గల్గును.

సూర్యదశాయాం శనిభుక్తిమాసాః ౧౧, దినాని ౧౨ తత్ఫలమ్.

శ్లో॥ సూర్యస్యాంతర్గతే మందే లగ్నాత్కేంద్ర త్రికోణగే,
శత్రునాశం మహత్సౌఖ్యం స్వల్పధాన్యార్థ లాభకృత్ 51
వివాహోత్సవకార్యాణి బంధుమిత్ర సమాగమం,
స్వోచ్చ స్వక్షేత్రగే మందే సుహృద్గ్రహసమన్వితే. 52
గృహేకల్యాణసంపత్తిః మిత్రమూలాద్ధనాగమః,
రాజప్రభువశాత్సౌఖ్యం యత్నకార్యార్థ సిద్ధిదమ్. 53
షష్ఠాష్టమ వ్యయే నీచే పాపగ్రహసమన్వితే,
వాతశూల మహావ్యాధిః వ్రణచోరాగ్నిపీడనమ్. 54
బంధనం కార్యవిఘ్నశ్చ మిత్రబంధుమృతిర్భవేత్
అకస్మాత్కలహంచైవ దాయాది జనవిగ్రహమ్. 55
పితృమాతృవియోగంచ గమనాగమనంతథా,
ప్రమాం దిశమాశ్రిత్య ప్రయాణం కార్యనాశనమ్. 56
స్థానచ్యుతిః శత్రుభీతి ర్గహన గ్రామవాసకృత్,
ద్వితీయ ద్యూననాథేతు అపమృత్యు భయంభవేత్. 57
కృష్ణాంగాం మహిషీందద్యాత్ మృత్యుంజయజపం చరేత్
తిలదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్. 58

తా. సూర్యదశయందు శనిభుక్తిమాసములు ౧౧, దినములు
౧౨. శనైశ్చరుఁడు ౧-౪-౭-౧౦-౫-౯ ఈ స్థానములయందు నుం
డినచో శత్రునాశమును,అధికసౌఖ్యమును, స్వల్పధాన్యార్థలాభమును,
వివాహకార్యమును, బంధుమిత్రదర్శనమును, ఈశనైశ్చరుఁడుండురాశి
దుస్థానమయ్యెనేని, వ్యాధిపీడయును, రాజకోపమును, ఋణధనబాధ

యును, అకాలభోజనమును, శత్రుభయమును, మానభంగమును, అపవాదమును, వృథాసంచారమును, వ్రణాగ్నిపీడలుగాని గల్గును. ఈశనైశ్చరుఁడు స్వక్షేత్రోచ్చమిత్రస్థానములయందుండి శుభదృష్టిగలవాఁడయ్యెనేని బలహీనుఁడుగాకుండెనేని కల్యాణాదిశుభవైభవమును, మిత్రజనమూలకధనలాభమును, రాజజనస్నేహమును, రాజద్వారమునందుఁ బ్రయత్నకార్యానుకూల్యమును, తీర్థస్నానదేవతారాధనమును, శూద్రప్రభువశాద్ధనలాభసుఖమును, పశ్చిమనిరృతిదిశప్రయాణమును, ఋణద్రవ్యలాభమును, వ్యాపారాభివృద్ధియును, సస్యాభివృద్ధియును గల్గును. ఈశనైశ్చరుఁడు ౬-౮-౧౨ స్థానములయందు నీచుఁడై యుండినను, అచ్చటపాపగ్రహములతోఁ గూడియుండినను వాతశూలవ్యాధియును, చోరాగ్నివ్రణపీడలును, బంధనమును, కార్యవిఘ్నమును, మిత్రబంధువృతియును, అకస్మాత్కలహమును, దాయాదిజనవిద్వేషమును, ఈభుక్తికాలమునందు గోచారరీతి చంద్రరాశికి దుస్స్థానములయందు శనిసంచారముకల్గియుండెనేని మాతాపితృజనారిష్టమును, అచ్చటచ్చట దిగుగుట, పశ్చిమనిరృతిదిశప్రయాణముచేత కార్యభంగమును, స్థానచ్యుతియును, శత్రుభయమును, అరణ్యగ్రామసంచారమును, మానభంగమును గల్గును. ఈశని లగ్నమునకు, ద్వితీయసప్తమస్థానములయందు మారకాధికారము గల్గియుండినచో అపమృత్యుదోషము గల్గును. అందులకు మృత్యుంజయజపమును, కృష్ణవర్ణధేనువును, మహిషమును, స్వర్ణచ్ఛాగప్రతిమయును, యామిళోక్తప్రకారముగ దానమును, తద్విధిహోమము జేసినచో సర్వదోషపరిహారమగును.

సూర్యదశాయాం బుధభుక్తిమాసాః ౧౦, దినాని ౬ తత్ఫలమ్.

శ్లో. సూర్యస్యాంతర్గతే సౌమ్యే లగ్నాత్కేంద్రత్రికోణగే,
స్వోచ్చే స్వక్షేత్ర లాభస్థే శుభాంశే శుభసంయుతే. 59
రాజ్యలాభం మహోత్సాహం దారపుత్రాది సౌఖ్యకృత్,
మిత్రరాజప్రసాదేన వాహనాంబరభూషణమ్. 60
పుణ్యతీర్థ ఫలావాప్తి ర్గృహే గోధనసంకులం,
భాగ్య లాభాధిపై ర్యుక్తే వ్యాపారా ద్ధనలాభకృత్ 61
భాగ్య పంచమకర్మస్థే శుభగ్రహసమన్వితే,

స్వకర్మ ధర్మ బుద్ధిశ్చ గురుదేవ ద్విజార్చనమ్. 62
ధనధాన్య సమృద్ధిశ్చ వివాహం పుత్రసంభవం,
మిత్రమూలాత్కార్యసిద్ధిర్మహారాజప్రదర్శనమ్. 63
దాయేశాచ్ఛుభరాశిస్థే సౌమ్యభుక్తౌ మహత్సుఖం,
వైవాహికం యజ్ఞకర్మ దానధర్మ జపాదికమ్. 64
స్వనామాంకిత పద్యాని నామన్వయ సుధాపివా,
భోజనాంబర భూషాప్తిం నరేశత్వం లభేన్నరః. 65
సత్కథాశ్రవణంచైవ నటగాయక సంకులం,
దాయేశాద్రిపురంధ్రస్థే వ్యయే నీచగతేఽపివా. 66
దేహపీడా మనస్తాపం దారపుత్రాదిపీడనం,
రాజభీతి ర్స్థానహాని ర్మనఃక్లేశం ధనక్షయం. 67
ద్వితీయద్యూననాథేతు దేహజాడ్యం జ్వరాదికం,
విష్ణునామసహస్రంచ అన్నదానంచ కారయేత్. 68
సువర్ణ ప్రతిమాదానం కుర్యా దారోగ్య మాదిశేత్,

తా. సూర్యదశయందు బుధభుక్తి మాసములు ౧౦, దినములు ౬.—ఈబుధుఁడు కేంద్రత్రికోణోచ్చస్థానములయందును, లాభస్థానమునందును, శుభాంశయందు నుండెనేని రాజ్యలాభమును, మహోత్సాహమును, కళత్రపుత్రసౌఖ్యమును, మిత్రుఁడగు రాజువలన వాహనవస్త్రభూషణలాభమును, పుణ్యతీర్థఫలమును, గృహమునఁబశుధనవృద్ధియును గలుగును. ఈబుధుఁడు౯-౧౧స్థానాధిపతులతోఁ జేరియుండినచో వ్యాపారమూలకధనలాభమును గల్గును. ఈబుధుఁడు ౯-౫-౧౦ స్థానములయందు శుభగ్రహములతోఁగూడియుండినచో, స్వకులాచారప్రవర్తనమును, ధర్మబుద్ధియును, గురుదేవతారాధనమును, ధనధాన్యలాభమును, మహావైభవమును, పుత్రోత్సవమును, మిత్రజనమూలకకార్యసిద్ధియును, మహారాజదర్శనమును గల్గును. ఈబుధుఁడు దశానాథునకు శుభస్థానములయందు శుభగ్రహయుతుఁడై యుండినచో అధికసౌఖ్యమును, వివాహవైభవమును, యజ్ఞకర్మఫలమును, దానధర్మజపాదులును స్వనామప్రకటన కీర్తియును, గొప్పగ వేఱపేరుపొందుటయును, సుభోజనవస్త్రభూషణానుభవమును, రాజతుల్యయోగమును, సత్కథాశ్రవణమును,

సంగీతసత్కథాశ్రవణమును, సజ్జనసాంగత్యమును, వినోదక్రియలును, శృంగారమందిరనివాసమును, పరోపకారమును, వ్యవహారజయమును, ప్రయాణముచే ధనలాభమును, బంధుబృందమధ్యమున మృష్టాన్నభోజనముగల్గును. ఈబుధుఁడు రవితోఁగూడి శుభస్థానములయందునుండెనేని తత్వగ్రంథపఠనమును, యోగవిచారమును, రహస్యస్థానములయందుగాని, పెద్దలుసంచరించు కొండలు కోనలు గుహలయందుగాని పోయి వచ్చుట మనస్సంతోషమును గలుగును.

ఈబుధుఁడు దశానాథునకు ౬-౮-౧౨ స్థానములయందుగాని, నీచస్థానమున గాని, లేక లగ్నమునకు౫-౮-౧౨ స్థానములలో నొకటి నీచరాశియైయందునుండి పాపగ్రహయుతుఁడైనను, పాపవీక్షితుఁడైనను, వాతశ్లేష్మక్షయాదిరోగపీడయును, మనస్తాపమును, కళత్రపుత్రపీడయును రాజదండనాదిభయమును, మానహానియును, మనోదుఃఖమును, శత్రుభయమును, ధనక్షయమును, బంధనయోగమును, విదేశగమనమును గల్గును. ఈబుధుఁడు లగ్నమునకు౨-౩ స్థానములయందు నీచగ్రహయుతుఁడై యుండినను తత్ స్థానములకధిపతియైమారకగ్రహములతోఁగూడి యుండినను, దేహజాడ్యముగాని, రాజదండనాదికార్యములుగాని గల్గును. ఇందులకు విష్ణుసహస్రనామపారాయణమును, సువర్ణవిష్ణుప్రతిమాదానమును, అన్నదానమును, యథావిధిగా కృప్రకారము చేయించినచో నాయురారోగ్యమును, కార్యసిద్ధియును, కష్టపరిహారమును గలుగును.

సూర్యదశాయాం కేతుభుక్తిమాసాః ౪, దినాని ౬. తత్ఫలమ్.

శ్లో. సూర్యస్యాంతర్గతే కేతౌ దేహపీడా మనోవ్యథా. 69
ధనవ్యయం రాజకోపం స్వజనోపద్రవం భవేత్,
షష్ఠాష్టమవ్యయే కేతౌ పాపగ్రహసమన్వితే. 70
కపోల దంత రోగశ్చ మూత్రకృచ్ఛ్రాదిసంభవం,
కర్ణ నేత్ర శిరోబాధా హృద్రోగం శత్రుపీడనమ్. 71
స్థానభ్రంశం మిత్రహానిః పితృకర్మం మహాభయం,
లగ్నాత్సుత స్థానగతే యోగకారక సంయుతే. 72
శుభాంశే శుభవర్గేచ శుభకర్మఫలప్రదం,

పుత్రదారాది సౌఖ్యంచ విధవాసంగమో భవేత్. 73
విచిత్ర వస్తు లాభంచ యశోవృద్ధి స్సుఖాదికం,
ద్వితీయ ద్యూన సంస్థేచ అపమృత్యు భయంభవేత్ 74
దుర్గాజపం ప్రకుర్వీత ఛాగదానం తథైవచ,
దుర్గాయాః ప్రతిమాదానం కుర్యా దారోగ్య మాదిశేత్ 75

తా. సూర్యదశయందుఁ గేతుభుక్తిమాసములు ४, దినములు ౬.—ఈ కేతువు దేహపీడయును, మనోవ్యథయును, ధనవ్యయమును, రాజకోపమును, స్వజనోపద్రవమును, వ్యవహారములును, మానప్రాణనిర్బంధమును, అపవాదమును, చోరపీడయును గల్గును. ఈ కేతువు ౬-౮-౧౨ స్థానములయందుఁ బాపగ్రహములతోఁ గూడియుండినచోఁ జెంపలు, పండ్లు, తల, కడుపు ఈస్థానములయందు బాధయును, శత్రుపీడయును, స్థానభ్రంశమును, మిత్రహానియును, పితామహీపితానుజజనమృతియును, పితృకర్మమును, భయమును, వ్యాపారభంగమును, ధనక్షయమును గల్గును. ఈ కేతువు లగ్నమునకుఁ బుత్రస్థానమున యోగకారకునితోఁ జేరియుండినను శుభాంశలయందు శుభవర్గమునందు నుండెనేని గృహమున శుభకార్యములును, కళత్రపుత్రసౌఖ్యమును, విధవస్త్రీసంభోగమును, విచిత్రవస్తులాభమును, కీర్తియును, సుఖమును, శత్రుజయమును గల్గును. ఈ కేతువు లగ్నమునకు ౨-౭, స్థానములయందు మారకగ్రహవీక్షణము గల్గినను, మారకులతోఁ గూడినను మృత్యుభయము గల్గును. అందులకు దుర్గాజపమును, సువర్ణదుర్గాఛాగప్రతిమాదానములును, అన్నదానమును, యామళోక్తప్రకారము చేసినచో నాయురారోగ్యమును, కార్యానుకూలమును గల్గును.

సూర్యదశాయాం శుక్రభుక్తిమాసాః ౧౨. ఫలమ్.

శ్లో. సూర్యస్యాంతర్గతే శుక్రే లగ్నాత్కేంద్రత్రికోణగే,
స్వోచ్చ మిత్ర స్వవర్గస్థే ఇష్టస్త్రీభోగసౌఖ్యదమ్. 76
గ్రామాంతర ప్రయాణంచ బ్రాహ్మణ ప్రభుదర్శనం,
భూమిలాభం ధాన్యలాభం బంధుమిత్రసమాగమమ్. 77
గృహేకల్యాణసంపత్తిః నిత్యమృష్టాన్నభోజనం,

వస్త్రభూషణలాభంచ వాహనం ఛత్రలాభకృత్. 78
వ్యాపారా ద్ధనలాభంచ స్త్రీమూలాత్కార్యసిద్ధిదం,
షష్ఠాష్టమవ్యయేశుక్రే పాపగ్రహసమన్వితే. 79
రాజకోపం మనఃక్లేశం జాయాపీడా ధనవ్యయం,
బంధుద్వేషం భూమినాశం అన్యగృహ నివాసకమ్. 80
దేహజాడ్యం బంధునాశం ఋణపీడా నృపాద్భయం,
ద్వితీయ ద్యూననాథేతు దేహపీడా భవిష్యతి. 81
తద్దోష పరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్

తా. సూర్యదశయందు శుక్రభుక్తిమాసములు ౧౨.— ఈ శుక్రుఁడు లగ్నమునందుగాని, కోణకేంద్రములయందు నుచ్చస్థానమునందు మిత్రక్షేత్రమునందు నుండినచో ప్రియస్త్రీసంభోగమును, గ్రామాంతరప్రయాణమును, బ్రాహ్మణ ప్రభుదర్శనమును, భూమిలాభమును, ధాన్యలాభమును, బంధుమిత్రజన సమాగమమును, గృహమునఁ గల్యాణాదిసంతోషమును, మృష్టాన్నభోజనమును, వస్త్రభూషణవిక్రయలాభమును, అశ్వవాహనలాభమును, శకటసంచారమును, ఛత్రలాభమును, వ్యాపారమూలకధనాభివృద్ధియును, స్త్రీమూలకసత్కార్యానుకూల్యమును, బంధుగృహ కల్యాణదర్శనమును, సంగీతవాద్య ఘోషశ్రవణమును గలుగును. ఈశుక్రుఁడు లగ్నమునకు ౧౨ - ౮ - ౬ స్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై దుర్బలుఁడై యుండినచో రాజకోపమును మనశ్చింతయును, కళత్రరోగమును, ధనవ్యయమును, కళత్రగర్వమును, బంధుద్వేషమును, భూవిక్రయమును, అన్యగృహ నివాసమును, దేహజాడ్యమును, బంధుజన మృతియును, ఋణాధనపీడయును, రాజభయమును గల్గును. ఈ శుక్రుఁడు ౨-౭ స్థానములయందు బలియుఁడై మారకగ్రహవీక్షణము గల్గియుండెనేని అపమృత్యుభయముఁగల్గును. అందులకు మృత్యుంజయ జపముగావించినచో నాయురారోగ్యముఁ గల్గును.

సూర్యదశాంతర్దశాఫల వివరణము సంపూర్ణము.

శ్లో. స్వోచ్ఛక్షేత్రగే చంద్రే త్రికోణే లాభగేఽపివా,
భాగ్య కర్మాధిపై ర్యుక్తే గజాశ్వాంబర సంకులమ్. 1
దేవతాగురుభక్తిశ్చ పుణ్యశ్లోకాదికీర్తనం,
సస్యలాభం మహత్సౌఖ్యం భూవృద్ధి ర్ధనలాభకృత్. 2
భాగ్యచంద్రే పూర్ణఫలం రాజయోగప్రవృద్ధిదం,
సేనాధిక్యం కార్యసిద్ధిం స్త్రీశయ్యాదిసుఖంభవేత్ 3
షష్ఠాష్టవ్యయగేచంద్రే నీచరాశిస్థితేఽపివా,
స్థానభ్రంశం దేహపీడా ఋణపీడా ధనవ్యయం. 4
బంధుమిత్రమనస్తాపం రాజద్వారే విరోధకృత్,
మాతృనాశం బంధనంచ మానహానికరో భవేత్ 5
ద్వితీయ ద్యూననాథేతు దేహజాడ్యం మనోరుజః,
అస్త్రశస్త్రభయం చైవ వ్రణరోగ వివృద్ధిదమ్. 6
తద్దోష పరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్,
శ్వేతాంగాం మహిషీం దద్యా దాయురారోగ్యమాదిశేత్. 7

తా. చంద్రదశయందుఁ జంద్రభుక్తిమాసములు ౧౦.— ఈ చంద్రుఁడు కేంద్రత్రికోణోచ్చస్థానములయందుండినను ౯-౧౦ స్థానాధిపతులతోఁ గూడినను గజాశ్వవస్త్రలాభమును, దేవతాగురుభక్తియును, పుణ్యశ్లోకసంకీర్తనమును,సస్యాభివృద్ధియును,భూమివృద్ధియును, ధనలాభమును గల్గును. ఈచంద్రుఁడు భాగ్యస్థానమున సంపూర్ణచంద్రుఁడై యుండినను, శుభులతోఁ గూడియుండినను, రాజయోగాభివృద్ధియును, సేనాధికారమును, స్త్రీశయ్యాభోగమును, రాజజనస్నేహమును గలుగును. ఈచంద్రుఁడు ౬-౮-౧౨ స్థానములయందు నీచుఁడై యుండినను, పాపగ్రహయుక్తుఁడై యుండినను, స్థానభ్రంశమును, దేహపీడయును, ఋణధనపీడయును, ధనవ్యయమును, బంధుమిత్ర మనస్తాపమును, రాజద్వారమున విరోధమును, మాతృనాశమును, బంధనాది కష్టములును, మానహానియును, కళత్రదోషగర్భమును, మాతుల

వంశజనారిష్టమును గల్గును. ఈచంద్రుఁడు ౨-౭ స్థానాధిపతియై పాప గ్రహాయుతుఁడై దుర్బలుఁడై యుండినచో దేహజాడ్యమును, అస్త్ర శస్త్రభయమును, వ్రణభయమును గల్గును. అందులకు మృత్యుంజయ జపమును, శ్వేతగోవును, మహిషమును దానమిచ్చినచో నాయురా రోగ్యములు గల్గును.

చంద్రదశాయాం కుజభుక్తిమాసాః ౭. తత్ఫలమ్.

శ్లో. చంద్ర స్యాంతర్గతే భౌమే లగ్నాత్కేంద్రత్రికోణగే,
సౌభాగ్యం రాజసమ్మానం వస్త్రాభరణలాభకృత్. 9
యత్నకార్యార్థ సిద్ధిస్స్యా దారోగ్యం మిత్రదర్శనం,
భూలాభం గృహనిర్మాణం భ్రాతృవర్గ వివృద్ధిదమ్. 9
చంద్రాత్కేంద్రగతే భౌమే తుంగ స్వాంశే శుభాంశగే,
పుత్రోత్సవం శత్రునాశం వ్యాపారోద్యోగ సిద్ధిదమ్. 10
కళత్రసౌఖ్యం స్వజనే కల్యాణం భూరిలాభకృత్,
నైరృత్యాం దక్షిణేభాగే ప్రయాణం కార్యసిద్ధిదమ్. 11
షష్ఠాష్టమ వ్యయే భౌమే నీచే పాపసమన్వితే,
గృహక్షేత్రాది నాశంచ రాజద్వారే విరోధకృత్. 12
భ్రాతృవర్గేషు కలహం కార్యభంగం నృపాద్భయం,
చోరాగ్ని వ్రణభీతిశ్చ ద్రవ్యనష్టం భవిష్యతి. 13
ద్వితీయ ద్యూన నాథేతు కార్యవిఘ్నం మనోరుజం,
తద్దోషపరిహారార్థం సుబ్రహ్మణ్య జపంచరేత్. 14

తా. చంద్రదశయందు అంగారకభుక్తిమాసములు ౭.— ఈ యంగారకుఁడు కేంద్రకోణములయందు బలియుఁడై యుండినచో సౌభాగ్యమును, రాజసమ్మానమును, వస్త్రాభరణలాభమును, ప్రయత్న కార్యసిద్ధియును, ఆరోగ్యమును, మిత్రదర్శనమును, భూలాభమును, గృహనిర్మాణమును, భ్రాతృవర్గాభివృద్ధియును, శకటములు, ఖడ్గములు, మేఁకలు మున్నగునవి విక్రయముచేసి ధనమార్జించుటయు నగును.

ఈ యంగారకుఁడు చంద్రునకుఁ గేంద్రత్రికోణోపచయస్థానములనుండినను నుచ్చస్థితుఁడై యుండినను శుభాంశలయందుఁ గాని,

శుభవర్గములయందుగాని, స్వాంశయందుఁగాని బలియుఁడై యుండినచో శత్రునాశమును, పుత్రోత్సవమును, వ్యాపారోద్యోగసిద్ధియును, కళత్రసౌఖ్యమును, స్వజనులందు కల్యాణవైభవమును, స్వర్ణరత్నక్రయవిక్రయలాభమును, నిరృతి దక్షిణదిశ ప్రయాణముచేతఁ గార్యభ్రాతృవర్గకల్యాణమును గల్గును. ఈయంగారకుఁడు ౬-౮-౧౨ స్థానములయందు నీచస్థితుఁడై యుండినను, పాపగ్రహసమన్వితుఁడై యుండినను, గృహభూనాశమును, రాజద్వారమున వైరమును, ఋణధనబాధయును, భ్రాతృవర్గమునందుఁ గలహమును, కార్యభంగమును, రాజజనవిరోధమును, చోర అగ్ని వ్రణ విషజంతుభయమును, ఎత్తుగనుండు చోటునుండి క్రిందపడుటయును, పాకశాలయందు వంటపనులు చేయుట, అకస్మాద్వ్యవహారము చేత ధనవ్యయమును, దుష్టజనస్నేహమును, రాతి దెబ్బలును గలుగును. ఈయంగారకుఁడు ౨-౭ స్థానములయందుండినను, ఆస్థానములకధిపతియై మారకయుక్తుఁడై యుండెనేని కార్యవిఘ్నమును, మనోవ్యాధియును, స్ఫోటకవ్యాధిపీడయును గల్గును. అపమృత్యురోగమును గల్గును. అందులకు సుబ్రహ్మణ్యజపమును, స్వర్ణవృషభప్రతిమయు, నాఢకధాన్యమును, దానము యథోక్తప్రకారముచేసినచో శుభము, నాయురారోగ్యము గల్గును.

చంద్రదశాయాం రాహుభుక్తిమాసాః ౧౮. ఫలమ్.

శ్లో. చంద్రస్యాంతర్గతే రాహౌ లగ్నాత్కేంద్రత్రికోణగే,
చోరాగ్నినృపభీతిశ్చ విషజంతూపద్రవంభవేత్ 15
బంధుద్వేషం మిత్రహానిః స్వస్త్రీవైరం ధనక్షయం,
అకస్మాత్కలహం చైవ వ్యాపారాత్కలహంభవేత్ 16
మాతృనాశం పితుఃక్లేశం చతుష్పాజ్జీవనాశనం,
శుభయుక్తే శుభైర్దృష్టే పంచమస్థే శుభాన్వితే. 17
యత్న కార్యార్థ సిద్ధిస్స్యాద్వ్యాపారే ధనలాభకృత్,
నైరృత్యాం పశ్చిమేభాగే ప్రయాణం మిత్రదర్శనమ్. 18
వాహనాంబర లాభంచ స్వాధికారాభి వృద్ధిదం,
శూద్రనీచజనస్నేహం తస్మాలాత్కార్యసిద్ధిదమ్. 19
షష్ఠాష్టమవ్యయేనీచే దాయేశాద్రిపురిప్ఫగే,

స్థానభ్రంశం మనఃక్లేశం ఋణవ్రవ్యాదిపీడనమ్. 20
వృశ్చికోరగ చోరాగ్ని నృపబాధార్థనాశనం,
దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేఽపివా. 21
పరోపకారధర్మాది పుణ్యతీర్థఫలప్రదం,
స్త్రీదేవతార్చనం సౌఖ్యం మంత్ర మౌషధ సంగ్రహమ్. 22
ద్వితీయ ద్యూనరాశిస్థే దేహపీడా భవిష్యతి,
తద్దోష పరిహారార్థం దుర్గాప్రీతిం జపంచరేత్ 23
నాగదానం చ కుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్,

తా. చంద్రదశయందు రాహుభుక్తిమాసములు ౧౮.—ఈరాహువు ౧-౪-౭-౧౦-౫-౯ స్థానములయందు నుండినచో చోర, అగ్ని, రాజ, విషజంతుపీడయును, బంధుద్వేషమును, మిత్రహానియును, స్వస్త్రీమర్మకార్యనశాద్విరోధమును, లేక స్వస్త్రీనాశమును, స్వస్త్రీమూలకముగ వస్త్రభూషణక్షయమును, అకస్మాత్కలహమును, వ్యాపారమునందు మనస్తాపమును, మాతృకర్మయును, పితృదుఃఖమును, చతుష్పాజ్జీవనాశనమును, వాహనవిక్రయమును, శత్రుబాధయును, దాయాదిజనమృతవార్తాగమపత్రిక చదువుటయును, కార్యవిఘ్నమును, అన్యస్త్రీసంగమమును, అనాచారప్రవర్తనమును గలుగును. ఈరాహువు పంచమస్థానమున శుభగ్రహయుతుఁడై శుభగ్రహములచేఁ జూడఁబడుచు నుండెనేని యత్నకార్యానుకూలమును, వ్యాపారముచే ధనలాభమును, నిర్ఋతిపశ్చిమదిశప్రయాణముచేత మిత్రదర్శనమును, వాహనవస్త్రలాభమును, స్వాధికారముచేత ధనాభివృద్ధియును, శూద్రనీచజనులవలన వ్యాపారము చేయించుటచేత ధనలాభమును, స్నేహమును గలుగును. ఈరాహువు దశానాథునకుఁ గేంద్రకోణములయందును 3-౧౦ స్థానములయందును, బలవంతుఁడై యుండినచోఁ బరోపకారమును, ధర్మకర్మములను, పుణ్యతీర్థఫలమును, స్త్రీదేవతారాధనమును, మంత్రతంత్రౌషధవిచారమును గల్గును. ఈరాహువు ౨-౭ స్థానములయందు మారకగ్రహయుతుఁడై యుండినను మారకగ్రహముచేఁ జూడఁబడుచు మారకాధికారము గల్గియుండినచో

అపమృత్యుపీడగల్గును. స్ఫోటకజ్వరాతిసారపీడగాని గల్గును. అందు లకుఁ బరిహారము దుర్గాజపమును, స్వర్ణనాగదానమును యామిళోక్త ప్రకారముచేసినచో నాయురారోగ్యమును, ప్రయత్నకార్యానుకూల మును గలుగును.

చంద్రదశాయాం గురుభుక్తిమాసాః ౧౬. తత్ఫలమ్.

శ్లో. చంద్రస్యాంతర్గతే జీవే స్వోచ్చస్వక్షేత్రకేంద్రగే. 24
మిత్రత్రికోణలాభస్థే బలయుక్తే శుభాన్వితే,
వస్త్రాలంకారలాభంచ బంధుప్రీతిం ధనాగమమ్. 25
శుభశోభనకార్యాణి గృహభూపశులాభకృత్,
దేవాగార ప్రతిష్ఠాచ దానధర్మ వివృద్ధిదమ్. 26
రాజాశ్రయం మహోత్సాహం గజవాజి సమన్వితం,
వనకూపప్రతిష్ఠాచ విప్రప్రభు వశాత్సుఖమ్. 27
పశ్చిమాం దిశ మాశ్రిత్య కార్యసిద్ధి ర్యశోఽధికం,
పుత్రోత్సవం సస్యలాభం గళగ్రాను నివాసకమ్. 28
షష్ఠాష్టమ వ్యయే జీవే నీచే వాఽ స్తంగతేఽపివా,
పాపగ్రహ సమాయుక్తే ధర్మనాశం మనోరుజమ్. 29
పితృవర్గే జనారిష్టం అథవా పుత్రపీడనం,
స్థానభ్రంశం కార్యవిఘ్నం లాభాధిక్యం ధనవ్యయమ్. 30
అకస్మాత్కలహంచైవ శత్రుభీతిం కరోతిచ,
చతుష్పాజ్జీవనాశంస్యా ద్దిష్టబంధువిరోధకృత్ 31
దాయేశా త్కేంద్రకోణస్థే దుశ్చిక్యే లాభగేఽపివా.
పూర్ణచంద్ర సమాయుక్తే స్వాంశే బలసమన్వితే. 32
కల్యాణం భూరిసంపత్తిః ధైర్యవీర్యపరాక్రమం,
రాజ్యశ్రీధనలాభంచ స్వాధికారాభివృద్ధిదమ్. 33
వాహనాంబరపశ్వాది లాభం దైవతదర్శనం,
ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి. 34
తద్దోష పరిహారార్థం శివసాహస్రకంజపేత్,
లింగదానంచ కుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్. 35

తా. చంద్రదశయందు గురుభుక్తి మాసములు ౧౬ — ఈగురువు స్వక్షేత్రోచ్ఛ కేంద్రస్థానములయందుఁగాని, మిత్రక్షేత్రమునఁగాని, త్రికోణస్థానములంగాని శుభగ్రహములతోఁ జేరి బలయుతుఁడై యుండెనేని వస్త్రములు, సొమ్ములు, విక్రయలాభమును, బంధుప్రీతియును, ధనాగమమును, శుభకార్యములు జరుగుటయును, గృహభూమిపశులాభమును, దేవాలయాదిప్రతిష్ఠలును, దానధర్మపరోపకారాభివృద్ధియును, రాజాశ్రయమును, మహోత్సాహమును, గజ, అశ్వ, పశుయుతత్వమును, వనమును, బావులును, చెఱువులును గట్టించుటయును, బ్రాహ్మణప్రభుమూలక కార్యసంసిద్ధియును, పశ్చిమదిశప్రయాణమును, స్వకార్యానుకూలమును, పుత్రోత్పత్తియును, సస్యవృద్ధియు, ధాన్యలాభమును, గొప్పపట్టణములయందు నివాసమును, వ్యాపారమూలక ధనలాభమును, స్వాధికారకీర్తియును, రాజవ్యవహారజయమును, గురుదర్శనమును, సత్కథాశ్రవణమును, ద్విమాతృప్రాప్తియును, కళత్రశయ్యాసుఖమును, బంధుసన్మానమును, మృష్టాన్నభోజనమును, శివకేశవదేవతోత్సవదర్శనమును, శత్రుజయమును, బంధుమిత్రగృహములయందు వివాహాదిశుభవర్తనమును, వాహనసంచారమును గల్గును. ఈగురువు, లగ్నమునకు షష్ఠాష్టమవ్యయనీచస్థానంబులంగాని, శత్రురాశియందుఁగాని, అస్తంగతరాశియందుఁగాని, పాపగ్రహములతోఁ గూడి దుర్బలుఁడై యుండినచో ధర్మకార్యభంగమును, మనోవ్యాధియును, పితృవర్గజనారిష్టమును, పుత్రదోషమును, స్థానభ్రంశమును, కార్యవిఘ్నమును, లాభమునకు మించినధనవ్యయమును, అకస్మాత్కలహమును, శత్రుభయమును, చతుష్పాజ్జీవనాశమును, స్వబంధుద్వేషమును, రాజదండనాదికార్యాన్వితత్వమును, మానప్రాణహానియును, పశువిక్రయమును, అన్యగ్రామసంచారమును, అధికనిద్రయును, అనాచారకార్యములు సహించుటయును, కళత్రదేహాజాడ్యమును గల్గును. ఈగురువు దశానాథునకు ౧-౪-౭-౧౦-౫-౯-౩-౧౧స్థానములయందుఁ బూర్ణబలుఁడై యుండినను, అట్టి సంపూర్ణబలయుతోఁ బూర్ణచంద్రునితోఁ గూడియుండినను, స్వాంశద్రేక్కాణములయందు బలవంతుఁడై యుండినను, కల్యాణాది శుభప్రాప్తియును,

ధనసంపత్తియును, ధైర్యపరాక్రమాభివృద్ధియును, రాజ్యలాభమును, వ్యాపారసిద్ధియును, వాహనవస్త్రభూషణవిక్రయలాభమును, పశురక్షణయును, దేవతాదర్శనమును, గొప్పవారితో స్నేహమును, స్వాధికారకీర్తియును; రాజజనస్నేహమును, బంధుమిత్రగృహములకుఁ బోయివచ్చుటయును గల్గును. గురువు బలవర్జితుఁడై పాపసమన్వితుఁడై శనిరాహులచేఁ జూడఁబడుచు నుండెనేని, కళత్రదోషమును, వాతపిత్తవ్యాధియును, కళత్రవంశజనారిష్టమును, పితృక్లేశమును గల్గును. ఈగురువు ౨-౭ స్థానములయందు నుండినచో అపమృత్యుదోషము ప్రాప్తించు. అందులకు, శివసహస్రనామపారాయణమును, స్వర్ణలింగప్రతిమాదానమును,విధిప్రకారము చేయించినచో,సర్వకార్యానుకూలమగును. దేహారోగ్యమగును.

చంద్రదశాయాం శనిభుక్తిమాసాః ౧౯. తత్ఫలమ్.

శ్లో. చంద్రస్యాంతర్గతే మందే లగ్నాత్కేంద్ర త్రికోణగే,
స్వక్షేత్రే స్వాంశగేతుంగే మిత్రాలయ సమన్వితే. 36
లాభేవా శుభరాశిస్థే నవాంశే బలసంయుతే,
పుత్రమిత్రార్థసంపత్తిః శూద్రప్రభు సమాగమమ్. 37
వ్యవసాయా త్ఫలాధిక్యం గృహలాభం యశోఽధికం,
పుత్రలాభం కార్యసిద్ధిం కల్యాణం బంధుదర్శనమ్. 38
నైరృత్యాం పశ్చిమేభాగే శూద్రమూలా ద్ధనాగమం,
నవీనకార్యచింతాచ తత్కార్యం సఫలంభవేత్ 39
షష్ఠాష్టమ వ్యయే నీచే శత్రుక్షేత్రగతేయది,
బంధుద్వేషం రోగపీడా పితృనాశం ధనక్షయమ్. 40
ఋణద్రవ్య ప్రపీడాచ విదేశగమనంధ్రువం,
మానభంగం రాజభీతిః వ్రణ చోరాగ్నిపీడనమ్. 41
ద్వితీయద్యూనరాశిస్థే దేహజాడ్యం భవిష్యతి,
తద్దోష పరిహారార్థం మృత్యుంజయ జపం చరేత్ 42
కృష్ణాంగాం మహిషీందద్యా ద్దానే నారోగ్య మాదిశేత్,

తా. చంద్రదశయందు శనిభుక్తి మాసములు ౧౯.—ఈశని లగ్నమునకుఁ గేంద్రత్రికోణములయందును, స్వక్షేత్రమునందును,స్వాంశయందును,పరమోచ్చస్థానమునందును, మిత్రక్షేత్రమునందును,లాభస్థానమునందును,శుభరాసులయందును, నవాంశయందు బలరాశిలో నుండెనేని పుత్రమిత్రధనలాభమును,శూద్రప్రభువువలనఁ గార్యానుకూలమును, వ్యవసాయసిద్ధియును, గృహనిర్మాణ కార్యములును, కీర్తియును, పుత్రోత్పత్తియును, కల్యాణాదిశుభవైభవములును,బంధుదర్శనమును, నిరృతిపశ్చిమదిశయందుఁ బ్రయాణమును, శూద్రజన నీచజనమూలక వ్యాపారాభివృద్ధిచే ధనలాభమును, నీచవ్యాపారములును, నూతనకార్యాలోచనారంభమును, తత్కార్యసిద్ధియును గల్గును. ఈశని ౬-౮-౧౨ స్థానములయందును, నీచశత్రుస్థానములయందును, పాపగ్రహయుతుఁడై యుండెనేని బంధుద్వేషమును, వాతశ్లేష్మగుల్మాదిరోగపీడయును, పితృజనారిష్టమును, ధనక్షయమును, ఋణధనబాధయును, విదేశగమనమును, మానభంగమును, రాజదండనభీతియును, వ్రణచోరాగ్నిజ్వరపీడయును, అకస్మాత్కలహమును, తీర్థస్నానదేవతోత్సవదర్శనమును గల్గును. ఈశని లగ్నమునకు ౨-౭ స్థానములయందు నుండెనేని దేహజాడ్యము గల్గును. కార్యభంగమగును.అందులకు,మృత్యుంజయజపమును, నల్లనియావు, నెనుమును, దానము కల్పోక్తప్రకారము చేసినచో నాయురారోగ్యమును, కార్యానుకూలము నగును.

చంద్రదశాయాం బుధభుక్తిమాసాః ౧౭. తత్ఫలమ్.

శ్లో. చంద్రస్యాంతర్గతే సౌమ్యే కేంద్రలాభ త్రికోణగే. 43
స్వక్షేత్ర స్వాంశగేచైవ తుంగేవా బలసంయుతే,
శుభాంశే శుభరాశిస్థే శుభగ్రహ సమన్వితే. 44
కల్యాణం బంధుసమ్మానం ప్రియ వస్త్రాశ్వ లాభకృత్,
విద్యావినోద సద్గోష్ఠిం జ్ఞానవృద్ధి సుఖాధికమ్. 45
పుత్రోత్సవం యశోవృద్ధిం వాణిజ్యం ధనలాభకృత్,
రత్నభూషణ ముక్తాది క్రయవిక్రయ లాభకృత్ 46
శత్రునాశం కార్యసిద్ధి సత్కథా శ్రవణం భవేత్,

రాజప్రీతికరంచైవ విద్వజ్జన సమాగమమ్. 47
గీతవాద్యాదిఘోషంచ దేవతోత్సవదర్శనం,
ప్రయాణం మిత్రసమ్మానం దివ్యమందిర వాసకృత్ 48
అపూర్వ వస్తుసంప్రాప్తిః మాతృవంశాభివృద్ధిదం,
షష్ఠాష్ట వ్యయగే నీచే తద్భుక్తౌ దేహపీడనమ్. 49
కారాగృహ ప్రవేశంచ దార పుత్రాదిపీడనం,
బంధు మిత్ర మనస్తాపం నానాకష్టంభయంభవేత్ 50
ద్వితీయ ద్యూననాథేతు జ్వరపీడామహాభయం,
భాగదానం ప్రకుర్వీత విష్ణుసాహస్రకం జపేత్ 51
శాంతి మారోగ్య మాప్నోతి సర్వత్ర విజయీభవేత్

తా. చంద్రదశయందు బుధభుక్తి మాసములు ౧౭ — ఈబుధుఁడు కేంద్రకోణోచ్చలాభస్వక్షేత్రస్వాంశశుభస్థానములయందు శుభగ్రహయుతుఁడై యుండెనేని గృహమునఁ గల్యాణమును,బంధుసమ్మానమును, ప్రియవస్త్రభూషణాశ్వలాభమును, విద్యావినోదగోష్ఠియును, జ్ఞానాభివృద్ధియును, పుత్రోత్సవమును, కీర్తివృద్ధియును, వ్యాపారమూలకధనలాభమును,రత్నభూషణవిక్రయలాభమును,శత్రునాశమును, కార్యసిద్ధియును, సత్కథాశ్రవణమును, రాజప్రీతియును, విద్వజ్జనసమాగమమును, సంగీతవాద్యశ్రవణమును, దేవతోత్సవదర్శనమును, అన్యగ్రామప్రయాణమును, మిత్రజనవశాత్కార్యానుకూలమును, సుందరమందిరనివాసమును, అపూర్వవస్తుసంప్రాప్తియును, మాతృవంశాభివృద్ధియును గలుగును. ఈబుధుఁడు ౬-౮-౧౨ స్థానములయందును, నీచస్థానమునందును, దశానాథునకు ౬-౧౨-౮ స్థానములయందును, పాపగ్రహయుతుఁడయ్యెనేని తద్భుక్తియందు దేహపీడయును,రాజాంగజనబంధనమును,కారాగృహప్రవేశమును, కళత్రపీడయును, పుత్రదోషమును, బంధుమిత్రజనమనస్తాపమును, నానావిధమగుకష్టములును, భయమును, స్వజనమృతాశౌచమును, ఋణపీడచే దేహాయాసమును గల్గును. ఈబుధుఁడు లగ్నమునకు ద్వితీయ సప్తమస్థానములయందు మారకాధిపత్యము గల్గియుండెనేని జ్వరపీడయును,వాతశ్లేష్మాదిరోగముగాని గల్గును. తత్పరిహారము విష్ణుసహస్రనామపారాయణమును,స్వర్ణమేష ప్రతిమా

దానమును, లేక లక్ష్మీనారాయణప్రతిమాదానముగాని యథావిధిగఁ జేసినచో సర్వకార్యానుకూలమును, శ్రేయమును గల్గును.

చంద్రదశాయాం కేతుభుక్తిమాసాః ౭. తత్ఫలమ్.

శ్లో. చంద్రస్యాంతర్గతే కేతౌ రిపు దుశ్చిక్యలాభగే. 52
శుభయుక్తేఽథవా దృష్టే ఽర్థలాభం కృషివృద్ధిదం,
స్వాధికారార్థలాభంచ విధవా సంగమోభవేత్. 53
చోరమూలాద్ధనప్రాప్తిః పుణ్యకర్మ వివృద్ధిదం,
రాజప్రీతికరంచైవ మనస్సంతోష మాప్నుయాత్. 54
కేంద్రకోణ సమాయుక్తే భుక్త్యాదౌ కలహం భవేత్
భుక్తిమధ్యే శత్రుభయం భుక్త్యంతే సుఖమాప్నుయాత్ 55
దాయేశాద్రిపురంధ్రస్థే వ్యయే నీచస్థితేయది,
కార్యవిఘ్నం భూతపీడా ఋణపీడా ధనవ్యయమ్. 56
విధవా కలహంచైవ శిరోరోగం కరోతిచ,
గోమహిష్యాది నాశంచ రాజవైరం మనోరుజమ్ 57
అన్యగేహనివాసంచ ప్రయాణం కార్యనాశనం,
అకాలభోజనంచైవ విషజంతుభయం భవేత్. 58
పితృనాశం మాతృపీడా బంధువైషమ్య మాదిశేత్,
ఉన్నతాత్పతనంచైవ వాతాండవ్యాధి సంభవమ్ 59
ద్వితీయ ద్యూనరాశిస్థే నానారోగం మహద్భయం,
రుద్రజప్యం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్. 60

తా. చంద్రదశయందుఁ గేతుభుక్తిమాసములు ౭.—ఈ కేతువు ౬-౩-౧౧ స్థానములయందు శుభులతోఁగూడినను, జూడఁబడినను, ధనలాభమును, కృషివృద్ధియును, స్వాధికారముచే ధనలాభమును, విధవస్త్రీసంగమంబును, చోరధనలాభమును, పుణ్యకర్మాభివృద్ధియును, రాజప్రీతిచేతఁ గార్యానుకూలమును, మనస్సంతోషమును, పుత్రజననమును, గృహమునఁ గల్యాణాదులును, చిత్రాన్నభోజనమును, వ్యాపారసిద్ధియును, కళత్రసౌఖ్యమును గలుగును. ఈ కేతువు కేంద్రకోణములయందునుండి శుభగ్రహయుతుఁడు

గాకుండెనేని భుక్త్యాదియందు వకస్మాత్కలహమును, భుక్తిమధ్యమందు శత్రుపీడయును, మృతాశౌచకర్మలును, భుక్త్యంతమున నధిక సౌఖ్యమును గల్గును. దశానాథునకు ౮ - ౬ స్థానములయందుఁగాని, నీచరాశియందుఁగాని, శుభులచేఁ జూడఁబడక యుండినచో కార్యవిఘ్నమును, భూతపిశాచపీడయును, ఋణధనబాధయును, ధనవ్యయమును, విధనస్త్రీకలహమును, శిరోదంతరోగమును, పశుమహిష్యాదినాశమును, రాజవిరోధమును, స్వాధికారచలనమును, అన్యగృహనివాసమును, ప్రయాణవిఘ్నమును, అకాలభోజనమును, విషజంతూపద్రవమును, పితగాని మాతగాని వియోగమగుటయును, బంధుద్వేషమును, ఎత్తుగ నుండుచోట నుండి క్రిందపడుటయును, వాతశ్లేష్మాంఢరోగమును, పుత్రమిత్రపీడయును, కళత్రకలహమును, లేక కళత్రనాశమును, నానాకష్టమును గల్గును. ఈ కేతువు ౨ - ౭ స్థానములయందు మారకాధిపత్యము కల్గి మారకగ్రహములచేఁ జూడఁబడుచునుండినచో దేహజాడ్యమును, కార్యవిఘ్నమును, శత్రుభయమును, కఠినవాక్కులును, అధికకోపమును గల్గును. తద్దోషపరిహారముగ రుద్రజపమును స్వర్ణలింగదానమును జేసినచో సర్వకార్యానుకూలమగును.

చంద్రదశాయాం శుక్రభుక్తిమాసాః ౨౦. తత్ఫలమ్.

శ్లో. చంద్రస్యాంతర్గతే శుక్రే కేంద్ర లాభ త్రికోణగే,
స్వోచ్చ స్వక్షేత్రగేవాఽపి శుభగ్రహ సమన్వితే. 61
మిత్రరాజప్రసాదేవ వాహనాంబరలాభకృత్,
చతుష్పాజ్జీవలాభంచ భూలాభం కీర్తివర్ధనమ్. 62
నూతనగృహనిర్మాణం కల్యాణం బంధుదర్శనం,
సుగంధ పుష్పశయ్యాది స్వస్త్రీసౌఖ్యాభివృద్ధిదమ్. 63
స్వాధికారాభివృద్ధిస్స్యా దకస్మాద్రాజదర్శనం,
గీతవాద్యవినోదంచ గజాంతైశ్వర్యమాప్నుయాత్ 64
బంధుకల్యాణవిభవం నిత్యమృష్టాన్నభోజనం,
వ్యాపారేణార్థలాభంచ ప్రియ మిత్రవశాత్సుఖమ్. 65

దశాధిపేనసంయుక్తే దేహసౌఖ్యం ధనాగమం,
గృహే కల్యాణసంప్రాప్తిః రాజపూజా యశోధికమ్. 66
స్వాధికారవివృద్ధించ స్త్రీమూలాచ్చ ధనాగమం,
షష్ఠాష్టమవ్యయే నీచే పాపగ్రహ సమన్వితే. 67
రాజ మంత్రి విరోధంస్యా చ్చతుష్పాజ్జీవనాశనం,
భార్యాపీడా యశోహాని ర్బంధునాశం ధనక్షయమ్. 68
భాగ్యహాని ర్మనఃక్లేశం స్త్రీమూలా త్కలహంభవేత్,
పితృకర్మాధికారంచ అథవా మాతృనాశనమ్. 69
స్థానభ్రంశం కార్యవిఘ్నం ఋణపీడా భవేద్ధ్రువమ్,
భాగ్యలాభాధిపైర్యుక్తే భాగ్యవృద్ధికరంభవేత్. 70
దేవ బ్రాహ్మణ భక్తిశ్చ ముక్తాభరణ లాభకృత్,
దాయేశా ల్లాభ కేంద్రస్థే స్వాంశస్వోచ్చ త్రికోణగే. 71
నూతన గృహ నిర్మాణం విద్యాలాభం సుతోదయం,
వ్యాపా రోద్యోగ లాభంచ శత్రునాశం ధనాగమమ్. 72
సంగీత వాద్యనటనం సత్కథాశ్రవణం భవేత్,
అన్యస్త్రీ సంగమంచైవ బంధుకల్యాణ సంభవమ్. 73
దాయేశా ద్రిపురంధ్రస్థే వ్యయేవా పాపసంయుతే,
విదేశవాస దుఃఖార్తిం నృపచోరాగ్నిపీడనమ్. 74
స్వాధికార వినాశంచ మిత్ర ద్వేషం మనోరుజం,
ద్వితీయ ద్యూననాథేతు అపమృత్యుర్భయంభవేత్. 75
తద్దోషపరిహారార్థం దుర్గాజాపంచకారయేత్,
స్వర్ణస్యప్రతిమాంసద్యా చ్ఛాంతి మాప్నోత్యసంశయః. 76

తా. చంద్రదశయందు శుక్రభుక్తిమాసములు ౨౦—ఈశు క్రుఁడు ౧-౪-౫-౭-౯-౧౦-౧౧ స్థానములయందుఁగాని, స్వక్షేత్రోచ్చ స్థానములయందుఁగానిశుభగ్రహములతోఁగూడిబలముతోనుండినచో మిత్రప్రభుమూలకముగ వాహనాంబరలాభమును, చతుష్పాజ్జీవలాభ మును,భూలాభమును, కీర్తియును, నూతనగృహనిర్మాణమును, కల్యాణ ప్రాప్తియును, బంధుదర్శనమును, సుగంధపుష్పశయ్యాదిస్త్రీసౌఖ్యము ను, స్వాధికారాభివృద్ధియును, అకస్మాద్రాజదర్శనమును, గీతవాద్యవినో

దమును, బంధుకల్యాణదర్శనమును, నిత్యము మృష్టాన్నభోజనమును, వ్యాపారమూలాద్ధనలాభమును, మిత్రజనవశాత్కార్యసంసిద్ధియును, పుత్రోత్పత్తియును, అథవా పుత్రవర్గమునఁ గల్యాణాదులును, దూర బంధుసమ్మానమును గలుగును. ఈశుక్రుఁడు దశానాథునితోఁ జేరి యుండినచో దేహసౌఖ్యమును, ధనాగమనమును, ఋణబాధనివృత్తియు నగును. ఈశుక్రుఁడు బుధరవులతోఁ జేరి చరస్థిరరాసులయం దుండినచో నీభుక్తియందు వివాహవ్యయమగును. కళత్రముండును. గృహమున వివాహాదిశుభకార్యములును, రాజసమ్మానమును, యశోవృద్ధియును, స్వాధికారముచే ధనలాభమును, స్త్రీమూలక ధనలాభమును, లేక భూలాభముగాని గల్గును. ఈశుక్రుఁడు ౬-౮-౧౨ స్థానములయందుఁగాని, నీచస్థానమునఁ గాని, పాపయుతుఁడై యుండినచో రాజమిత్రబంధువిరోధమును, చతుష్పాజ్జీవనాశమును, భార్యావియోగమును, యశోధనహానియును, భాగ్యహానియు, మనఃక్లేశము, స్త్రీమూలకలహమును, లేక కళత్రము భర్తను వదలిపోవుటయు నగును. పితృకర్మయుఁగాని, మాతృకర్మగాని గల్గును. స్థానభ్రంశమును, ప్రయత్నకార్యవిఘ్నమును, ఋణధనబాధయును, రాజనిర్బంధమును, మానభంగమును, శకటసంచారమునందు స్త్రీసంభోగముచేయుట, లేక జంతుసంగముగల్గును. ఈశుక్రుఁడు ౯-౧౧ స్థానాధిపతులతోఁ జేరి శుభత్వము నొందియుండినచో బ్రాహ్మణగురుదేవభక్తియును, ముత్యములు, వెండి, అభ్రకము, శ్వేతధాన్యము, భూషణములు, రత్నములు, క్రయవిక్రయధనలాభమును, అకస్మాద్రాజయోగమును, వాహనసంచారమును, గొప్పవారిస్నేహమును గల్గును. ఈశుక్రుఁడు దశానాథునకుఁ గేంద్రస్వక్షేత్రోచ్చస్వాంశలయందుఁ ద్రికోణస్థానములయందు నుండినచో, నూతన గృహనిర్మాణమును, విద్యాలాభమును, పుత్రోత్పత్తియును, వ్యాపారోద్యోగలాభమును, శత్రునాశమును, ధనలాభమును, సంగీతవాద్యసత్కథాశ్రవణమును, అన్యస్త్రీసంభోగమును, బంధుకల్యాణదర్శనమును గల్గును. ఈశుక్రుఁడు దశానాథునకు ౧౨-౬-౮ స్థానములయందును, నీచారి స్థానములయందును, పాపగ్రహయుతుఁడై యుండినచో, విదేశగమనమును, మనో

దుఃఖమును, రాజచోరాగ్నిజ్వరబాధయును, స్వాధికారభంగమును, మిత్రద్వేషమును గల్గును. ఈశుక్రుఁడు లగ్నమునకు ౨-౭ స్థానముల యందు మారకాధిపత్యముగల్గి మారకగ్రహములతోఁగూడినను జూడఁబడినను అపమృత్యుదోషమును, దేహజాడ్య, మానభంగ, కార్య విఘ్నములును గల్గును. తద్దోషపరిహారమునకు బోధాయనసూత్రప్రకారముగ దుర్గాజపమును, స్వర్ణదుర్గాప్రతిమయును, మహిషప్రతిమయును, దానముచేసినచో నాయురారోగ్యైశ్వర్యమును, కార్యసిద్ధియును, సంతోషమును గల్గును.

చంద్రదశాయాం సూర్యభుక్తిమాసాః ౬ తత్ఫలమ్.

శ్లో. చంద్రస్యాంతర్గతే సూర్యే కేంద్రకోణోచ్చ స్వర్క్షగే,
రాజ్యలాభం ధనప్రాప్తిః గృహే కల్యాణసంభవమ్. 77
మిత్రరాజప్రసాదేన గ్రామభూమ్యాదిలాభకృత్,
పుత్రలాభం మహాత్సౌఖ్యం స్వాధికారార్థసిద్ధిదమ్. 78
బంధుప్రీతికరం చైవ సత్కథాశ్రవణం భవేత్,
వ్యాపారోద్యోగలాభం చ గురుదైవతదర్శనమ్. 79
షష్ఠాష్టవ్యయగే నీచే పాపగ్రహసమన్వితే,
కార్యవిఘ్నం శత్రుభీతి ర్బుద్ధివైకల్య మాప్నుయాత్. 80
అకస్మాత్కలహంచైవ లాభాధిక్యం ధనవ్యయం,
ఋణద్రవ్యాదిబాధాచ దేహజాడ్యం మనోరుజమ్. 81
అన్యగ్రామప్రయాణంచ కార్యనాశం మహద్భయం,
ద్వితీయద్యూననాథేతు దేహాయాసం భవిష్యతి. 82
తద్దోషపరిహారార్థం శివపూజాంచ కారయేత్,

తా. చంద్రదశయందు సూర్యభుక్తి ౬ మాసములు.—ఈ సూర్యుఁడు, కేంద్రత్రికోణోచ్చస్వక్షేత్రలాభస్థానములయందు శుభగ్రహములతోఁగూడి యుండినచో రాజ్యలాభమును, తత్సమాన భూలాభమును, ధనప్రాప్తియును, గృహమున కల్యాణవిభవమును, మిత్రరాజప్రసాదముచేత గ్రామభూలాభమును, పుత్రోత్పత్తియును, స్వాధికారాభివృద్ధియును, బంధుప్రీతియును, సత్కథాశ్రవణమును, వ్యాపా

రోద్యోగసిద్ధియును, గురుదేవతాదర్శనమును, ఋణధనలాభమును, తత్వవిచారమును, కళత్రసౌఖ్యమును గల్గును. ఈసూర్యుఁడు ౬-౮-౧౨ స్థానములయందుఁగాని, నీచశత్రురాసులయందుఁగాని పాపగ్రహములతోఁ గూడియుండెనేని బుద్ధివైకల్యమును, శత్రుభయమును, కార్యవిఘ్నమును, అకస్మాత్కలహమును, లాభమునకుమించిన ధనవ్యయమును, రత్నభూషణవిక్రయనష్టమును, ఋణబాధయును, దేహపీడయును, అన్యగ్రామప్రయాణముచేతఁ గార్యవిఘ్నమును గల్గును. ఈసూర్యుఁడు ౨-౭ స్థానములకు నధిపతియై యుండినను, మారకగ్రహయుతుఁడై యుండినను, మారకాధిపత్యముగలవాఁడై యుండినను వాతపిత్తజ్వరాతిసారపీడ గల్గును. తత్పరిహారము శివపూజయును స్వర్ణలింగదానమును కల్పోక్తప్రకారము చేసినచో నాయురారోగ్యమును, కార్యానుకూలమును గల్గును.

చంద్రదశాంతర్దశావిచారము సంపూర్ణము.

---

కుజదశాయాం కుజభుక్తిమాసాః ౪, దినాని ౨౭. తత్ఫలమ్.

శ్లో. కుజస్యాంతర్గతే భౌమే లగ్నాత్కేంద్రత్రికోణగే,
లాభేవా ధనసంయుక్తే దుశ్చిక్యే బలసంయుతే. 1
లగ్నాధిపేన సంయుక్తే రాజానుగ్రహవైభవం,
లక్ష్మీకటాక్షచిహ్నాని నష్టరాజ్యార్థ లాభకృత్. 2
పుత్రోత్సవాది సంతోషం గృహే గోక్షీరవృద్ధిదం,
స్వోచ్చస్వక్షేత్రగే భౌమే గృహభూమ్యాదిలాభకృత్. 3
నూతనగృహనిర్మాణం అథవా వసనిర్మితం,
రత్నభూషణవస్త్రాది క్రయవిక్రయసిద్ధిదమ్. 4
నైఋత్యాం దక్షిణేభాగే ప్రయాణం కార్యసిద్ధిదం,
షష్ఠాష్టమ వ్యయే భౌమే పాపకృద్యోగసంయుతే. 5
మూత్రకృచ్ఛ్రశిరోరోగం వ్రణపీడాభయంభవేత్,
చోరాగ్ని శస్త్ర బాధా చ ధనధాన్యపశుక్షయమ్, 6

ద్వితీయద్యూననాథేతు దేహజాడ్యం మనోరుజం,
తద్దోషపరిహారార్థం స్కందమంత్రజపం చరేత్. 7
అనడ్వాహం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్,

తా. అంగారకదశయందు నంగారకస్వభుక్తిర మాసములు, ౨౭ దినములు:—ఈయంగారకుఁడు ౧-౪-౭-౧౦-౫-౯-౧౧-౩ స్థానములయందు లగ్నాధిపతితోఁ గూడియుండినచో రాజానుగ్రహసంతోషమును, లక్ష్మీకటాక్షమును, నష్టరాజ్యధనభూప్రాప్తియును,పుత్రోత్సవమును, గృహమందు పశువృద్ధియు, క్షీరసమృద్ధియును, బంధుమిత్రసమ్మానమును గల్గును. ఈయంగారకుఁడు స్వక్షేత్రోచ్చములయందు శుభగ్రహయుతుఁడై దుర్బలుఁడుగాక యుండినచో నూతనగృహమును, వనకూపములును, గృహమున సురాయుత్తులు చేయుటయగును. రత్నభూషణములవ్యాపారమును, ధనలాభమును, దక్షిణనిరృతిదిశప్రయాణములచేతఁ గార్యసిద్ధియును, శత్రుజయమును, న్యాయహారానుకూలమును గల్గును. ఈయంగారకుఁడు షష్ఠాష్టమవ్యయనీచరాసులయందు పాపగ్రహయుతుఁడై యుండినచో పాపకార్యములు చేయుటయును, మూత్రకృచ్ఛ్రరోగముగాని, శిరోభ్రమణరోగముగాని, వ్రణముగాని, చోరాగ్ని శస్త్రపీడలుగాని గల్గును. ధనధాన్యపశుక్షయమును, ఋణధనబాధయును, మానభంగమును గల్గును. ఈయంగారకుఁడు లగ్నమునకు ౨-౭ స్థానములయందు మారకగ్రహములతోఁ గూడినను జూడఁబడియు నుండి మారకాధికారిత్వముతో నుండినచో, మూలాండాదిదేహజాడ్యమును, కార్యవిఘ్నమునుగల్గును. లేక ప్రాణాపద యగురాజదండనభయము గల్గును. తద్దోషపరిహారమునకు సుబ్రహ్మణ్యజపంబును, రజతానడ్వాహప్రతిమాదానమును, కల్పోక్తప్రకారముచేసినచో సర్వకార్యానుకూలము గలుగును.

అంగారకదశాయాం రాహుభుక్తిమాసాః ౧౨, దినాని ౧౮. తత్ఫలమ్.

శ్లో. కుజస్యాంతర్గతే రాహౌ స్వోచ్చమూలత్రికోణగే. 8
శుభయుక్తే శుభైర్దృష్టే కేంద్రలాభేచకోణగే.
తత్కాలే రాజసమ్మానం గ్రామభూమ్యాదిలాభకృత్ 9

కళత్రపుత్రలాభంచ వ్యవసాయాత్ఫలాధికం,
సేతుస్నానఫలావాప్తిః విదేశగమనం తథా. 10
వ్యవహారజయంచైవ శత్రునాశం ధనాగమం,
రత్నభూషణసంప్రాప్తిః మిత్రబంధుప్రవర్ధనమ్. 11
షష్ఠాష్టమవ్యయేరాహౌ పాపయుక్తేఽథవీక్షితే,
చోరాగ్నిప్రాణభీతిశ్చ చతుష్పాజ్జీవనాశనమ్. 12
వాతపిత్తవికారంచ కారాగృహనివేశనం,
విషవాతజ్వరోన్మాదం తస్మాల్లాద్ధననాశనమ్. 13
ద్వితీయద్యూననాథేతు దేహజాడ్యం మనోరుజం,
మృత్యుంజయజపంకుర్యా దాయురారోగ్యసిద్ధిదమ్. 14
ఛాగదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్,

తా. అంగారకదశయందు రాహుభుక్తి ౧౨ మాసములు, ౧౮ దినములు:—ఈరాహువు శుభగ్రహములతోఁగూడి కేంద్రస్థానములయందును, కోణలాభములయందును బలీయుఁడై యుండినచో నుచ్చస్థానమునంగాని యుండినను, రాజసన్మానమును, గ్రామభూషణలాభమును, కళత్రప్రాప్తియును, పుత్రజననమును, వ్యవసాయమూలకధనధాన్యలాభమును, సేతుస్నానఫలప్రాప్తియును, పరదేశప్రయాణమును, లేక పరగ్రామ పరగృహనివాసమును, వ్యవహారజయమును, శత్రునాశమును, ఋణధనలాభమును, రత్నభూషణ విక్రయలాభమును, మిత్రబంధుదర్శనమును, గోష్ఠివారిస్నేహమును, రాజతుల్యయోగప్రారంభమును, ధైర్యమును, నీచజనమూలక వ్యాపారసిద్ధియును, పరోపకారమును, నూతనకార్యములు చేయుటయును గల్గును.

ఈరాహువు లగ్నమునకు షష్ఠాష్టమస్థానములయందు, నీచరాశియందు, శత్రురాశియందు నీచపాపగ్రహములతోఁజేరి యుండినను జూడఁబడినను రాజచోరనీచ, జనవిరోధమును, ప్రాణహానికరకార్యమును, చతుష్పాజ్జీవనాశమును, విషశస్త్రఘాతాగ్ని పీడలును, వాతపిత్తజ్వరోన్మాదాదిజాడ్యమును, శత్రుబాధవలనఁ గారాగృహబంధనమును, స్త్రీకలహమును, కళత్రవిరోధముగాని, కళత్రనాశముగాని,

స్థానభ్రంశాది కష్టములుగాని కల్గును. ఈరాహువు లగ్నమునకు మారక ఫలప్రదాయకుఁడై, మారకగ్రహాయుతుఁడై, మారకగ్రహ వీక్షణముగాని గల్గియుండినచో అపమృత్యుదోషజాడ్యాదులు గల్గును. తద్దోషపరిహారార్థము మృత్యుంజయజపమును, స్వర్ణనాగఛాగ ప్రతిమాదానములును, యామిళోక్తప్రకారము చేసినచో నాయురారోగ్య కార్యానుకూలము లగును.

కుజదశాయాం గురుభుక్తిమాసాః ౧౧, దినాని ౬. ఫలానిస్.

శ్లో. కుజస్యాంతర్గతే జీవే లగ్నాత్కేంద్రత్రికోణగే. 15
దశాధిపేన సంయుక్తే శుభగ్రహసమన్వితే,
దాయేశాత్కేంద్రకోణస్థే తుంగ మిత్రర్క్ష సంస్థితే. 16
సత్కీర్తీ రాజసమ్మానం రత్నభూషణలాభకృత్,
వ్యవసాయాత్ఫలప్రాప్తిః గృహే గోధనసంకులమ్. 17
కల్యాణం భూరిసంపత్తిః దారపుత్రాదిసౌఖ్యదం,
నూతనోద్యోగకార్యాణి నూతనప్రభుదర్శనమ్. 18
మిత్రమూలాత్కార్యసిద్ధి ర్మనస్సంతోష మాప్నుయాత్,
దేవాలయాదినిర్మాణ మథవా గృహనిర్మితమ్. 19
భాగ్యకర్మాధిపై ర్యుక్తే వాహనాధిపసంయుతే,
లగ్నాధిపసమాయుక్తే శుభాంశే శుభవర్గగే. 20
గృహక్షేత్రాభివృద్ధిస్స్యా ద్గృహేకల్యాణసంపదః,
పశ్చిమాందిశిమాశ్రిత్య బంధుమిత్రప్రదర్శనమ్. 21
ప్రయత్నకార్యసిద్ధిస్స్యా ద్ధర్మలాభం సుఖావహం,
దేహారోగ్యం పుత్రలాభం సత్కథా శ్రవణం భవేత్ 22
షష్ఠాష్టమవ్యయేనీచే పాపగ్రహసమన్వితే,
నృపచోరాగ్నిపీడాచ పిత్తరోగాది సంభవం. 23
అకస్మాత్ భృత్యకలహం రాజస్థానే విరోధకృత్,
భార్యానాశం పుత్రపీడా అథవా ధననాశనమ్. 24
ప్రయత్నకార్యవిఘ్నంస్స్యా త్పితృనాశం మనోరుజా,
అన్యగృహనివాసం చ పాపకార్యార్థసిద్ధిదమ్. 25
ద్వితీయద్యూననాథేతు మారకగ్రహసంయుతే,

ప్రేష్యత్వం భృత్యునాశం స్యాదపమృత్యుర్భయం భవేత్. 26
దేహజాడ్యం మనోదుఃఖం లాభాధిక్యం ధనవ్యయం,
తద్దోషపరిహారార్థం శివసాహస్రకంజపేత్. 27
మహాకూశ్మాండదానేన సర్వసంపత్ప్రదాయకమ్,

తా. అంగారకదశయందు గురుభుక్తి ౧౧ మాసములు, ౬ దినములు:— ఈగురువు లగ్నాత్కేంద్రత్రికోణస్థానములయందుఁ గాని, దశానాథునకుఁ గేంద్రత్రికోణములయందుఁగాని, దశానాథునితోఁ జేరిగాని, స్వాంశోచ్చస్థానములయందుఁగాని, మిత్రసమరాసులయందుఁగాని, శుభగ్రహములతోఁ గూడి యుండినచో సత్కీర్తియును, రాజసమ్మానమును, రత్నభూషణవ్యాపారాదులచేత ధనలాభమును, వ్యవసాయాదులచేత ధాన్యలాభమును, గృహమునఁబశువృద్ధియును, క్షీరాభివృద్ధియును, పుత్రవర్గమునందుఁ గల్యాణాదివైభవములును, కళత్రపుత్రసౌఖ్యమును, పుత్రజననమును, నూతనోద్యోగకార్యప్రయత్నసిద్ధియును, మిత్రప్రభుమూలక కార్యసిద్ధియును, దేవాలయాదిసద్ధర్మప్రతిష్ఠలును, గృహనిర్మాణమును, సత్కథాశ్రవణాసక్తనములును, గ్రంథరచనయును, గల్గును. ఈగురువు ౯-౪-౧౦ స్థానాధిపతులతోఁ గూడియుండినను, లగ్నాధిపతితోఁ బ నుండినను, శుభవర్గ శుభాంశలయందు నుండినను, గృహక్షేత్రాదులలాభమును, అనేకజనపరివృతసభాస్థానమున గొప్పవహించుటయును, గృహమునందు వివాహాదులును, మిత్రబంధుసుధ్యమృష్టాన్నభోజనమును, ప్రయత్నకార్యానుకూలమును, దేహారోగ్యమును, తీర్థస్నాన దేవతారాధనాదిసత్క్రియాకలాపపరత్వంబును, పాండిత్యమును గల్గును. ఈగురువు లగ్నమునకు ౬-౮-౧౨ స్థానములయందుఁగాని, నీచాస్తంగత పాపక్షేత్రములయందుఁగాని పాపగ్రహయుతుఁడై యుండినచో రాజచోరాగ్నిజాడ్యబాధయును, భృత్యకలహమును, రాజస్థానమున విరోధమును, కళత్రపుత్ర హానియును, ప్రయత్నకార్యవిఘ్నమును, పితృవర్గజనారిష్ట మృతాశౌచాదులును, అన్యగృహనివాసమును, పాపకార్యచింతయును, అర్థనాశమును గలుగును. ఈగురువు ద్వితీయసప్తమస్థానములకు నధిపతియై యుండి మారకగ్రహయుతుఁడై యుండినచో, సేవకత్వమును, అపమృత్యుభయాది

రోగములను, అధికధనవ్యయమును గల్గును. తద్దోషపరిహారమునకు శివసహస్రనామపారాయణమును, స్వర్ణగర్భితమహాకూశ్మాండదానమును, విధిప్రకారము చేసినచో సకలకార్యానుకూలము నాయురారోగ్యము నగును.

కుజదశాయాం శనిభుక్తిమాసాః ౧౩, దినాని ౯. తత్ఫలమ్.

శ్లో. కుజస్యాంతర్గతే మందే స్వోచ్చస్వక్షేత్ర కేంద్రగే. 28
త్రికోణ లాభ దుశ్చిక్యే భాగ్య కర్మాధిపైర్యుతే,
లగ్నాధిపేన సంయుక్తే మిత్రవర్గే శుభాంశగే. 29
శుభగ్రహ సమాయుక్తే శుభగ్రహనిరీక్షితే,
పుత్రకల్యాణసంప్రాప్తిః గృహే లక్ష్మీకటాక్షకృత్. 30
వ్యాపారోద్యోగ సంప్రాప్తి రర్థలాభం యశోధికం,
ప్రభుసమ్మానవిభవం దేహారోగ్యం రిపుక్షయమ్. 31
పశ్చిమోత్తరదిగ్భాగే ప్రయాణ ధనలాభకృత్
మహారాజప్రసాదేన స్వసహారార్థసిద్ధికమ్. 32
నీచారిస్థానగే మందే షష్ఠాష్టవ్యయరాశిగే,
మ్లేచ్ఛవర్గ ప్రసంగశ్చ దేహజాడ్యంధనక్షయమ్. 33
బంధుద్వేషం స్థాననాశం చోరాగ్ని వ్రణపీడనం,
క్షుమూత్రప్రారపీడాది స్ఫోటకాద్భయ మీదృశమ్. 34
పితృమాతృవియోగంచ ఋణద్రవ్యాదిపీడనం,
ద్వితీయద్యూననాథేషు అపమృత్యుభయం భవేత్ 35
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్
మృత్యోర్యస్తుప్రతిమాం దద్యాత్సర్వ సంపత్ప్రదాయకమ్. 36

తా. కుజదశయందు శనిభుక్తి మాసములు ౧౩, దినములు ౯.—శనైశ్చరుఁడు, కేంద్ర త్రికోణోచ్చ స్వక్షేత్ర లాభస్థానముల యందుగాని, మూఁడవయింటఁగాని యుండి ౯-౧౦ స్థానాధిపతులతోఁ గూడియుండినను, లగ్నాధిపతితోఁ జేరియుండినను, మిత్రవర్గము నందుగాని, శుభాంశమందుగాని యుండినను, శుభగ్రహములతోఁ గూడి యుండినను, శుభగ్రహములచేతఁ జూడఁబడి యుండినను పుత్ర

కల్యాణమును, లక్ష్మీకటాక్షసంపత్తియును, వ్యాపారోద్యోగసంప్రాప్తియును, ధనలాభమును, కీర్తివృద్ధియును, రాజజనసన్మానమును, దేహారోగ్యమును, శత్రుజయమును, పశ్చిమోత్తర దిగ్భాగ ప్రయాణముచేత ధనలాభమును, సుహృద్రాజాశ్రయమును, వ్యవహారసిద్ధియును, ఋణధనలాభమును, చతుష్పాజ్జీవ నివాస గృహనిర్మాణమును, పాకశాలాపరిశోధనమును, బండ్లు, మేఁకలు విక్రయము చేయుటయును గల్గును. ఈ శనైశ్చరుఁడు, నీచారి స్థానములయందుగాని ౬-౮-౧౨ స్థానములయందుగాని పాపగ్రహములతోఁ జేరి యుండినచో మ్లేచ్ఛాది నీచజనమూలకకలహముగాని, అట్టివారి స్నేహమున వేఱొకకార్యములకుఁ బూనుకొనుటగాని గల్గుటయును, దేహమునకు వాతశ్లేష్మ మాంద్య క్షయాది రోగములుగాని గల్గుటయును, బంధుద్వేషమును, స్థానభ్రంశమును, చోరాగ్నివ్రణపీడలుగాని పిత్తవికారాదిదుర్బలముగాని స్ఫోటకశస్త్రపీడలుగాని కల్గుటయును, పితృమాతృ జనారిష్టమును, ఋణధనబాధయును, కళత్రగర్భభంగమునుగల్గును. ఈశని ద్వితీయసప్తమస్థానములయందు నుండి మారకగ్రహయుతుఁడై మారకాధిపత్యముతో నుండెనేని అపమృత్యుదోషము సంప్రాప్తించును. తద్దోషపరిహారమునకు మృత్యుంజయజపమును, మృత్యుప్రతిమాదానమును, యామిళోక్త ప్రకారముచేసినచో, నాయురారోగ్యమును, సకలకార్యానుకూలము నగును.

కుజదశాయాం బుధభుక్తిమాసాః ౧౧, దినాని ౨౭. తత్ఫలమ్.

శ్లో. కుజస్యాంతర్గతే సౌమ్యే లగ్నాత్కేంద్రత్రికోణగే,
స్వోచ్చస్వక్షేత్రగేవాపి తుంగాంశే స్వాంశగేఽపివా. 37
శుభగ్రహ సమాయుక్తే శుభాంశే శుభవర్గగే,
సత్కథాశ్రవణం దానం ధర్మబుద్ధి స్సుఖావహమ్. 38
ప్రాచీనగృహనిర్మాణం బంధుమిత్రసమాగమం,
పుత్రోత్సవాదిసంతోషం వాహనప్రాప్తి రర్థదమ్. 39
క్రతుకర్మఫలంసిద్ధిః రత్నభూషణలాభకృత్,
మాతృవర్గే శుభంప్రోక్తం సద్గ్రంథ పఠనం భవేత్. 40

షష్ఠాష్టను వ్యయే సౌమ్యే నీచేవాస్తంగతేఽపి వా
హృద్రోగం మానహానిశ్చ నిగళం బంధుపీడనమ్. 41
కళత్రపుత్రపీడాచ స్థానభ్రంశం మహాద్భయం,
ద్వితీయ ద్యూన నాథేతు వాతశ్లేష్మాదిరోగకృత్ 42
అశ్వదానం ప్రకుర్వీత విష్ణుసాహస్రకం జపేత్,
సర్వారిష్టవినాశ స్స్యా ద్దేహారోగ్యం మహాసుఖమ్. 43

తా. కుజదశయందు బుధభుక్తి ౧౧ మాసములు, ౨౭ దినములు:-ఈబుధుఁడు ౧-౪-౫-౭-౯-౧౦-౧౧ స్థానములయందుగాని, స్వక్షేత్రోచ్చస్థానములఁగాని, శుభాంశలయందుగాని, శుభవర్గలయందుగాని శుభగ్రహములతోఁ జేరియుండినచో,సత్కథాశ్రవణమును,దానధర్మపరోపకార్యమును, ప్రాఁతగృహనిర్మాణమును, బంధుమిత్రదర్శనమును, పుత్రోత్సవమును, వాహనాంబరభూషణవిక్రయలాభమును,యజ్ఞకర్మఫలమును, ధర్మప్రసంగమును, మాతృవర్గమందు శుభకార్యములును, సద్గ్రంథపఠనముగాని, రచించుటగాని, రచింపించుటగాని గల్గును. బుధుఁడు రాహుకేతువులతోఁగూడి యుండినచో స్త్రీకలహమును, భూమి, గృహము, ధాన్యనునష్టాపమును, శిరోరోగమును, దాసీజన సహాయజీవనమును, శివకేశవులవిచారమును, విషపాండురోగమును గల్గును. ఈబుధుఁడు షష్ఠాష్టనువ్యయస్థానములయందును, నీచస్థానమునందును దుర్బలుఁడై యుండెనేని, హృద్రోగమును, మానప్రాణభీతియును, బంధుపీడనమును, నిగళసంప్రాప్తియును,కళత్రపుత్రపీడయును, స్థానభ్రంశమును, ఋణధనపీడయు నగును. ఈబుధుఁడు ద్వితీయ ద్యూనములకు నధిపతియై, మారకగ్రహ యుతుఁడై మారకగ్రహములచేతఁ జూడఁబడుచు నుండెనేని, వాతశ్లేష్మాదిరోగపీడ గల్గును. అందులకు,అశ్వదానమును,విష్ణుమంత్రపారాయణమును విధిప్రకారము చేసినచో సర్వదోషపరిహారము గల్గును.

కుజదశాయాం కేతుభుక్తిమాసాః ౪,దినాని ౨౭ తత్ఫలమ్.

శ్లో. కుజస్యాంతర్గతే కేతౌ కేంద్రకోణసమన్వితే,
దుశ్చిక్యే లాభగే వాపి శుభయుక్తే శుభేక్షితే, 44

కించిత్ఫలంచ భుక్త్యాదౌ తత్పరం కార్యసిద్ధికృత్
రాజసల్లాపకార్యాణి చతుష్పాజ్జీవ లాభకృత్ 45
అర్థలాభం యశోవృద్ధి ర్గృహే కల్యాణసంభవః,
భృత్యవర్గే ధనప్రాప్తిః రాజమైత్రం ధనాగమమ్. 46
విధవాసంగమంచైవ తన్మూలా చ్ఛత్రునాశనం,
వ్యయరంధ్రగృహేవాపి పాపయుక్తేఽథ వీక్షితే. 47
మాతృనాశం రాజభీతిః పితృతుల్యజనక్షయం,
కపోల దంత రోగశ్చ ఫణిచోరజ్వరపీడనమ్. 48
శ్వేతకుష్ఠవ్రణప్రాప్తిః అథవా దారనాశనం,
ద్వితీయద్యూననాథేతు భావస్థే దేహపీడనమ్. 49
మృత్యుంజయం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్,

తా. కుజదశయందు కేతుభుక్తి మాసములు ౪, దినములు ౨౭:—ఈ కేతువు కేంద్రత్రికోణస్థానములయందు, ౧౧-3 స్థానములయందును, శుభులతోఁగూడినను జూడఁబడియుండినచో భుక్తిమొదట కించిల్లాభమును, అనంతరము రాజజనసల్లాపమును, చతుష్పాజ్జీవలాభమును, గృహమున వివాహమును, భృత్యమూలక ధనలాభమును, రాజజనస్నేహమును, విధవస్త్రీసంగసంబంధమును, విధవస్త్రీమూలక కార్యలాభమును, కళత్రకలహముగాని, కళత్రమునకువ్యాధిగాని గల్గును. ఈ కేతువు ౮-౧౨ స్థానములయందుఁ బాపగ్రహములతోఁ జేరినను జూడఁబడినను, మాతాపితృజనారిష్టమును, కపోలదంతరోగపీడయును, సర్పచోర విషజంతు వ్యాఘ్రభయమును, శ్వేతకుష్ఠవ్యాధిభయము గాని, కళత్రదోషముగాని, రాజజనవిరోధముగాని గల్గును. ఈ కేతువు లగ్నమునకు ౨-౭ స్థానములయందుండి మారకగ్రహయుతుఁడై మారకగ్రహవీక్షితుఁడై యుండినచో, అపమృత్యుదోషము ప్రాప్తించును. తద్దోషపరిహారమునకు మృత్యుంజయజపమును, మృత్యుంజయ రచితప్రతిమాదానమును జేసినచో, నాయురారోగ్యము గలుగును.

కుజదశాయాం శుక్రభుక్తి మాసాః ౧౪. తత్ఫలమ్.

శ్లో. కుజస్యాంతర్గతే శుక్రే లగ్నాత్కేంద్రత్రికోణగే. 50
స్వోచ్చస్వర్క్షగతేవాపి శుభస్థానస్థితేయది,

భూలాభం బంధుసమ్మానం వాహనాంబరలాభకృత్ 51
లగ్నాధిపేనసంయుక్తే కల్యాణం కార్యసిద్ధిదం,
అన్యగ్రామ నివాసంచ తద్గ్రామే ధాన్యలాభకృత్ 52
వ్యాపారోద్యోగవృద్ధించ స్వాధికారార్థసిద్ధిదం,
సంగీతవాద్యఘోషంచ స్వస్త్రీసౌఖ్యం యశోధనమ్. 53
దాయేశాత్కేంద్రకోణస్థే భాగ్యస్థేలాభగేఽపివా,
మహారాజాశ్రయప్రాప్తి రాప్తమిత్రవశాత్సుఖమ్. 54
వస్త్రభూషణరత్నాది క్రయవిక్రయలాభకృత్,
దానధర్మరతో నిత్యం స్నానం దైవతదర్శనమ్. 55
తటాకారామనిర్మాణం పుత్రోత్పత్తి ర్నసంశయః,
షష్ఠాష్టవ్యయగే నీచే పాపయుక్తేక్షితే సితే. 56
రాజభీతి శ్చోరభీతి ర్గృహే కలహమేవచ,
దారపుత్రాదిపీడాచ కార్యవిఘ్నం ధనక్షయమ్. 57
ద్వితీయా ద్యూననాథేతు దేహబాధా భవిష్యతి,
శ్వేతాంగాం మహిషీం దద్యా దాయురారోగ్య మాదిశేత్

తా. కుజదశయందు శుక్రభుక్తి ౧౪ మాసములు:—శుక్రుఁడు కేంద్రత్రికోణోచ్ఛ స్వక్షేత్రమిత్రక్షేత్రములయందును, శుభాంశ శుభవర్గములయందును,శుభులతోఁ గూడియుండినచో భూలాభమును, బంధుసమ్మానమును వాహనస్త్రీభూషణ విక్రయలాభమును, ఆశుక్రుఁడు లగ్నాధిపతితోఁ జేరి యుండెనేని కల్యాణాదిశుభవైభవములును,పశ్చిమోత్తరప్రయాణమును, దక్షిణదిశయందుఁ గళత్రప్రాప్తియును, అన్యగ్రామనివాసమును, వ్యాపారలాభమును, నుద్యోగప్రాప్తియును, స్వాధికారకీర్తియును, సంగీతవాద్యవినోదమును, స్వస్త్రీసౌఖ్యమును గల్గును.

ఈశుక్రుఁడు దశానాథునకుఁ గేంద్రకోణోచ్ఛ మిత్రక్షేత్రములయందునుండినచో, మహారాజాశ్రయమును, ఆప్తబంధువులమూలకధనలాభమును, వస్త్రభూషణ విక్రయలాభమును, దానధర్మపరోపకారములును, తీర్థస్నానదేవతారాధనమును, తటాకారామగృహనిర్మాణమును, పుత్రోత్పత్తియును గలుగును. ఈశుక్రుఁడు ౬-౮-౧౨ స్థానములయం

దుగాని, నీచరాశియందుగాని, పాపగ్రహయుతుఁడై యుండెనేని రాజదండనాదిభయమును,గృహమునందు వివిధకలహములును, కళత్రసునస్తాపమును,లేక కళత్రమునకు రోగమును,పుత్రారిష్టమును, కార్యవిఘ్నమును, ధనవ్యయమును గలుగును. ఈశుక్రుఁడు ౨-౭ స్థానముల కధిపతియై మారకగ్రహయుతుఁడై యుండినచో దేహజాడ్యముకలుగును. తద్దోషపరిహారమునకు దుర్గాజపమును, తెల్లనియావును, మహిషమును దానముచేసినచో సర్వరోగపరిహారమును, కార్యానుకూలమును గలుగును.

కుజదశాయాం రవిభుక్తిమాసాః ౪, దినాని ౬. ఫలమ్

శ్లో. కుజస్యాంతర్గతేసూర్యే స్వోచ్చస్వక్షేత్రసంయుతే,
కేంద్రే మూలత్రికోణేవా లాభే మిత్రాంశయాన్వితే. 59
భాగ్యకర్మేశసంయుక్తే శుభవర్గే శుభాన్వితే,
వాహనం పుత్రలాభంచ ధనధాన్యసమృద్ధిదమ్. 60
కృషిమూలా ద్ధనప్రాప్తిః గృహే శోభనసంభవః,
రాజపూజా శత్రునాశః తత్వమార్గాది చింతనమ్. 61
షష్ఠాష్ట వ్యయగే నీచే దాయేశా ష్షష్ఠరిష్ఫగే,
దేహపీడామనస్తాపం శిరోరోగజ్వరాదికమ్. 62
స్థానభ్రంశం మనఃక్లేశం కార్యవిఘ్నం ధనక్షయం,
ద్వితీయద్యూననాథేతు తాపజ్వరవిషాద్భయమ్. 63
సూర్యప్రీతికరంచైవ శాంతిం కుర్యా ద్యథావిధిః,

తా. అంగారకదశయందు సూర్యభుక్తిమాసములు ౪, దినములు ౬.—ఈసూర్యుఁడు కేంద్రమూలత్రికోణోచ్చస్వక్షేత్ర మిత్రక్షేత్ర లాభస్థానములయందు శుభులతోఁగూడి ధర్మకర్మాధిపతులతోఁ గూడియెందేనియుండినచో వాహనలాభమును,పుత్రజననమును,కృషిమూలక ధనధాన్యలాభమును,గృహమునఁ బుత్త్రీ పుత్ర వర్గశుభకార్యములును, రాజపూజయును, తత్వమార్గవిచారమును, శత్రునాశమును గలుగును. ఈసూర్యుఁడు దుస్థానములయందుగాని, దశానాథునకు దుస్థానములయందుఁగాని, ౨-౭స్థానములయందుఁగాని బలహీనగ్రహ

ములతోఁ గూడినను, మారకగ్రహాయుతుఁడై యుండినను, మారకాధిపత్యముగల్గినవాఁడై యుండినను, దేహజాడ్యమును, శిరోరోగమును, జ్వరాతిసారభయమును, మనస్తాపమును, స్థానభ్రంశమును, కార్యవిఘ్నమును, ధనవ్యయమును గల్గును. పరిహారము సూర్యప్రీతి నమస్కారములు చేయించినచో శ్రేయముగల్గును.

కుజదశాయాం చంద్రభుక్తి మాసాః ౭. తత్ఫలమ్.

శ్లో. కుజస్యాంతర్గతే చంద్రే లగ్నాత్కేంద్రత్రికోణగే. 64
ధర్మకర్మేశసంయుక్తే తుంగే స్వక్షేత్ర సంయుతే,
లగ్నాధిపసమాయుక్తే శుభవర్గే శుభాన్వితే. 65
తటాక గోపురాదీనాం పుణ్యకర్మాది సంగ్రహః,
వివాహోత్సవ కార్యాణి దారపుత్రాదిసౌఖ్యకృత్ 66
మాతాపితృసుఖావాప్తిం వివాహం బంధుదర్శనం,
పూర్ణచంద్రే రాజ్యలాభం భూలాభం కార్యసిద్ధిదమ్. 67
వ్యాపారాద్ధనలాభంచ ఋణత్రవ్యార్జితం భవేత్,
షష్ఠాష్టవ్యయ నీచస్థే పాపక్షేత్రసమన్వితే. 68
దాయేశాద్రిపు నీచస్థే వ్యయే పాపసమన్వితే,
మాతృనాశం శత్రుబాధా రాజపీడా మనోరుజమ్. 69
రాజద్వేషం మిత్రవైరం కార్యవిఘ్నం పశుక్షయం,
చోరశస్త్రప్రపీడాచ స్త్రీమూలాత్కలహో భవేత్ 70
వాతశ్లేష్మాదిరోగంస్యా దన్యగృహ నివాసకృత్
ద్వితీయసప్తమస్థేచ దేహజాడ్యం ధనక్షయమ్ 71
తద్దోషపరిహారార్థం దుర్గాలక్ష్మీజపం చరేత్,
శ్వేతాంగాం మహిషీందద్యా ద్దానేనారోగ్య మాదిశేత్. 72

తా. కుజదశయందుఁ జంద్రభుక్తి ౭౧ మాసములు:—ఈచంద్రుఁడు కేంద్రత్రికోణోచ్చ స్వక్షేత్రమూలత్రికోణ మిత్రాలయముల యందును, ధర్మకర్మాధిపతులతోను, దశానాథునితోను లగ్నాధిపతితోనుఁ గూడి శుభాంశలయందు నుండినచో చెఱువులును, గోపురములును, పుణ్యకార్యములును గల్గును. వివాహముజరుగును. కళత్రపుత్ర

సౌఖ్యమును, పుత్రజననమును, మాతాపితృలకు సౌఖ్యమును, ఈచంద్రుఁడు సంపూర్ణబలముతోఁ నుండినచోఁ రాజ్యభూసస్యాభివృద్ధియును, ధాన్యలాభమును, వ్యాపారమూలకధనలాభమును ఋణాధనార్జితమును, శత్రుజయమును గల్గును. ఈచంద్రుఁడు దశానాథునకును లగ్నమునకును షష్ఠాష్టవ్యయ నీచపాప స్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండెనేని శత్రునాశమును, మాతృజనారిష్టకర్మలును, రాజజన ద్వేషమును, మిత్రబంధు కలహమును, చోరశస్త్రపీడలును, స్త్రీమూలకకలహమును, వాతశ్లేష్మాదిరోగపీడలును, అన్యగృహనివాసమును, ఈచంద్రుఁడు లగ్నమునకు ద్వితీయసప్తమస్థానములయందు మారకాధిపత్యము గల్గియుండినచోఁ దేహజాడ్యమును, ధనక్షయమును గల్గును. తద్దోషపరిహారమునకు శ్వేతగోదానమును, మహిషదానమును, యథావిధిఁ జేసినచోఁ నాయురారోగ్యము గల్గును.

ఇట్లు కుజదశాంతర్దశలు సంపూర్ణము.

---

రాహుదశాయాం రాహుభుక్తిమాసాః ౩౨, దినాని ౧౨. తత్ఫలము.

శ్లో. రాహో రంతర్గతే రాహౌ లగ్నా దుపచయస్థితే,
తుంగే త్రికోణగే స్వాంశే శుభాంశే శుభవర్గగే. 1
యోగకారక సంయుక్తే శుభగ్రహనిరీక్షితే,
గృహే కల్యాణసంపత్తిః స్వాధికారాభివృద్ధిదా. 2
నైరృత్యాం పశ్చిమేభాగే ప్రయాణం కార్యసిద్ధిదం,
మిత్రప్రీతికరంచైవ రాజసమ్మాన మాప్నుయాత్. 3
వ్యాపారే ధనలాభంచ వ్యవహారే విజయోభవేత్,
ధైర్యంచ సాహసోద్దామం రాజద్వారే శుభావహం. 4
షష్ఠాష్టమ వ్యయే రాహౌ పాపయుక్తేఽథ వీక్షితే,
నీచాంశే నీచరాశిస్థే పాపక్షేత్రసమన్వితే. 5
చోరాది ఋణపీడాచ స్థానభ్రంశం మనోరుజం,
రాజదారజన ద్వేషం బంధనం నాశహానికృత్ 6

కళత్ర కలహంచైవ అథవా దారనాశనం,
మిత్ర బంధు విరోధంచ వాతశ్లేష్మాదిరోగకృత్ 7
వ్యాపారా ద్ధననాశంచ విదేశగమనం భవేత్,
పుత్రపీడా భ్రాతృవైరం మనఃక్లేశం ధనవ్యయమ్. 8
ద్వితీయ సప్తమస్థేచ అపమృత్యుభయంభవేత్,
కేంద్రత్రికోణరాశిస్థే మాతృనాశం సుతక్షయం. 9
పితృవర్గజనారిష్టం నీచవ్యాపారసిద్ధిదం,
అకస్మాత్కలహంచైవ కార్యాలస్యం భవిష్యతి. 10
తద్దోషపరిహారార్థం రాహో దుర్గాజపంచరేత్,
నాగదానంచ మహిషీం దద్యా దారోగ్య మాదిశేత్. 11

తా. రాహుదశయందు రాహుభుక్తి 3౨ మాసములు, ౧౨ దినములు:—ఈరాహువు, లగ్నమునకు నుపచయ స్థానములయందు గాని, స్వక్షేత్రోచ్చ మూలత్రికోణ స్వాంశ శుభాంశలయందుగాని, శుభవర్గములయందుగాని, యోగకారకగ్రహయుతుఁడై యుండి శుభ గ్రహములచేఁ జూడఁబడుచునుండిగాని బలయుతుఁడైనచో, గృహమున వివాహ సంపత్తియును, స్వాధికారాభివృద్ధియును, నిరృతిపశ్చిమ దిశప్రయాణముచేతఁ గార్యసిద్ధియును, మిత్రజనప్రియమును, రాజసన్మానమును, వ్యాపారమూలక ధనలాభమును, వ్యవహారజయమును, ధైర్యసాహసమును, రాజద్వారమునందు జనవశీకరమును, కార్యజయమును గలుగును. ఈరాహువు షష్ఠాష్టమవ్యయస్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై పాపులచేఁ జూడఁబడుచునుండినను, నీచాంశ నీచరాసులయందుఁ బాపగ్రహయుతుఁడై యుండినను, చోరబాధయును, ఋణధనపీడయును, స్థానభ్రంశమును, మనోవ్యాధియును, రాజద్వారమున జనద్వేషమును, బంధనాది కష్టమును, మానభంగమును, కళత్రకలహమును, లేక కళత్రనాశమును, స్వజనవిరోధమును, వాతశ్లేష్మాదిరోగపీడయును, వ్యాపారధనవ్యయమును, అన్యదేశసంచారమును, పుత్రపీడయును, సహోదరకలహమును, సహోదరవర్గజనారిష్టమును గలుగును. ఈరాహువు ౨-౭ స్థానములయందు నుండినను, కేంద్రత్రికోణములయందు నుండినను, అపమృత్యుదోషమును, మాతృనాశమును, పుత్ర

వర్గజనారిష్టమును, పితృసమానజనమృతియును, నీచవ్యాపారప్రయత్నమును, అకస్మాత్కలహమును, సర్పజంతుభయమును, కార్యాలస్యమును గల్గును. తద్దోషపరిహారమునకు దుర్గాజపమును, స్వర్ణనాగమును, మహిషప్రతిమయును దానము యథావిధిగఁ జేసినచో నాయురారోగ్యమును, శ్రేయమును గల్గును.

రాహుదశాయాం గురుభుక్తిర్మాసాః ౨౮, దినాని ౨౪. తత్ఫలమ్.

శ్లో॥ రాహోరంతర్గతేజీవే లగ్నాత్కేంద్రత్రికోణగే,
స్వోచ్చేస్వక్షేత్రగేవాఽపి తుంగాంశే స్వాంశగేఽపివా. 12
భూమిలాభం మనోధైర్యం శత్రునాశం ధనాగమం,
వాహనం పుత్రలాభంచ గృహే కల్యాణసంకులమ్. 13
నైరృత్యాం పశ్చిమేభాగే ప్రయాణం బంధుదర్శనం,
యత్నకార్యార్థ సిద్ధిస్స్యాత్పుణ్యక్షేత్ర నివాసకృత్. 14
కళత్ర పుత్రసౌఖ్యంచ నిత్యం బ్రాహ్మణభోజనం,
షష్ఠాష్టవ్యయగేనీచే పాపక్షేత్రసమన్వితే. 15
కర్మవిఘ్నం మానహానిం పాపచింతాభవిష్యతి,
కళత్రపుత్రపీడాచ హృద్రోగం రాజభీతికృత్. 16
జ్యేష్ఠభ్రాతృవియోగంచ మాతృపిత్రాదిపీడనం,
ద్వితీయ ద్యూననాథేతు అపమృత్యుర్భవిష్యతి. 17
స్వర్ణస్యప్రతిమాదానం శివపూజాంచకారయేత్,
దేహారోగ్యం ప్రకుర్వీత శాంతిం కుర్యాద్విచక్షణః 18

తా. రాహుదశయందు గురుభుక్తి ౨౮ మాసములు, ౨౪ దినములు:—ఈగురువు లగ్నాత్కేంద్రత్రికోణములయందును స్వక్షేత్రోచ్చములయందును, మిత్రస్వాంశములయందును, శుభులతోఁ గూడి బలియుఁడై యుండెనేని, భూలాభమును, మనోధైర్యమును, శత్రునాశమును, ధనలాభమును, వాహనశకటవిక్రయలాభమును, పుత్రజననమును, గృహమందు వివాహవైభవమును, నిరృతి పశ్చిమదిక్ప్రయాణమును, బంధుదర్శనమును, ప్రయత్నకార్యసిద్ధియును, పుణ్యక్షేత్రనివాసమును, కళత్రపుత్రసౌఖ్యమును, నిత్యబ్రాహ్మణభోజనమును,

మహారాజాశ్రయమును గల్గును. ఈరాహువునకు దుస్థానములయందు నీఁగుచు వుండినను, లగ్నమునకు షష్ఠాష్టమములయందు, నీచశత్రుస్థానములయందు నుండినచో, కార్యవిఘ్నములును, మానహానియును, పాపచింతయును, కళత్రపుత్రదోషమును, హృద్రోగమును, రాజదండన భీతియును, జ్యేష్ఠ భ్రాతృ జనారిష్టమును, మాతాపితృవియోగదుఃఖమును, ధనవ్యయమును గల్గును. ఈగురువు లగ్నమునకు ౨-౭ స్థానాధిపతియై పాపగ్రహయుతుఁడై మారక గ్రహములచేతఁ జూడఁబడుచు నుండినచో, అపమృత్యుదోషము ప్రాప్తించును. తద్దోషపరిహారమునకు శివపూజయును, సువర్ణలింగప్రతిమాదానమును, యామిళోక్త ప్రకారము చేసినచో నాయురారోగ్యమును కార్యజయమును గల్గును.

రాహుదశాయాం శనిభుక్తిమాసాః ౩౪ దినాని ౬ తత్ఫలమ్.

శ్లో. రాహోరంతర్గతే మందే లగ్నాత్కేంద్రత్రికోణగే,
స్వోచ్చ మూల త్రికోణే వా దుశ్చిత్కేలాభరాశిగే. 19
శుభాంశే శుభవర్గేచ దాయేశాత్కేంద్రగేఽపివా,
తద్భుక్తౌ వాహనప్రాప్తిః రాజప్రీతికరం శుభమ్. 20
వివాహోత్సవకార్యాణి వ్యాపారే ధనలాభకృత్,
ఆరామకరణోద్యుక్తః తటాకం కారయిష్యతి. 21
శూద్రప్రభువశా దిష్టలాభం గోధనసంకులం,
ప్రయాణం పశ్చిమేభాగే ఋణద్రవ్యాదిలాభకృత్. 22
నీచారిక్షేత్రగేమందే పాపయుక్తేఽథ వీక్షితే,
నీచచోరాదిభీతిశ్చ దారపుత్రాదిపీడనమ్. 23
ఆప్తబంధుమనస్తాపం దాయాది జనవిగ్రహః,
వ్యవహారంచ కలహం మృతవార్తాగమం భవేత్. 24
సస్యహాని ర్ధానహాని ర్మాతాపితృవియోగకృత్,
ధనవ్యయం రాజకోపం స్థానభ్రంశోగ్నిపీడనమ్. 25
వాతశ్లేష్మాదిరోగం స్యా దకస్మాత్కలహం భవేత్,
ద్వితీయద్యూననాథేతు పాపయుక్తేఽథవీక్షితే. 26
అపమృత్యుభయం చైవ పుత్రహాని ర్భవిష్యతి,

తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్ 27
యామిళోక్తప్రకారేణ శాంతిం కుర్యాత్సుఖావహమ్,

తా. రాహుదశయందు శనిభుక్తి 3౮ మాసములు, ౬ దినములు:— ఈశనైశ్చరుఁడు ౧-౪-౭-౧౦-౫-౯-౧౧-3 స్థానములయందుఁగాని, యుచ్చరాశియందుఁగాని, శుభాంశ శుభక్షేత్రములయందుఁగాని, దశానాథునకుఁ గేంద్ర కోణోచ్చములయందుఁగాని యుండినచో, వాహనప్రాప్తియును, రాజప్రీతియును, వివాహోత్సవకార్యములును, వ్యాపారమూలకధనలాభమును, వన కూప తటాక కార్యములు చేయుటయును, శూద్రప్రభుమూలక కించిద్ధనలాభమును, పశ్చిమ నిరృతి దిశప్రయాణమును, ఋణధనలాభమును, నీచవస్తువ్యాపారమును గల్గును.— ఈశని - ౬ - ౮ - ౧౨ స్థానములయందుఁగాని, దశానాథునకు ౬ - ౮-౧౨ స్థానములయందుఁగాని, పాపగ్రహములతోఁ గూడియుండినను, జూడఁబడి యుండినను, నీచులచేతను, చోరులచేతను, మ్లేచ్ఛాదిజనులచేతను, వ్యవహారాది భయమును, కళత్రదోషమును, పుత్రారిష్టమును, ఆప్తబంధుజనమనస్తాపమును, దాయాదిజనవిష్వరమును, వ్యవహారమును, మృతవార్తాగమమును, సస్యహానియు, మానహానియు, మాతాపితృజనారిష్టమును, ధనవ్యయమును, రాజకోపమును, స్థానభ్రంశమును, అగ్నివ్రణపీడలును, వాతశ్లేష్మాదిరోగపీడయును, అకస్మాత్కలహమును గల్గును. ఈశనైశ్చరుఁడు లగ్నమునకు ౨-౭ స్థానములయందు మారకగ్రహయుక్తుఁడై తదాధిపత్యముతోఁ బాపగ్రహములచేతఁ జూడఁబడినను, కూడి యుండినను, పుత్రహానియును, అపమృత్యుదోషమును గల్గును. తద్దోష పరిహారమునకు యామిళోక్తప్రకారము విష్ణుసాహస్రనామపారాయణమును, స్వర్ణవిష్ణుప్రతిమాదానమును జేసినచో నాయురారోగ్యము గల్గును.

రాహుదశాయాం బుధభుక్తిమాసాః 3౦, దినాని ౧౮. తత్ఫలమ్

శ్లో. రాహో రంతర్గతే సౌమ్యే లగ్నాత్కేంద్రత్రికోణగే. 28
ఉచ్చస్వక్షేత్రగేవాపి శుభగ్రహసమన్వితే,
లగ్నాధిపేన సంయుక్తే శుభాంశే శుభవర్గగే. 29

స్వక్షేత్రాన్నభోజనం సౌఖ్యం విద్యాలాభ వినోదకృత్,
గృహేకల్యాణసంప్రాప్తిః సద్గ్రంథపఠనం భవేత్. 30
వ్యాపారోద్యోగవిభవం నటగాయకసంకులమ్,
రాజప్రీతికరంచైవ పుత్రలాభం సుఖావహమ్ 31
వనకూప ప్రతిష్ఠాది దానధర్మాది సంగ్రహం,
విచిత్ర గృహనిర్మాణం బంధూనా ముపకారకృత్ 32
షష్ఠాష్టమ వ్యయే సౌమ్యే నీచేవా పాపసంయుతే,
క్రూర దృష్ట్యాంశ సంయుక్తే దాయేశా త్కేంద్రవర్జితే. 33
స్థానభ్రంశం మనస్తాపం దేహశోష మనింద్యకే,
గృహ క్షేత్రాది నాశంచ బంధూనాం కుత్సితో భవేత్ 34
కళత్రపుత్రపీడాచ క్షయగుల్మాది రోగకృత్,
ద్వితీయ ద్యూననాథేతు అపమృత్యుర్జయం భవేత్ 35
తద్దోష పరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్,

తా. రాహుదశయందు బుధభుక్తి ౩౦ మాసములు, ౧౮ దినములు:—ఈబుధుఁడు కేంద్రత్రికోణోచ్ఛస్థానంబులయందును, స్వక్షేత్రమునందును, శుభాంశ, శుభవర్గయందును, శుభగ్రహయుతుఁడై శుభగ్రహములచేతఁ జూడఁబడియుండినను, లగ్నాధిపతితోఁ జేరియుండినను, మృష్టాన్నభోజనమును, సౌఖ్యమును, విద్యాలాభమును, గృహమునఁ గల్యాణ ప్రాప్తియును, సద్గ్రంథపఠనమును, వ్యాపారోద్యోగవిభవమును, నృత్తగీత వాద్యవినోదమును, రాజప్రీతియును, బంధుప్రీతియును, పుత్రజననమును, వనకూప తటాక గోపుర నిర్మాణాదులును, దానధర్మసంగ్రహమును విచిత్రగృహ నిర్మాణమును, బంధూపకారమును, దేవతోత్సవ దర్శనమును గలుగును:—ఈబుధుఁడు షష్ఠాష్టమ వ్యయ నీచరాసులయందుఁ బాపగ్రహయుతుఁడై క్రూరగ్రహ దృశ్యాంశలయందు నుండినను, దశానాథునకు కేంద్రములయందు లేకయుండుటచేతను, స్థానభ్రంశమును, మనస్తాపమును, దేహశోషమును, గృహక్షేత్రనాశనమును, బంధుమనస్తాపమును, కుత్సితాన్నభోజనమును, కళత్రపుత్రపీడయును, క్షయగుల్మాదిరోగమును, ఉబ్బసవ్యాధియును కల్గును. ఈబుధుఁడు లగ్నమునకు ౨-౭ స్థానములయందుండినను,

ఆస్థానాధిపతియై యుండినను పాపగ్రహయుతుండై పాపగ్రహవీక్ష
ణము గలిగియుండినచో అపమృత్యుదోషము గలుగును. తద్దోషపరి
హారము విష్ణుసహస్రనామపారాయణము చేయించుటచేత నాయురా
రోగ్యమును ప్రయత్నకార్యానుకూలమును శత్రుజయమును దేవదర్శ
నమును గలుగును.

రాహుదశాయాం కేతుభుక్తి మాసాః ౧౨, దినాని ౧౮. తత్ఫలమ్.

శ్లో. రాహోరంతర్గతే కేతౌ భ్రమణం రాజవిజ్వరమ్. 36
వాతజ్వరాది రోగంచ క్షుద్రశూన్యాది రోగకృత్
కేంద్రకోణ సమాయుక్తే భావాధిప సమన్వితే. 37
మహారాజాశ్రయప్రాప్తిః గృహేకల్యాణసిద్ధిదం,
క్రూరాలయ సమాయుక్తే భావాధిప సమన్వితే. 38
శత్రుపీడా మనోదుఃఖం స్త్రీమూలాత్కలహంభవేత్
చోరాగ్ని శస్త్ర బాధాచ భ్రాతృద్వేషం ధనక్షయమ్ 39
పితృమాతృ వియోగశ్చ మానహాని ర్గృహక్షయం
పుత్రదార వియోగశ్చ చతుష్పాజ్జీవనాశనమ్. 40
అష్టమాధిప సంబంధే కార్యనాశం మనోరుజం,
కారాగృహభయంచైవ విషజంతు భయంభవేత్. 41
కేంద్రకోణ సమాయుక్తే శుభగ్రహసమన్వితే,
రాజసమ్మాన భూషాప్తిం గృహేకల్యాణ సంభవమ్. 42
వ్యాపారే ధనలాభంచ మిత్రమూలార్థసిద్ధిదం,
ద్వితీయ ద్యూనభావస్థే దేహపీడా భవిష్యతి. 43
తద్దోష పరిహారార్థం ఛాగదానంచ కారయేత్,

తా. రాహుదశయందు కేతుభుక్తి ౧౨ మాసములు, ౧౮ దిన
ములు:—ఈ కేతువునందు అచ్చటచ్చట తిరుగుటయును, రాజవిద్వర
మ్మును, వాతజ్వరాతిసారరోగమును క్షుద్రశూన్యాది భూతపీడయును,
ఈ కేతువు కేంద్రకోణములయందుఁ సద్భావాధిపులతోఁ గూడి యుండి
నచో మహారాజాశ్రయమును, కల్యాణప్రాప్తియును గలుగును. ఈ కే
తువు క్రూరగ్రహరాసులయందు ౧౨-౮ భావాధిపతులతోఁ గూడి

నను, వారిభావములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండినను, శత్రుబాధయును మనోదుఃఖమును విధవస్త్రీమూలక కలహమును, చోర అగ్ని శస్త్రాస్త్ర ఋణపీడలును, భ్రాతృద్వేషముగాని, భ్రాతృనాశమును అగుటయును, ధనక్షయమును, పితృమాతృనాశమును, మానహానియును, కళత్రపుత్రపీడయును, చతుష్పాజ్జీవహానియును, ప్రయత్నకార్యభంగమును, కారాగృహభయమును, విషజంతుభయమును గలుగును.—ఈకేతువు కేంద్రకోణములయందుగాని, ఉపచయ స్థానములయందుగాని, శుభగ్రహములతోఁ గూడియుండినను, శుభగ్రహములచేత చూడఁబడినను, రాజబంధుమిత్ర సమ్మానమును, గృహమున గల్యాణము, వ్యాపారమూలక ధనలాభమును, మిత్రమూలకకార్యసిద్ధియును గలుగును. ఈకేతువు లగ్నమునకు ౨-౭ స్థానములయందుగాని, మారకగ్రహ యుతుఁడై యుండినచో శిరోదంతకర్ణపీడగాని, గుల్మాది భూతపీడలుగాని గలుగును. తద్దోషపరిహారముగ మృత్యుంజయజపమును స్వర్ణమేషప్రతిమాదానమును యథావిధిఁ జేయుటచేత నాయురారోగ్యమును శుభమును గలుగును.

రాహుదశాయాం శుక్రభుక్తిమాసాః ౩౬ తత్ఫలమ్.

శ్లో. రాహో రంతర్గతే శుక్రే లగ్నాత్కేంద్రత్రికోణగే. 44
లాభేవా బలసంయుక్తే యోగప్రాబల్య మాదిశేత్,
విప్రమూలా ద్ధనప్రాప్తిః ప్రయాణం బంధుదర్శనమ్. 45
పుత్రోత్సవాదిసంతోషం గృహే కల్యాణసంభవం,
స్వోచ్చేవా స్వర్క్షగే శుక్రే తుంగాంశే స్వాంశగేఽపివా. 46
శుభగ్రహ సమాయుక్తే శుభగ్రహనిరీక్షితే,
వాహనం రాజసమ్మానం రాజ్యలాభం ధనాగమమ్. 47
నూతనగృహనిర్మాణం నిత్యమృష్టాన్నభోజనం,
కళత్రపుత్రవిభవం బంధుకల్యాణదర్శనమ్. 48
వ్యవసాయాత్స లాధిక్యం వివాహం మాంజబంధనం,
అన్యస్త్రీసుఖమాప్నోతి సత్కథాశ్రవణంభవేత్ 49
షష్ఠాష్టను వ్యయే శుక్రే నీచశత్రుగృహే స్థితే,

అకస్మాత్కలహం చైవ శత్రుబాధార్థలాభకృత్ 50
కళత్రపుత్రపీడా చ శూలరోగాదిసంభవం,
ఋణ ద్రవ్యాదిబాధా చ నానామూలాద్ధనవ్యయమ్. 51
నిగళం బంధనం ప్రాప్తిః స్థాననాశం మనోరుజం,
దాయేశా త్కేంద్రకోణస్థే త్రికోణేవా సమన్వితే. 52
లాభేవా ధనరాశిస్థే క్షేత్రలాభం మహత్సుఖం,
సుగంధవస్త్రశయ్యాది గానవిద్యాపరిశ్రమమ్. 53
స్వాధికారవివృద్ధిశ్చ మిత్రలాభం ధనాగమం,
దాయేశా ద్రిపురంధ్రస్థే వ్యయేవా పాపసంయుతే. 54
విషాగ్నినృపచోరాది మూత్రకృచ్ఛ్రి మహాభయం,
వ్రణ శస్త్రాది పీడాచ పునఃక్లేశం ధనవ్యయమ్. 55
కారాగృహ ప్రవేశంచ రాజకార్యవిరోధకృత్,
ద్వితీయ ద్యూన నాథేతు ఆత్మపీడా భయంభవేత్ 56
దుర్గాలక్ష్మీజపంకుర్యాత్ మృత్యునాశకరంభవేత్,

తా. రాహుదశయందు శుక్రభుక్తి ౩౬ మాసములు:—ఈ శుక్రుఁడు ౧-౪-౭-౧౦-౫-౯-౧౧ స్థానములయందు బలియుఁడై యుండినచోఁ బ్రబలయోగమును, విప్రజనమూలక ధనలాభమును, ప్రయాణమును, బంధుదర్శనమును, పుత్రోత్పత్తియును, గృహమున నుద్వాహవైభవమును, రత్నభూషణవిక్రయలాభమును, వ్యాపారప్రయత్నమును, బంధూపకారమును గల్గును.—ఈశుక్రుఁడు స్వక్షేత్రోచ్చ స్వాంశపరమోచ్చ శుభవర్గశుభాంశలయందు శుభగ్రహములతోఁ గూడియుండినను, చూడఁబడినను, వాహనలాభమును, రాజసమ్మానమును, రాజ్యలాభమును, నూతనగృహనిర్మాణమును, మృష్టాన్నభోజనమును, కళత్రపుత్ర సౌఖ్యమును, బంధుకల్యాణవిభవమును, వ్యవసాయముచేత ధాన్యలాభమును, వివాహమున మౌంజీబంధనాది సత్కార్యములును, అన్యస్త్రీసుఖమును, సత్కథాశ్రవణమును, సజ్జనస్నేహమును గలుగును. ఈ శుక్రుఁడు షష్ఠాష్టమవ్యయ నీచ శత్రుస్థానములయందుఁ బాపగ్రహయుతుఁడైనను, జూడఁబడినను, అకస్మాత్కలహమును, శత్రుభయమును,

కళత్రపుత్రపీడయును, శూలరోగాదిబాధయును, ఋణద్రవ్యబాధయును,నానామూలకధనవ్యయమును,బంధనకార్యముచేతమానహానియు, స్థాననాశమును, మనోదుఃఖమును, నీచజనసంగమంబును గల్గును. దశానాథునకు శుక్రుఁడు కేంద్రకోణస్థానములయందుఁగాని లాభస్థానమునందుఁగాని ధనస్థానమునందుగాని యుండినచో భూధనలాభమును సుఖమును సుగంధవస్త్రశయ్యాదిభోగమును గానవిద్యాపరిశ్రమంబును స్వాధికారాభివృద్ధియును మిత్రజనలాభమును గల్గును. ఈశుక్రుఁడు దశానాథునకు ౬-౮-౧౨ స్థానములయందుఁ బాపగ్రహసంయుతుఁడై యుండినచో విషాగ్నిరాజచోరబాధయును,మూత్రకృచ్ఛ్రాదిరోగబాధలును, వ్రణశస్త్రాస్త్రపీడలును, మనఃక్లేశమును, ధనవ్యయమును, కారాగృహప్రవేశమును, రాజకార్యవిరోధమును గల్గును. ఈశుక్రుఁడు ౨-౭ స్థానములయందుండి స్వాంశాధిపత్యముతోను స్వక్షేత్రతుంగాధిపత్యముతోను బాపయుతుఁడై యుండినచో అపమృత్యుపీడగల్గును. అందులకు దుర్గాలక్ష్మీజపమును స్వర్ణమహిషీప్రతిమాదానమును జేయుటచేత నాయురారోగ్యము గల్గును.

రాహుదశాయాం రవిభుక్తిః మాసాః ౧౦, దినాని ౨౪. తత్ఫలమ్.

శ్లో. రాహోరంతర్గతే సూర్యే స్వోచ్చే స్వక్షేత్ర కేంద్రగే. 57
త్రికోణే లాభగే వాఽపి తుంగాంశే స్వాంశగేఽపివా,
శుభగ్రహేణసంయుక్తే శుభాంశే శుభవర్గగే. 58
దాయేశాత్కేంద్రరాశిస్థే కోణస్వక్షేత్రలాభగే,
అల్పగ్రామాధిపత్యంచ ధనధాన్యసమృద్ధికృత్ 59
రాజాశ్రయం మహత్సౌఖ్యం వాహనాంబరలాభకృత్,
వ్యాపారోద్యోగసంప్రాప్తిః పుత్రకల్యాణసంభవమ్. 60
అరణ్యవస్తువ్యాపారా ద్ధనలాభం రిపుక్షయం,
లగ్నాద్రిపురంధ్రస్థే వ్యయేనీచారిరాశిగే. 61
పాపగ్రహసమాయుక్తే పాపగ్రహనిరీక్షితే,
జ్వరాతిసారరోగంచ కలహం రాజవిగ్రహమ్. 62
ప్రయాణం శత్రువృద్ధిశ్చ నృపచోరాగ్నిపీడనం,

విదేశగమనంచైవ బంధునాశం మనోరుజమ్. 63
ప్రయత్నకార్యవిఘ్నంచ రాజద్వారే విరోధకృత్
ద్వితీయద్యూనవనాథేతు దేహజాడ్యం భవిష్యతి 64
తద్దోషపరిహారార్థం సూర్యారాధనమాచరేత్

తా. రాహుదశయందు సూర్యభుక్తి, ౧౦ మాసములు, ౨౪ దినములు:—ఈసూర్యుఁడు కేంద్రస్వక్షేత్రోచ్చ త్రికోణలాభస్వాంశల యందు శుభులతోఁగూడి యుండినను, శుభాంశలయందు నుండినను శుభవర్గలయందునుండినను, దశానాథునకుఁ గేంద్రత్రికోణములయందు నుండినను, అల్పగ్రామాధికారమును, ధనధాన్యసమృద్ధియును, రాజాశ్రయమును, మహాసౌఖ్యమును, వాహనాంబరభూషణసంప్రాప్తియును, వ్యాపారోద్యోగమును, పుత్రకల్యాణవిభవమును, అరణ్యవస్తువ్యాపారధనలాభమును, శత్రునాశమును గల్గును. ఈసూర్యుఁడు లగ్నాది ౧౨-౮-౬ స్థానములయందును, నీచస్థానమునను, పాపగ్రహములతోఁ గూడి పాపగ్రహములచేతఁ జూడఁబడుచునుండినచో, జ్వరాతిసారరోగమును, అకస్మాత్కలహమును, రాజవిద్వరమును, ప్రయాణములును, రాజ, చోర, అగ్ని, వ్రణపీడలును, విదేశగమనమును, బంధునాశమును, మనోదుఃఖమును, ప్రయత్నకార్యవిఘ్నమును, రాజద్వారమునందు జనవిరోధమును, కష్టెలమ్మటయు నగును. ఈరవిలగ్నమునకు ౨-౭ స్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండినచో దేహజాడ్యము గల్గును. తత్పరిహారమునకు సూర్యనమస్కారమును, గోధూమధాన్యదానమును, యథావిధిగఁ జేయించుటచేత శుభ మగుచున్నది.

రాహుదశాయాం చంద్రభుక్తి మాసాః ౧౮. తత్ఫలమ్.

శ్లో. రాహో రంతర్గతేచంద్రే కేంద్రకోణసమన్వితే. 65
లాభేజామిత్రరాశిస్థే మిత్రస్వక్షేత్రతుంగగే,
గురుణాసంయుతే దృష్టే శుభాంశే శుభవర్గగే. 66
పూర్ణచంద్రే పూర్ణఫలం రాజత్వం నృపపూజనం,
అశ్వవాహనలాభస్స్యాత్ గృహక్షేత్రాదిసంపదః. 67
లక్ష్మీకటాక్షచిహ్నాని గృహే కల్యాణవైభవం,

యత్నకార్యార్థసిద్ధి స్స్యా ద్ధనధాన్యసుఖావహమ్. 68
సత్కీర్తీ రాజసమ్మానం దేవతారాధనం శుభం,
వ్యాపారోద్యోగసంప్రాప్తిః రత్నభూషణసంగ్రహమ్. 69
వ్యవసాయాత్ఫలాధిక్యం గృహే గోకులవర్ధనం,
రాజద్వారే కార్యసిద్ధి ర్మనస్సంతోష మాప్నుయాత్. 70
షష్ఠాష్టమవ్యయే చంద్రే పాపక్షేత్రాదినీచగే,
పాపగ్రహ సమాయుక్తే దాయేశా ద్రిపురంధ్రగే. 71
ధనభాగ్యపసంయుక్తే యత్నకార్యార్థనాశనం,
గృహ క్షేత్ర వినాశంచ చోరాగ్ని నృపపీడనమ్. 72
అకస్మాత్కలహంచైవ మానభంగం మహద్భయం,
స్థానభ్రంశం మనోదుఃఖం ప్రయాణంకార్యనాశనమ్. 73
వ్రణపైశాచబాధాచ బంధునాశం భవిష్యతి,
ద్వితీయ ద్యూననాథే వా అపమృత్యు స్తథా భవేత్ 74
శ్వేతాంగాం మహిషీం దద్యా ద్దానే నారోగ్య మాదిశేత్

తా. రాహుదశయందుఁ జంద్రభుక్తి, ౧౮ మాసములు:— ఈచంద్రుఁడు ౧-౪ - ౭ - ౧౦ - ౫ - ౯ - ౧౧ స్థానములయందును, స్వోచ్చ స్వక్షేత్ర మిత్ర శుభవర్గ శుభాంశలయందును, గురువుతోఁ గూడినను, జూడఁబడినను, సంపూర్ణచంద్రుఁడై యుండినచో, రాజసమ్మానమును, అశ్వవాహనలాభమును, గృహవిక్రయలాభమును, భూలాభమును, లక్ష్మీకటాక్షమును, గృహమునఁ గల్యాణాదిశుభవైభవమును, ప్రయత్నకార్యసిద్ధియును, ధనధాన్యలాభమును, సత్కీర్తియును, దేవతారాధనమును, వ్యాపారోద్యోగసంప్రాప్తియును, రత్నభూషణవిక్రయలాభమును, వ్యవసాయమూలక ఫలాధిక్యమును, పశువృద్ధియును, రాజద్వారమున కార్యజయమును, శత్రుజయమును, చందనపుష్పతాంబూలానుభోగమును, మిత్రబంధుజనోపకారమును గల్గును. ఈచంద్రుఁడు ౬-౮-౧౨ స్థానములయ్యందుగాని నీచస్థానమునఁ గాని దశానాథునకు ౬-౧౨-౮ స్థానములయందుగాని పాపగ్రహయుతుండై పాపగ్రహవీక్షణముగల్గి ౨-౭ స్థానాధిపతులతోఁ గూడియుండినచో ప్రయత్నకార్యవిఘ్నమును, చోరాగ్నివ్రణజ్వరపీడలును, అకస్మా

త్కలహమును, స్థానభ్రంశమును, మనోదుఃఖమును, పిశాచబాధయును, నిర్బంధమానహానియును, బంధుజనమాతృసమానజన మృతాశౌచమునుగల్గును. ఈచంద్రుఁడు లగ్నమునకు ౨-౭ స్థానములయందు మారకగ్రహ యుతుఁడై యుండినను షష్ఠాధిపత్యముగల్గియుండినను శీతజ్వరాద్యపమృత్యుదోషముగల్గును. ౨-౭ స్థానములకు నధిపతియైయాస్థానముల నుండినను నానావిధకష్టములుగల్గును. అందులకు శ్వేతగోదానమును, మహిషదానమును, దుర్గాజపమును జేయించుటచేతనాయురారోగ్యమును కార్యానుకూలమును గల్గును.

రాహుదశాయాం కుజభుక్తిమాసాః ౧౨, దినాని ౧౮. ఫలమ్.

శ్లో. రాహోరంతర్గతే భౌమే లగ్నాత్కేంద్రత్రికోణగే. 75
స్వోచ్చస్వక్షేత్రమిత్రర్క్షే శుభవర్గే శుభాంశగే,
దాయేశాత్కేంద్రకోణస్థే దుశ్చిక్యే లాభగేఽపివా. 76
రత్నభూషణసంప్రాప్తిః ప్రయాణం రాజదర్శనం,
భూలాభం శత్రునాశంచ సేనాపత్యం సుఖాధికమ్. 77
భ్రాతృమూలా ద్ధనప్రాప్తిః గృహనిర్మాణసంభవం,
పుత్రోత్సవం మనోత్సాహం నానామూలా ద్ధనాగమమ్. 78
పుత్రవర్గేషు కల్యాణం బంధూనా ముపకారకం,
రక్తవస్త్రాశ్వలాభంచ న్యాయ తృప్తిమూలాం మిత్రదర్శనం. 79
వనకూపాదినిర్మాణం దేవతారాధనం భవేత్,
దుష్టస్థానస్థితే భౌమే కారాగృహప్రవేశనమ్. 80
స్థానచ్యుతిం బంధువైరం వ్రణాగ్నిజ్వరపీడనం,
కళత్రపుత్రనాశంచ రాజద్వారేఽర్థనాశనం. 81
భ్రాతృవర్గే జనారిష్టం ఉన్నతా త్పతనం భవేత్,
ద్వితీయ ద్యూననాథేతు దేహజాడ్యం మనోరుజమ్. 82
అనడ్వాహంచ గాం దద్యా దారోగ్యంచ భవిష్యతి,

తా. రాహుదశయందు నంగారకభుక్తి ౧౨ మాసములు, ౧౮ దినములు:—ఈయంగారకుఁడు లగ్నమునకుఁ గేంద్రత్రికోణోచ్చ స్వక్షేత్ర మిత్రక్షేత్ర శుభవర్గ శుభాంశలయందుగాని, దశానాథునకుఁ

గేంద్రకోణములయందుఁగాని యుపచయస్థానములయందుఁగాని శుభగ్రహావీక్షణము గల్గి యుండినచో, రత్నభూషణవిక్రయలాభమును, ప్రయాణమును, బంధు రాజదర్శనమును, భూలాభమును, శత్రునాశమును, సేనాధిపత్యమును, భ్రాతృవర్గధనలాభమును, గృహనిర్మాణమును, పుత్రోత్సవమును, నానామూలకధనలాభమును, పుత్రవర్గమునఁ గల్యాణాదులును, బంధుజనోపకారమును, వస్త్రాభరణాశ్వలాభమును, ప్రయాణమును, మిత్రదర్శనమును, వనకూపనిర్మాణమును, దేవతారాధనమును, పాకశాలవిచారమును గల్గును. ఈయంగారకుఁడు దుస్థానములయందునుండి పాపగ్రహముల చేతఁ జూడఁబడినను గూడియుండినను, కారాగృహప్రవేశహేతుభయమును, నిర్బంధమానహానియును, స్థానచ్యుతియును, బంధువైరమును, వ్రణ అగ్ని జ్వర స్ఫోటక పీడయును, కళత్రదోషమును, పుత్రహానియును, రాజద్వారమునందు వ్యవహారమును, ధనవ్యయమును, భ్రాతృవర్గజనారిష్టమును, ఎత్తుగ నుండుచోట నుండి క్రింద పడుటయును గల్గును. లగ్నమునకు ౨-3 స్థానములకు నధిపతియై యుండి పాపగ్రహములతో నాస్థానములనుండినచో బంధుమృతియు, వాతగుల్మవ్యాధియునుగల్గును. అందులకుస్కందజపమును, స్వర్ణవృషభ ప్రతిమాదానమును, యథావిధిగఁ జేయుటవలన నత్యంత శుభముగల్గును.

ఇతి గాహుదశాంతర్దశావిచారము సంపూర్ణము.

---

గురుదశాయాం గురుభుక్తి మాసాః ౨౫, దినాని ౧౮. తత్ఫలమ్.

శ్లో. స్వోచ్చ స్వక్షేత్రగే జీవే లగ్నాత్కేంద్రత్రికోణగే,
శుభగ్రహ సమాయుక్తే బ్రాహ్మణప్రభుదర్శనమ్. 1
నూతనగృహనిర్మాణం వ్యాపారోద్యోగసంభవం,
కల్యాణం పుత్రలాభంచ వాహనాంబరలాభకృత్ 2
భూలాభం ధాన్యలాభంచ సత్కథాశ్రవణం భవేత్,
నూతనప్రభుసమ్మానం వ్యవహారేఽర్థలాభకృత్. 3
పశ్చిమాం దిశ మాశ్రిత్య ప్రయాణం బంధుదర్శనం,
దేవతోత్సవకల్యాణం దర్శనం కీర్తివృద్ధిదమ్. 4

నీచాంశే నీచరాశిస్థే షష్ఠాష్ట వ్యయరాశిగే,
పాపగ్రహ సమాయుక్తే దాయాదిజనవిద్వరమ్. 5
అకస్మాత్కలహంచైవ బంధునాశం మనోరుజం,
పితృవర్గే జనారిష్టం కార్యవిఘ్నం ధనవ్యయమ్. 6
పుత్రశోకం స్థాననాశం వాతశ్లేష్మాది రోగకృత్,
కళత్ర దేహపీడాచ అన్యగ్రామనివాసకృత్. 7
విదేశగమనంచైవ రాజభీతి ర్మృతిర్భయం,
ద్వితీయద్యూననాథేతు దేహబాధాభవిష్యతి. 8
తద్దోషపరిహారార్థం శివసాహస్రకం జపేత్,

తా. గురుదశయందు గురుభుక్తి ౨౫ మాసములు, ౧౮ దినములు:—ఈగురుడు లగ్నమునకు మారకత్వమునొందక స్వోచ్చస్వక్షేత్ర కేంద్రకోణ మిత్రస్థానములయందును, శుభస్థానములయందును, శుభగ్రహయుతుండై యుండినచో, బ్రాహ్మణ ప్రభుదర్శనమును, నూతనగృహనిర్మాణమును, వ్యాపారము, సద్యోగిష్టును, గృహమునం గల్యాణమును, పుత్రజననమును, వాహనవస్త్రభూషణలాభమును, భూధనధాన్యలాభమును, సత్కథాశ్రవణమును, నూతనప్రభుదర్శనమును, వ్యవహారజయమును, పశ్చిమ నిరృతి దిశప్రయాణమును, బంధుదర్శనమును, దేవతోత్సవ కల్యాణదర్శనమును గల్గును. ఈగురుడు నీచాంశయందును నీచరాశియందును షష్ఠాష్టమవ్యయరాసుల యందును పాపగ్రహయుతుండై పాపక్షేత్రములయందు నుండినచో, దాయాదిజనవిద్వరమును, నిర్బంధకార్యములును, అకస్మాత్కలహమును, శత్రుభయమును, బంధుజనమృతియును, పితృసమానజనారిష్టమును, వ్యవహారమూలకధనవ్యయమును, పుత్రశోకమును, స్థాననాశమును, వాతశ్లేష్మాదిరోగపీడయును, కళత్రదోషమును, అన్యగ్రామసంచారమును, రాజదండనాదిభయమును, ఋణధనబాధయును గల్గును. ఈగురుడు ౨-౭ స్థానములకధిపతియైనను, ఆస్థానములయందు మారకదోషప్రదుండై యుండినను, దేహజాడ్యాదులుగల్గును. అందులకు శివసహస్రనామపారాయణమును, స్వర్ణలింగప్రతిమాదానమును, యథావిధిగ జేసినచో నాయురారోగ్యమును, గార్యానుకూలమును గల్గును.

గురుదశాయాం శనిభుక్తిమాసాః ౩౦, దినాని ౧౨. తత్ఫలమ్.

శ్లో. జీవస్యాంతర్గతేమందే మిత్రస్వక్షేత్రతుంగగే. 9
కేంద్రత్రికోణే లాభస్థే దుశ్చిక్యే శుభరాశిగే,
రాజ్యలాభం మహత్సౌఖ్యం వస్త్రాభరణలాభకృత్ 10
గృహపశ్వాదిలాభశ్చ నీచవ్యాపారసిద్ధిదం,
రాజకార్యార్థసిద్ధిశ్చ పుత్రోత్పత్తి ర్నసంశయః. 11
శత్రునాశం భూమిలాభం నీచస్త్రీసంగమం భవేత్,
గృహే కల్యాణవిభవం రాజసమ్మాన మాప్నుయాత్ 12
పశ్చిమాం దిశ మాశ్రిత్య ప్రయాణం రాజదర్శనం,
వ్యాపారే ధనలాభంచ రాజప్రీతికరం భవేత్. 13
షష్ఠాష్టవ్యయనీచస్థే పాపగ్రహసమన్వితే,
ధన ధాన్యాది నాశంచ నృపచోరాగ్నిపీడనమ్. 14
స్త్రీపుత్రవర్గపీడాచ వ్రణోష్ణాధిక్యసంభవం,
బంధుద్వేషం భృత్యకలహం రాజదండా ద్ధనక్షయమ్. 15
మానహాని ర్మనోదుఃఖం విదేశగమనం భవేత్,
కార్యనాశం మనస్తాపం ఋణబాధా భవిష్యతి. 16
ద్వితీయసప్తనాథేతు అపమృత్యుభయం భవేత్,
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్. 17
సువర్ణమహిషీం దద్యా ద్దానేనారోగ్య మాదిశేత్,

తా. గురుదశయందు శనిభుక్తి ౩౦ మాసములు, ౧౨ దినములు:—ఈశని స్వక్షేత్ర మిత్రక్షేత్ర స్వోచ్చ కేంద్రత్రికోణముల యందుగాని, శుభవర్గ శుభాంశలయందుగాని, యుపచయరాసుల యందుగాని, శుభగ్రహయుతుఁడై యుండినచో, రాజ్యలాభమును, మహత్సౌఖ్యమును, వస్త్రాభరణలాభమును, గృహలాభమును, పశుధన లాభమును, నీచవ్యాపారమును, నీచజనస్నేహమును, రాజకార్యాను కూలమును, పుత్రోత్పత్తియును, శత్రునాశమును, భూలాభమును, నీచస్త్రీసంగమమును, గృహమునందు కల్యాణవైభవమును రాజస మ్మానమును, పశ్చిమ నిరృతి దిశప్రయాణమును, రాజ, బంధు,

మిత్ర దర్శనమును, వ్యాపారమూలకధనలాభమును, రాజతుల్య యోగమును, రాజప్రియమును గల్గును. ఈశనైశ్చరుఁడు లగ్నమునకు షష్ఠాష్టమవ్యయస్థానములయందు గాని, నీచస్థానమునందుగాని పాపగ్రహయుతుఁడైనను, జూడఁబడినను, ధనధాన్యనాశమును, రాజ, చోర, అగ్ని పీడయును, స్త్రీపుత్ర దేహజాడ్యమును, వ్రణ జ్వరపీడలును, బంధుద్వేషమును, భృత్యకలహమును, రాజదండనాదులచేత ధనవ్యయమును, మానహానియును, మనోదుఃఖమును, విదేశగమనమును, కార్యవిఘ్నమును, ఋణధనబాధయును గల్గును. ఈశని ౨ - ౭ స్థానాధిపతిగా యుండినను, ఆస్థానముల యందు మారకాధిపత్యము గల్గియుండినను, మారకగ్రహములతోఁ జేరి యుండినను జ్వరాతిసార గుల్మవ్యాధి నిచ్చును. తచ్ఛాంతి విష్ణుసహస్రనామపారాయణమును స్వర్ణమహిషప్రతిమాదానమును జేయుట శుభము.

గురుదశాయాం బుధభుక్తిమాసాః ౨౭, దినాని ౬ తత్ఫలమ్.

శ్లో. జీవస్యాంతర్గతే సౌమ్యే లగ్నాత్కేంద్రత్రికోణగే. 18
స్వోచ్ఛే వా స్వర్క్షగే వాపి దశాధిపసమన్వితే,
అర్థలాభం దేహసౌఖ్యం స్వాధికారవివృద్ధికమ్. 19
వాహనాంబరపశ్వాదిగృహే గోధనసంకులం,
గజవాజి సమాయుక్తో రాజమంత్రప్రసాదతః. 20
కల్యాణం భూరిసంపత్తిః ద్విమాత్రో భవతి ధ్రువం,
వ్యాపారాద్ధనలాభంచ సత్కథాశ్రవణం భవేత్. 21
షష్ఠాష్టమవ్యయే నీచే పాపగ్రహసమన్వితే,
వ్యవసాయాత్ఫలంనష్టం మాతృపీడా మనోరుజమ్. 22
వాతశ్లేష్మాదిరోగం చ మార్గే చోరభయం భవేత్,
నిగళం బంధనప్రాప్తిః కార్యనాశం ధనక్షయమ్. 23
కళత్రపుత్రపీడా చ బంధుద్వేషం మృతి ర్భయమ్,
విదేశగమనం చైవ శత్రూణాం కలహం భవేత్. 24

ద్వితీయ ద్యూనవాథేతు అపమృత్యుర్భవిష్యతి. 24
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్,

తా. గురుదశయందు బుధభుక్తి ౨౭ మాసములు, ౬ దినములు:—ఈబుధుఁడు ౧-౪-౫-౭-౯-౧౦ స్థానములయందుఁగాని, స్వక్షేత్రోచ్చస్థానములయందుగాని, దశాధిపతితోఁగూడినంగాని, శుభవర్గ శుభాంశలయందుగాని యుండినచో, ధనలాభమును, దేహసౌఖ్యమును, స్వాధికారాభివృద్ధియును, వాహనాంబరపశుధనలాభమును, గజాశ్వవిక్రయలాభమును, రాజమంత్రిప్రియమును, కల్యాణప్రాప్తియును, కనకసమృద్ధియును, రెండవతల్లివచ్చుటయును, వ్యాపారమూలకధనలాభమును, సత్కథాశ్రవణమును గల్గును. ఈబుధుఁడు షష్ఠాష్టమవ్యయ నీచరాసులయందుఁ బాపగ్రహములతోఁ గూడియుండినచో, వ్యవసాయనష్టమును, మాతృపీడయును, మనోదుఃఖమును, వాతశ్లేష్మాదిరోగమును, మార్గమునఁ జోరభయమును, నిగళాదిబంధనప్రాప్తియును, కార్యవిఘ్నమును, ధనవ్యయమును, కళత్రపుత్రపీడయును, బంధుద్వేషమును, ప్రాణహానిభయమును, పరదేశగమనమును, శత్రుకలహమును గల్గును. ఈబుధుఁడు లగ్నమునకు ద్వితీయసప్తమాధిపతియై మారకగ్రహాయుతుఁడై యుండినచో, వాతశ్లేష్మవ్యాధియు, జ్వరమును, మారకదోషమును గల్గును. పరిహారము విష్ణుసహస్రనామపారాయణమును, స్వర్ణలక్ష్మీనారాయణ ప్రతిమాదానమును, యామిళ్లోక్తప్రకారము చేసినచో నాయురారోగ్యము గల్గుచున్నది.

గురుదశాయాం కేతుభుక్తి మాసాః ౧౧, దినాని ౬. తత్ఫలమ్.

శ్లో. జీవస్యాంతర్గతే కేతౌ కేంద్రే శుభసమన్వితే. 25
అల్పసౌఖ్యం ధనప్రాప్తిః కుత్సితాన్నంచ భోజనం,
పరాన్నంచైవ శ్రాద్ధాన్నం పాపమూలా ద్ధనాగమమ్. 26
అపూర్వ వస్తుసంప్రాప్తిః చిత్రాభరణలాభకృత్,
లగ్నా దుపచయస్థానే స్వాధికారాభివృద్ధిదమ్. 27
రాజప్రీతికరంచైవ శత్రునాశం ధనాగమం,
సత్కథాశ్రవణంచైవ చింతితార్థ సుసిద్ధిదమ్. 28

భాగ్యవాహనరాశిస్థే తదీశేన సమన్వితే,
పితృవర్గార్థలాభంచ వాహనాంబరలాభకృత్ 29
రిష్ఫరంధ్రస్థితే కేతౌ నీచే పాపసమన్వితే,
విధవాకలహంచైవ అకస్మాత్పితృనాశనమ్. 30
స్థానచ్యుతిం భ్రాతృనాశం రాజమూలాద్ధనక్షయం,
శిరోరోగం నేత్రపీడా విషజంతుభయంభవేత్ 31
గృహక్షేత్రాదినాశంచ మానహాని ర్భవిష్యతి,
ద్వితీయద్యూనరాశిస్థే దేహజాడ్యం మనోరుజమ్. 32
ఛాగదానం ప్రకుర్వీత మృత్యుంజయజపంచరేత్,

తా. గురుదశయందుఁ గేతుభుక్తి ౧౧ మాసములు, ౬ దినములు:—ఈ కేతువు లగ్నమునకు ౧-౪-౭-౧౦ స్థానములయందు శుభగ్రహయుతుఁడై యుండెనేని, అల్పసౌఖ్యమును, ధనప్రాప్తియును, కుత్సితాన్నమును, శ్రాద్ధాన్నమును, భోజనమును, పాపకార్యమూలకముగ ధనలాభమును, అపూర్వవస్తులాభమును, చిత్రాభరణవస్త్రలాభమును గల్గును. లగ్నమునకు ౩-౬-౧౧ స్థానములయందు నుండెనేని, స్వాధికారాభివృద్ధియును, రాజప్రీతియును, శత్రునాశమును, సత్కథాశ్రవణమును, చింతితార్థలాభమును గల్గును. ౯-౪ స్థానములయందు నాస్థానాధిపతితోఁ గూడియుండినచోఁ బితృవర్గధనలాభమును, వాహనయోగమును, రాజజనానుకూలమును, ఉద్యోగసుఖమును, విధవాసంగమంబును గల్గును. ఈ కేతువు లగ్నమునకు ౧౨-౮ స్థానములంగాని, శత్రునీచస్థానములంగాని, పాపగ్రహయుతుఁడై యుండినచో విధవస్త్రీకలహమును, పితృమృతియును, మాతృజనారిష్టమును, స్థానభ్రంశమును, భ్రాతృకలహము లేక భ్రాతృనాశమును, రాజదండనముచేత ధనవ్యయమును, శిరోరోగమును, నేత్రబాధయును, సర్పవిషజంతూపద్రవమును, గృహక్షేత్రనాశమును, మానహానియును, అన్యదేశసంచారమునుగల్గును. ఈ కేతువు లగ్నమునకు ౨-౭ స్థానములయందు మారకగ్రహయుతుఁడై యుండెనేని మానహానియును, దేహజాడ్యమును గల్గును. అందులకు యామిళోక్తప్రకారము మేషదానమును మృత్యుంజయజపమును చేసినచో నాయురారోగ్యము గల్గును. కార్యజయ మగును.

గురుదశాయాం శుక్రభుక్తి మాసాః 32. తత్ఫలమ్.

శ్లో. జీవస్యాంతర్గతే శుక్రే కేంద్రకోణసమన్వితే. 33
భాగ్యకర్మపసంయుక్తే స్వక్షేత్రే శుభసంయుతే,
వాహనాంబరలాభంచ మహారాజాశ్రయం భవేత్. 34
వాహనాధిప సంయుక్తే స్వోచ్ఛమూలత్రికోణగే,
రత్నభూషణ సంప్రాప్తిః వేశ్యాస్త్రీ సంగమో భవేత్ 35
గానవిద్యాప్రసంగంచ శయ్యాలాభం సుఖాధికం,
ఉత్తరాం దిశ మాశ్రిత్య ప్రయాణం మిత్రదర్శనం. 36
దేవతా గురుభక్తిశ్చ గృహే కల్యాణసంభవం,
వసకూపాది నిర్మాణం స్త్రీమూలా ద్ధనలాభకృత్. 37
స్వాధికారవివృద్ధిశ్చ విద్వజ్జనసమాగమం,
సుందరాగార భూమ్యాది లాభం క్షీరాన్నభోజనమ్. 38
షష్ఠాష్టమ వ్యయే నీచే పాపక్షేత్ర సమన్వితే,
కళత్ర బంధువైషమ్యం స్త్రీమూలాత్కలహం భవేత్. 39
సోదరేణ వివాదంచ విదేశగమనం తథా,
పశునాశం నృపాద్భీతి ర్మనోదుఃఖం ధనవ్యయమ్. 40
క్రయవిక్రయవైషమ్యం ఋణబాధా భవిష్యతి,
ద్వితీయ ద్యూనపే శుక్రే తదీశాభ్యాంయుతేక్షితే. 41
స్త్రీమూలాత్ప్రాణకష్టంచ రాజదండా ద్ధనక్షయః,
దుర్గాజపం ప్రకుర్వీత సుహిమీం దద్యా చ్ఛుభం భవేత్. 42

తా. గురుదశయందు శుక్రభుక్తి 32 మాసములు:—ఈశుక్రుఁడు కేంద్రత్రికోణములయందు భాగ్యకర్మాధిపతులతోఁ జేరియుండినను, స్వక్షేత్రస్వోచ్ఛరాసులయందు భాగ్యకర్మాధిపతులతోఁ గూడియుండినను శుభగ్రహములతోఁ గూడియుండినను, వాహనాధిపతితోఁ జేరియుండినను, రత్నభూషణవిక్రయలాభమును, వేశ్యాస్త్రీసంభోగమును, గానవిద్యాప్రసంగాది వినోదములును, స్త్రీశయ్యాభోగములును, ఉత్తరదిశ ప్రయాణముచేత మిత్రదర్శనమును, దేవతాగురుభక్తియును, గృహమునఁ గల్యాణాది శుభసంతోషములును, వనకూపగృహ నిర్మాణమును, స్త్రీమూలక ధనలాభమును, స్వాధికారాభివృద్ధియును, విద్వ

జ్జనసమాగమమును, సుందరమందిరనివాసమును, భూలాభమును, క్షీరాన్నభోజనమును, గొప్పవారిస్నేహమును, రాజతుల్యయోగమును గల్గును. ఈశుక్రుఁడు, షష్ఠాష్టమవ్యయనీచరాసులయందుఁ గాని, పాపక్షేత్రములంగాని, పాపగ్రహములతోఁ జేరియుండినచో వివాహవిఘ్నమును, కళత్రదోషమును, ద్వికళత్రప్రాప్తియును, స్త్రీమూలకకలహమును, బంధుమనస్తాపమును, భాతృవర్గకలహమును, అన్యగ్రామసంచారమును, పశునాశమును, వ్యాపారమునందు మనస్తాపమును, ఋణబాధయును, మనోవ్యాకులమును గల్గును. ఈశుక్రుఁడు ద్వితీయ సప్తమస్థానంబుల కధిపతియై ఆస్థానాధిపతులతోఁ జేరియుండినను, ఆస్థానములయందు మారకదోషయుక్తుఁడై యుండినను, స్త్రీమూలక కలహమును, రాజదండనచేత ధనక్షయమును, దేహజాడ్యమును గల్గును. పరిహారము దుర్గాజపమును, మహిషప్రతిమాదానమును, యథావిధిఁ జేసినచో నాయురారోగ్యమును, సర్వకార్యానుకూలమును గల్గును.

గురుదశాయాం రవిభుక్తిమాసాః ౯, దినాని ౧౮. తత్ఫలమ్.

శ్లో. జీవస్యాంతర్గతే సూర్యే స్వోచ్చస్వక్షేత్రసంయుతే,
త్రిషడాయగతేసూర్యే శుభాంశే శుభవర్గగే. 43
విద్యావివాహకార్యాణి గ్రామభూమ్యాదిలాభకృత్,
సమరే జయమాప్నోతి భూషణం పుత్రసంభవమ్. 44
అరణ్యగ్రామసంచారం తత్వశాస్త్ర ప్రసంగకృత్
వ్యాపారా ద్ధనలాభం చ రాజప్రీతికరం భవేత్. 45
షష్ఠాష్టమవ్యయేసూర్యే నీచే మందసమన్వితే,
శిరోరోగం స్థాననాశం వాతజ్వరప్రపీడితమ్. 46
కర్మనాశం బంధువైరం అకస్మాత్కలహం భవేత్,
కళత్రపుత్రపీడా చ ఋణపీడా ధనవ్యయమ్. 47
పితృవర్గే జనారిష్టం జ్ఞాతినాశం మనోరుజం,
ద్వితీయ ద్యూననాథే తు దేహపీడా భవిష్యతి. 48
తద్దోషపరిహారార్థం సూర్యప్రీతిం చ కారయేత్,

తా. గురుదశయందు సూర్యభుక్తి ౯ మాసములు, ౧౮ దినములు:—ఈసూర్యుఁడు స్వక్షేత్రస్వోచ్చ స్వాంశలయందు శుభసంయుతుఁడై యుండినచో, 3-౬-౧౧ స్థానములయందు బలియుఁడై యుండినచో, శుభాంశశుభవర్గలయందు నుండినచో. విద్యాధికమును, వివాహమును, గ్రామభూవిక్రయలాభమును, యుద్ధమునందు శత్రునాశమును, రత్నభూషణలాభమును, పుత్రజననమును, అరణ్యగ్రామసంచారమును, గురుయోగిసందర్శనమును, తత్వశాస్త్రప్రసంగమును, వ్యాపారమూలక ధనలాభమును, రాజజనస్నేహితమును, ఉద్యోగమును, ప్రయాణముచేఁ గార్యసిద్ధియు నగును. ఈసూర్యుఁడు షష్ఠాష్టమవ్యయ స్థానములయందు నీచస్థితుఁడై యుండినను, శనితోఁ జేరియుండినను శిరోదంతరోగములును, స్థానచ్యుతియును, వాతజ్వరాతిసారపీడయును, కర్మనాశమును, బంధువైరమును, జ్ఞాతిజనమృతియును, పితృజనారిష్టమును, అకస్మాత్కలహమును, ఋణధనబాధయును, రాజనిర్బంధమును, కళత్రపుత్రపీడయును, అశ్వవాహనవిక్రయజీవనమును, నీచజనస్నేహమును గల్గును. ఈసూర్యుఁడు లగ్నమునకు ౨-౭ స్థానాధిపతియై యుండి మారకగ్రహయుతుఁడై యుండినచో దేహజాడ్యము గలుగును. పరిహారము అరుణమంత్రముతో సూర్యనమస్కారము చేసినచో నాయురారోగ్యము గల్గును.

గురుదశాయాం చంద్రభుక్తిమాసాః ౧౬. తత్ఫలమ్.

శ్లో. జీవస్యాంతర్గతే చంద్రే కేంద్రే వాఽథ త్రికోణగే. 49
స్వోచ్చే వా స్వర్క్షరాశిస్థే పూర్ణచంద్రబలైర్యుతే,
గురుణా సంయుతే దృష్టే దాయేశా చ్ఛుభరాశిగే. 50
రాజసన్మానవిభవం పుత్రపౌత్రాభివర్ధనం,
మహారాజప్రసాదేన సర్వసౌఖ్యం ధనాగమమ్. 51
వాహనాంబరలాభం చ గృహే గోధనసంకులం,
షష్ఠాష్టమవ్యయే నీచే పాపగ్రహైః సమన్వితే. 52
క్షీణేవా శత్రుభీతిం చ చోరాగ్ని నృపపీడనం,
మాతృనాశ మనాచార మాత్మబంధువినాశనమ్. 53

ద్వితీయ సప్తమాధీశే దేహపీడా భవిష్యతి,
తద్దోష పరిహారార్థం దుర్గాలక్ష్మీజపం చరేత్. 54

తా. గురుదశయందుఁ జంద్రభుక్తి ౧౬ మాసములు:—ఈ చంద్రుఁడు కేంద్రత్రికోణ స్వక్షేత్రోచ్చ స్థానములయందు సంపూర్ణ చంద్రుఁడై గురువుతోఁ గూడినను జూడఁబడినను దశానాథునకుఁ గేంద్రత్రికోణస్థానములయందు శుభులతోఁ గూడియుండినను రాజసన్మానమును, పుత్రపౌత్రాభివృద్ధియును, మహారాజానుగ్రహముచేత సర్వకార్యానుకూలమును, సౌఖ్యమును, ధనలాభమును, వాహనశకట లాభమును, వస్త్రభూషణలాభమును, గృహధనగోభూమిలాభమును, శత్రుజయమునుగల్గును. ఈచంద్రుఁడు షష్ఠాష్టమవ్యయనీచస్థానముల యందుఁ బాపగ్రహములతోఁ జేరియుండినను క్షీణచంద్రుఁడై యుండినను, శత్రుభీతియును, చోరాగ్నినృపవ్రణ స్ఫోటకజ్వరాదిపీడలును, మాతృనాశమును, అనాచారప్రవర్తనమును, ఆత్మబంధునాశమును, ధనవ్యయమును గల్గును. ఈచంద్రుఁడు ౨-౭ స్థానములకు నధిపతియై మారకగ్రహయుతుఁడై యుండినచో దేహజాడ్యాదిపీడలుగల్గును. తద్దోషపరిహారమునకు దుర్గాలక్ష్మీ మంత్రజపమును, స్వర్ణమహిషప్రతిమా దానమును, యథావిధిఁ జేసినచో నాయురారోగ్యము గల్గును.

గురుదశాయాం భుక్తిమాసాః ౧౧, దినాని ౬. తత్ఫలమ్.

శ్లో. జీవస్యాంతర్గతే భౌమే లగ్నాత్కేంద్రత్రికోణగే,
స్వోచ్చ స్వక్షేత్రసంయుక్తే తుంగాంశే స్వాంశగేఽపివా. 55
శుభగ్రహసమాయుక్తే శుభాంశే శుభవర్గగే,
విద్యావివాహ కార్యాణి గ్రామభూమ్యాది లాభకృత్ 56
సమరే జయ మాప్నోతి సర్వకార్యార్థసిద్ధిదం,
వాహనాంబరలాభం చ మహారాజాశ్రయం భవేత్ 57
పుత్రోత్సవఞ్చ ధాన్యలాభం బంధుకల్యాణదర్శనం,
స్వాధికారవివృద్ధిశ్చ ప్రయాణం మిత్రదర్శనమ్. 58
షష్ఠాష్ట వ్యయ నీచస్థే పాపగ్రహసమన్వితే,
నానారోగభయం దుఃఖం స్థాననాశం ధనక్షయమ్. 59

రాజద్వేషం బంధునాశం ఉన్నతాత్పతనం భవేత్,
వ్రణాగ్నిజ్వరపీడా చ ఋణపీడా మనోరుజమ్. 60
ద్వితీయ ద్యూన నాథేతు దేహపీడా భవిష్యతి,
అనడ్వాహం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్. 61

తా. గురుదశయందు నంగారక భుక్తి ౧౧ మాసములు, ౬ దినములు:—ఈయంగారకుఁడు కేంద్ర త్రికోణ స్వక్షేత్రోచ్చ తుంగ స్వాంశలయందు శుభగ్రహయుతుఁడై శుభవర్గ శుభాంశలయందు నుండెనేని, విద్యాభ్యాసాధికమును, వివాహమును, గ్రామ భూలాభమును, కలహజయంబును, వాహనవస్త్రభూషణ విక్రయ లాభమును, మహారాజాశ్రయముచేతఁ గార్యసిద్ధియును, పుత్రోత్సవమును, భ్రాతృవర్గ వివాహాదులును, ధాన్యలాభమును, బంధుకల్యాణ దర్శనమును, స్వాధికారాభివృద్ధియును, దక్షిణపశ్చిమదిక్ప్రయాణముచేత బంధుమిత్రదర్శనమును, వ్యాపారమూలక ధనలాభమును, ధైర్యమును, పాకశాలవిచారమును, ఉష్ణపదార్థభోజనమును గల్గును. ఈయంగారకుఁడు లగ్నమునకు ౬-౮-౧౨ స్థానములయందుగాని, నీచస్థానమునంగాని పాపగ్రహయుతుఁడై వక్రత్వముతో నుండినచో నానారోగభయమును, స్థాననాశమును, రాజద్వేషమును, బంధుజన మృతియును, ఉన్నతాత్పతనముచేత నంగవైకల్యమును, వ్రణాగ్ని జ్వరాతిసార రోగమును, ఋణధనబాధయును గల్గును. ఈయంగారకుఁడు లగ్నమునకు ౨-౭ స్థానములకు నధిపతియై మారకగ్రహములచేఁ జూడఁబడినను గూడినను స్ఫోటకజ్వరపీడ గల్గును. అందులకుఁ బరిహారము స్కందజపమును, స్వర్ణవృషభప్రతిమాదానమును జేయుటచేత నాయురారోగ్యము గల్గును.

గురుదశాయాం రాహుభుక్తిమాసాః ౨౮, దినాని ౨౪. తత్ఫలమ్.

శ్లో. జీవస్యాంతర్గతే రాహౌ కేంద్ర మూలత్రికోణగే,
కేంద్రాధిపసమాయుక్తే భాగ్యాధిపసమన్వితే. 62
శుభాంశే శుభవర్గస్థే తుంగస్థే లాభరాశిగే,
పురగ్రామాధికారం చ నూతనప్రభుదర్శనమ్. 63

గృహే కల్యాణసంప్రాప్తిః బహుసేనాధిపత్యవాన్,
దూరయాత్రాదిగమనం పుణ్యధర్మాదిసంగ్రహమ్. 64
సేతుస్నానఫలప్రాప్తి రిష్టసిద్ధి ర్ధనాగమం,
రాజద్వారే శుభంచైవ రత్నభూషణలాభకృత్. 65
నైఋత్యాం పశ్చిమేభాగే ప్రయాణం బంధుదర్శనం,
షష్ఠాష్టమవ్యయే నీచే దాయేశా ద్రిపురిష్ఫగే. 66
పాపగ్రహసమాయుక్తే పుణ్యకర్మాదినాశనం,
రాజ చోరాగ్ని బాధాచ విషజంతు వశాద్భయమ్. 67
గృహకృత్యకలాపేన వ్యాకులం దారనాశనం,
పాండురోగం మనోదుఃఖం స్వజనే స్మృతిసంభవం. 68
ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి,
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపం చరేత్. 69
ఛాగదానం ప్రకుర్వీత సౌభాగ్యం భవతి ధ్రువమ్,

తా. గురుదశయందు రాహుభుక్తి ౨౮ మాసములు, ౨౪ దినములు:—ఈరాహువు కేంద్రమూల త్రికోణోచ్ఛ రాసులయందుఁ దదధిపతులతోఁ గూడియుండినను శుభాంశ శుభవర్గలయందును, లాభస్థానముననను, శుభగ్రహాయుతుఁడై యుండినను, గ్రామ పురాధిపత్యమును, నూతన ప్రభుదర్శనమును, గృహమునఁ గల్యాణవైభవమును, సేనాధిపత్యమును, దూరయాత్రచేతఁ బుణ్యధర్మాది సంగ్రహమును, సేతుస్నానఫలమును, ధనలాభమును, శత్రునాశమును, రాజద్వారమునఁ గార్యానుకూలమును, రత్నభూషణలాభమును, నిరృతి దక్షిణ దిక్ప్రయాణమును, బంధు మిత్ర సమాగమంబును గల్గును. ఈరాహువు షష్ఠాష్టమ వ్యయ నీచ పాప రాసులయందును, దశానాథునకు దుష్టస్థానములయందును, పాపగ్రహాయుతుఁడైనను జూడఁబడినను, పుణ్యకర్మనాశమును, రాజ చోరాగ్ని బాధయును, విషజంతూపద్రవమును, గృహకృత్యములయందు మనస్తాపమును, కళత్ర పుత్రహానియును, పాండురోగపీడయును, ఋణధనబాధయును, స్వజనమృతియును గల్గును. ఈ రాహువు లగ్నమునకు ద్వితీయ సప్తమ స్థానములయందు మారక గ్రహాయుతుఁడై యుండినచో

అపమృత్యుదోషము ప్రాప్తించును. అందులకు మృత్యుంజయజపమును ఛాగదానమును యథావిధిఁ జేసినచో నాయురారోగ్యము గల్గును.

ఇట్లు గురుదశాంతర్దశా విచారము సంపూర్ణము.

శనిదశాయాం శనిస్వభుక్తిమాసాః 3౽, దినాని 3. తత్ఫలమ్.

శ్లో. మందస్యాంతర్గతే మందే లగ్నాత్కేంద్ర త్రికోణగే,
తృతీయే లాభగే వాపి ఉచ్చస్వక్షేత్రసంయుతే. 1
స్వాంశే శుభసంయుక్తే రాజ్యలాభం మహత్సుఖం,
మహారాజప్రసాదేన కార్యసిద్ధి ర్నసంశయః. 2
రత్నభూషణలాభంచ గృహే వైవాహికం భవేత్,
వాహనాంబరవస్త్రాది లాభం శత్రుజయం సుఖమ్. 3
బంధుమిత్రవశా ల్లాభం స్వాధికారాభివృద్ధిదం,
పశ్చిమాం దిశమాశ్రిత్య ప్రయాణం మిత్రదర్శనమ్. 4
నీచవ్యాపారసిద్ధిశ్చ ధైర్యం బంధుగృహేశుభం,
ఋణ మూలార్థలాభంచ సత్కథాశ్రవణంభవేత్ 5
షష్ఠాష్టను వ్యయే నీచే పాపగ్రహసమన్వితే,
విషశస్త్రాగ్ని బాధాచ రాజదండా ద్ధనక్షయమ్. 6
గుల్మాతిసారరోగంచ విదేశ గమనంతథా,
ఋణబాధా శత్రుబాధా స్థాననాశం మనోరుజమ్. 7
కళత్రపుత్రనాశశ్చ గ్రామభూమ్యాది నాశకృత్,
ద్వితీయ ద్యూన నాథేతు అపమృత్యు ర్భవిష్యతి. 8
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపం చరేత్,

తా. శనిదశయందు శనిస్వభుక్తి 3౽ మాసములు, 3 దినములు:— ఈశని లగ్నమునకుఁ గేంద్ర త్రికోణోచ్చ స్వాంశ శుభవర్గ శుభాంశలయందును, లాభస్థానమునందును, తృతీయమునను, శుభగ్రహయుతుఁడై యుండినచో రాజ్యలాభమును, మహారాజానుగ్రహమువలనఁ గార్యానుకూలమును, రత్నభూషణ లాభమును,

గృహమునందు వివాహాదులును, వాహన వస్త్ర శకటలాభమును, శస్త్రలాభమును, శత్రుజయమును, బంధుమిత్రులచే నిష్టావాప్తియును, స్వాధికారాభివృద్ధియును, పశ్చిమదిశప్రయాణముచేత మిత్రబంధు రాజ జనదర్శనమును, నీచవస్తు వ్యాపారముచేత ధనలాభమును, ఋణధనలాభమును, ధైర్యసాహసమును, బంధుగృహమున వివాహాదిశుభవైభవదర్శనమును, సత్కథాశ్రవణమును, దేవదర్శనమును, గృహభూలాభమును, పుత్రవర్గ శుభములును గల్గును. ఈ శని లగ్నమునకు ౬-౮-౧౨ స్థానములయందు నుండినను, పాపక్షేత్ర నీచక్షేత్రములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండినచో, విష శస్త్ర అగ్నిబాధలును, రాజదండనాది కార్యములచేత ధనవ్యయమును, గుల్మాతిసార మూల మూత్రకృచ్ఛ్రాది రోగపీడలును, అన్యదేశ సంచారమును, ఋణధనపీడయును, స్వజనమృతియును, కళత్రపుత్రదోషమును, లాభమునకు మించిన ధనవ్యయమును, గృహభూవిక్రయమును, స్థానచ్యుతియును గల్గును. ఈశని లగ్నమునకు ౨-౭ స్థానములయందు నుండినను, స్థానాధిపత్యము గల్గియుండినను, మారకగ్రహయుతుఁడై యుండినచో వ్రణజ్వరదేహజాడ్యము, నపమృత్యుదోషమును గల్గును. తత్పరిహారము దుర్గామృత్యుంజయజపమును, స్వర్ణమహిషప్రతిమాదానమును, యామిళోక్తప్రకారము చేయుటచేత నాయురారోగ్యమును, సకలకార్యానుకూలమును గల్గును.

శనిదశాయాం బుధభుక్తి మాసాః ౩౨, దినాని ౯. తత్ఫలమ్.

శ్లో. మందస్యాంతర్గతే సౌమ్యే త్రికోణే లాభగేఽపివా. 9
కేంద్రేవా ధనగేవాపి స్వోచ్చస్వక్షేత్రసంయుతే,
స్థానాధిపేన సంయుక్తే శుభగ్రహనిరీక్షితే. 10
యజ్ఞకర్మాదిసిద్ధిశ్చ గృహే కల్యాణసంభవం,
సేతుస్నానఫలావాప్తిః వాణిజ్యం ధనవృద్ధిదమ్. 11
సద్గ్రంథపఠనం చైవ రాజయోగవశాత్సుఖమ్,
అన్నదానఫలంచైవ నిత్యమృష్టాన్నభోజనమ్. 12
వ్యాపారాద్ధనలాభంచ రాజసమ్మానమాప్నుయాత్,

షష్ఠాష్టమవ్యయే నీచే పాపక్షేత్రసమన్వితే. 13
రాజచోరాగ్నిపీడా చ దారపుత్రాదిపీడనం,
నిగళం బంధనప్రాప్తి రర్థహాని ర్మనోరుజమ్. 14
గ్రామభూగృహనాశం చ హితశత్రుత్వకారణం,
ద్వితీయసప్తమాధీశే దేహబాధా భవిష్యతి. 15
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్,
అన్నదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్. 16

తా. శనిదశయందు బుధభుక్తి ౩౨ మాసములు, ౯ దినములు:—ఈబుధుఁడు కేంద్రకోణోచ్చస్వక్షేత్రధనలాభస్థానములయందును, శుభాంశ శుభవర్గులయందును, తదీశులతోఁ జేరియుండినచో యజ్ఞకార్యసంసిద్ధియును, గృహమునఁ గల్యాణాదులును, సేతుస్నానఫలమును, వాణిజ్యధనధాన్యాభివృద్ధియును, సద్గ్రంథపఠనమును, రాజయోగమును, అన్నదానమును, మృష్టాన్నభోజనమును, వ్యాపారమూలక ధనలాభమును, రాజసన్మానమును, రత్నభూషణాంబరక్రయవిక్రయలాభమును, గురుదేవతోపాసనమును గల్గును. ఈబుధుఁడు షష్ఠాష్టమవ్యయనీచరాసులయందును, పాపక్షేత్రములయందును, పాపగ్రహయుతుఁడై యుండినచో రాజచోరాగ్నివ్రణపీడయును, కళత్రపుత్రపీడయును, నిగళబంధనకష్టమును, రాజదండనమూలకధనవ్యయమును, మనఃక్లేశమును, గ్రామభూనాశమును, గృహవిక్రయమును, హితశత్రుబాధయును, ఋణధనపీడయును గల్గును. ఈబుధుఁడు లగ్నమునకు ద్వితీయసప్తమస్థానాధిపతియై యుండినను ఆస్థానములయందు మారకగ్రహముతోఁ గూడియుండినను, వాతశ్లేష్మాదిరోగపీడలును, రాజవ్యవహారములునుగల్గును. తద్దోషశాంతికి విష్ణుసహస్రనామపారాయణమును, స్వర్ణలక్ష్మీనారాయణప్రతిమాదానమును, అన్నదానమును యథోక్తప్రకారము చేసినచో నాయురారోగ్యమును, కార్యానుకూలమును గల్గును.

శనిదశాయాం కేతుభుక్తిమాసాః ౧౩, దినాని ౯. తత్ఫలమ్.

శ్లో. మందస్యాంతర్గతే కేతౌ శుభగ్రహసమన్వితే,
శుభాంశే శుభరాశిస్థే యోగకారకసంయుతే. 17

కేంద్రే ఉచ్చయస్థానే తదీశేన సమన్వితే,
కల్యాణాది శుభప్రాప్తిః భూలాభం శత్రునాశనమ్. 18

ప్రయత్నకార్యసిద్ధిశ్చ మిత్రమూలా ద్ధనాగమం,
స్వాధికారాభివృద్ధిశ్చ రత్నభూషణలాభకృత్ 19

రంధ్రరిష్ఫస్థితే కేతౌ నీచేవా శత్రురాశిగే,
జ్వరాతిసారబాధాచ ఋణపీడా మనోరుజమ్. 20

విధవాకలహ్యం చైవ శత్రుమూలా ద్ధనవ్యయం
కళత్ర పుత్ర పీడాచ రాజచోరాగ్నిపీడనమ్. 21

ద్వితీయ ద్యూనరాశిస్థే నానాకష్టం భవిష్యతి,
తద్దోష పరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్ 22

తా. శనిదశయందు కేతుభుక్తి ౧౩ మాసములు, ౯ దినములు:—ఈ కేతువు శుభాంశలయందుఁగాని, శుభస్థానములయందుఁగాని, కేంద్రస్థానోపచయములయందుఁగాని తదీశులతోఁ గూడినను, యోగప్రదులతోఁ గూడియుండినను, కల్యాణాది శుభప్రాప్తియును, భూలాభమును, శత్రునాశమును, ప్రయత్నకార్యానుకూలమును, మిత్రజనమూలకధనలాభమును, స్వాధికారాభివృద్ధియును, రత్నభూషణవిక్రయలాభమును, కళత్రగర్భమును గలుగును. ఈ కేతువు లగ్నమునకు ౧.౨.౮ స్థానములంగాని, నీచశత్రుధనస్థానములంగాని పాపగ్రహయుతుఁడై యుండినచో జ్వరాతిసారవ్రణఋణపీడలును, విధవస్త్రీకలహమును, శత్రుజనమూలకధనవ్యయమును, కళత్రపుత్రదోషమును, రాజచోరాగ్నిస్ఫోటకపీడలును గలుగును. ఈ కేతువు లగ్నమునకు ౨.౭ స్థానములయందు నీచపాపగ్రహములతోఁ జేరియుండినచో నానాకష్టములుగలుగును. తద్దోషపరిహారమునకు మృత్యుంజయజపమును, మృత్యుంజయరజతప్రతిమాదానమును యథావిధి చేసినచో నాయురారోగ్యమును, కార్యానుకూలమును గల్గును.

శనిదశాయాం శుక్రభుక్తి మాసాః ౩౮. తత్ఫలమ్.

శ్లో. మందస్యాంతర్గతే శుక్రే స్వోచ్చస్వక్షేత్రసంయుతే,
కేంద్రేవా శుభసంయుక్తే త్రికోణే లాభగేఽపివా 23

దాయేశాత్కేంద్రకోణస్థే శుభాంశే శుభవర్గగే,

భాగ్యకర్మేశసంయుక్తే గృహేకల్యాణసంభవమ్ 24
రాజ్యలాభం మహోత్సాహం సుఖోరాజాశ్రయంతథా,
గ్రామభూగృహలాభం చ వ్యాపారాద్ధనలాభకృత్. 25
వనకూపాదినిర్మాణం స్వస్త్రీసౌఖ్యంయశోధికం,
గానవిద్యాప్రసంగంచ పుత్రోత్పత్తిర్నసంశయః. 26
అన్యగ్రామేషుసంచారం బంధుమిత్రప్రపూజితం,
వాహనంపశుస్త్రీలాభం రత్నభూషణలాభకృత్. 27
వ్యాపారేధనలాభంచ స్వాధికారాభివృద్ధికం,
శనిచారానుగుణ్యేన యోగంప్రాప్నోత్యసంశయః. 28
శత్రునీచాస్తగేశుక్రే షష్ఠాష్టవ్యయరాశిగే,
పాపగ్రహసమాయుక్తే దారనాశంధనవ్యయమ్. 29
స్థానచ్యుతింకార్యవిఘ్నం సదాచారవివర్జితం,
కపోలదంతశూలాది హృద్రోగంవాతపీడనమ్. 30
ఉన్మత్తత్వంతత్సంస్థాన రాజదోషంజలాద్భయం,
భ్రాతృవర్గవిరోధంచ స్వజనేష్వతిసంభవమ్ 31
ద్వితీయసప్తమాధీశే ఋణపీడార్థనాశనం,
అపమృత్యువశాత్పీడా మనఃక్లేశంభవిష్యతి. 32
తద్దోషపరిహారార్థం దేవీదుర్గాజపంచరేత్,
శ్వేతాంగాంమహిషీందద్యా దాయురారోగ్యమాదిశేత్. 33

తా. శనిదశయందు శుక్రభుక్తి 3౹౦ మాసములు.—ఈశుక్రుఁడు స్వోచ్ఛస్వక్షేత్రకేంద్రంబులయందు శుభగ్రహయుతుఁడై యుండినను లాభకోణంబులయందు నుండినను దశానాథునకు కేంద్రకోణములనుండినను శుభాంశలయందు శుభవర్గలయందు బలవంతుఁడై యుండినను ఆస్థానములయందు భాగ్యకర్మాధిపతులతోఁ గూడియుండినను గృహమునఁ గల్యాణాదిశుభవైభవములును, రాజ్యలాభమును, మహారాజాశ్రయమును, గ్రామభూగృహవిక్రయధనలాభమును, వ్యాపారమూలక ధనలాభమును, వనకూపతటాకాదినిర్మాణమును, స్వస్త్రీసౌఖ్యమును, గానవిద్యాప్రసంగవినోదమును, పుత్రోత్సవమును, అన్యగ్రామసంచారమును, బంధుమిత్రసమ్మానమును, వాహనపశుస్త్రీలాభమును, రత్న

భూషణవస్త్రలాభమును, వ్యాపారాభివృద్ధియును, స్వాధికారకీర్తియును, పరోపకారమును, శుక్రునితోడ శనిసంచారము కల్గినకాలమునందు రాజయోగప్రాబల్యమును, మహాధైర్యమును, ఋణధనప్రాప్తియును గల్గును. ఈశుక్రుఁడు లగ్నమునకుశత్రునీచపాపక్షేత్రములంగాని దుస్థానములంగాని యుండినచో కళత్రదోషమును, ధనవ్యయమును, స్థానచ్యుతియును, కార్యవిఘ్నమును, ఆచారవర్జితమును, కపోలదంతనేత్రహృద్రోగశూలబాధయును, ఉన్నతస్థానమునందుండి పడుటయును, రాజద్వేషమును, వ్యవహారాదులును, జలగండమును, భ్రాతృవర్గమునందు విరోధములు, స్వజనమృతియును గల్గును. ఈశుక్రుఁడు లగ్నమునకు ౨-౮-స్థానాధిపతియై యుండి పాపగ్రహయుక్తుఁడై యుండెనేని ఆ స్థానములయందు మారకగ్రహముండెనేని ఋణపీడయు, ధనవ్యయమును, అపమృత్యుదోషమును గల్గును. తద్దోషపరిహారమునకు దుర్గాదేవీమంత్రజపమును, శ్వేతగోదానమహిషీదానములును చేయుటచేత నాయురారోగ్యభాగ్యము గల్గును.

శని ఈదశాయాం సూర్యభుక్తమానాః ౧౧, దినాని, ౧౨. తత్ఫలమ్.

శ్లో. మందస్యాంతర్గతేసూర్యే కేంద్రలాభత్రికోణగే,
భాగ్యాధిపేనసంయుక్తే స్వక్షేత్రేసోచ్చసంయుతే. 34
శుభాంశేశుభరాశిస్థే మిత్రగృహసమన్వితే,
గృహేకల్యాణసంపత్తిః భూషణాంబరలాభకృత్ 35
స్వాధికారార్థసిద్ధిశ్చ దుష్టశత్రువినాశనం,
అశ్వేభపశులాభంచ వ్యాపారాద్ధనలాభకృత్ 36
పుత్రోత్సవంసుఖావాప్తిం రాజద్వారేశుభావహం,
అరణ్యగ్రామసంచారం కాష్ఠవ్యాపారమాదిశేత్ 37
బంధుకల్యాణవిభవం దేవతోత్సవదర్శనం,
ఋణవ్రణవ్యాదిలాభంచ సత్కథాశ్రవణంభవేత్ 38
షష్ఠాష్టమవ్యయేనీచే దాయేశాద్రిపురంధ్రగే,
రిష్ఫపాపగృహేవాపి పాపగృహసమన్వితే. 39
హృద్రోగంమానహానిశ్చ బుద్ధిభ్రంశంమనోరుజం,
స్వాధికారవినాశంచ ఋణపీడాభయంభవేత్ 40

ఆత్మసంబంధమరణం పితృవర్గవినాశనం,
జ్వరాతిసారపీడాచ బంధనం రాజవిడ్వరమ్. 41

స్థానచ్యుతిం బంధుహాని ర్వ్యాపారే కలహం భవేత్
ద్వితీయ ద్యూనసాథేతు దేహబాధా భవిష్యతి. 42

తద్దోషపరిహారార్థం సూర్యప్రీతి ప్రణామకం,
అశ్వదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్. 43

తా. శనిదశయందు సూర్యభుక్తి ౧౧ మాసములు, ౧౨ దినములు:—ఈసూర్యుఁడు లగ్నాది ౧-౪-౫-౭-౯-౧౦-౧౧ స్థానములయందు భాగ్యాధిపతిసహితుఁడై యుండినను, స్వక్షేత్రోచ్చమిత్రక్షేత్రములయందు నాస్థానాధిపతులతోఁ గూడియుండినను, శుభాంశశుభవర్గలయందు నుండినను, గృహమునఁ గల్యాణాదిశుభవైభవమును, భూషణాంబరపశుగజాశ్వలాభమును, స్వాధికారాభివృద్ధియును, దుర్జననాశమును, వ్యాపారమూలకధనలాభమును, పుత్రోత్సవమును, రాజద్వారమందు, జయమ్మును, అరణ్యవస్తువ్యాపారమును, గ్రామసంచారమును, కిట్టెలు మున్నగునవి వ్యాపారము చేయుటయును, బంధుకల్యాణవిభవమును, దేవతోత్సవదర్శనమును, ఋణధనప్రాప్తియును, సత్కథాశ్రవణమును, తన్వప్రసంగమును, పుణ్యప్రదేశసంచారమును, యోగిజనసందర్శనమును గల్గును. ఈసూర్యుఁడు ౬-౮-౧౨ స్థానములయందుఁగాని, నీచారిక్షేత్రములయందుఁగాని పాపగ్రహయుతుఁడైనను, పాపగ్రహములచేఁ జూడఁబడినను దశానాథునికి ౬-౮-౧౨ స్థానములయందుఁ బాపగ్రహయుక్తుఁడై యుండినను హృద్రోగము, మానభంగము, స్థానభ్రంశము, మనోవ్యాధి, స్వాధికారచలనము, ఋణధనపీడ, ఆత్మబంధుమరణము, పితృజనారిష్టము, బంధనము, రాజభయము, జ్వరాతిసారపీడ, వ్యాపారమునందుఁ గలహము గల్గును. ఈసూర్యుఁడు లగ్నమునకు ౨-౭ స్థానములయందుండినను, తదీశుఁడైనను పాపగ్రహయుతుఁడై యుండెనేని దేహజాడ్యాదులు గల్గును. తద్దోషపరిహారమునకు సూర్యనమస్కారమును స్వర్ణపద్మాశ్వప్రతిమాదానములు చేసినచో నాయురారోగ్యమును కార్యానుకూలమును గల్గును.

శనిదశాయాం చంద్రభుక్తిమాసాః ౧౯ తత్ఫలమ్.

శ్లో. మందస్యాంతర్గతే చంద్రే జీవదృష్టిసమన్వితే,
కేంద్రత్రికోణలాభస్థే స్వక్షేత్రే తుంగరాశిగే, 44
పూర్ణచంద్రే శుభాంశస్థే గృహే గోధనసంకులం,
రాజసమ్మానవిజయం కల్యాణం బంధుదర్శనమ్. 45
పితృమాతృసుఖంచైవ గ్రామభూసస్యలాభకృత్,
కళత్రగర్భహేతుస్స్యాదత్యంత సుఖదో భవేత్ 46
సౌభాగ్యం వాహనప్రాప్తిః రత్నభూషణలాభకృత్
క్షీణేవా పాపసంయుక్తే పాపదృష్టేతు నీచగే. 47
క్రూరాంశకగతేవాఽపి షష్ఠాష్టవ్యయగేఽపివా,
పితృమాతృవియోగశ్చ దారహానిర్ధనవ్యయమ్. 48
వ్యవసాయాత్ఫలం నష్టం మార్గే చోరభయం భవేత్
ఋణపీడా భవేన్నిత్యం బంధనం నృపపీడనమ్. 49
అష్టమద్యూననాథేతు ద్వితీయేస్యథ వాధ్యుది,
అపమృత్యుభయంచైవ వ్యాధిపీడా భవిష్యతి. 50
తద్దోషపరిహారార్థం దేవీ దుర్గాజపంచరేత్,

తా. శనిదశయందుఁ జంద్రభుక్తి ౧౯ మాసములు:— ఈచంద్రుఁడు లగ్నమునకు లాభస్వక్షేత్రోచ్చ కేంద్రత్రికోణములయందు గురువుతోఁ జేరియుండినను, జూడఁబడినను సంపూర్ణచంద్రుఁడై యుండినచో గృహమందు గోధనసంకులమును, రాజానుగ్రహముచేత గౌరవమును, కార్యజయంబును, కల్యాణాదిశుభవిభవమును, బంధుపూజ్యతయును, మాతాపితృసౌఖ్యమును, గ్రామభూసస్యధాన్యలాభమును, కళత్రగర్భోత్పత్తియును, సౌభాగ్యాదిసుఖంబును, వాహనప్రాప్తియును, రత్నభూషణలాభమును గలుగును. ఈచంద్రుఁడు క్షీణత్వముతోఁ బాపయుతుఁడై పాపవీక్షితుఁడై నీచక్రూరగ్రహరాసులయందు నుండెనేని షష్ఠాష్టవ్యయస్థానములయందు నుండెనేని మాతాపితృవర్గజనారిష్టమృతిశౌచములును, కళత్రారిష్టమును, ధనవ్యయమును, వ్యవసాయనష్టమును, మార్గమున చోరోపద్రవమును, ఋణధనపీడయును, బంధనదండనమును, రాజజనద్వేషమును గల్గును.

ఈచంద్రుఁడు లగ్నమునకు ద్వితీయద్యూనస్థానాధిపతియైనను ఆస్థానములనుండి మారకగ్రహములతోఁ గూడియుండినను జూడఁబడినను, అపమృత్యువ్యాధిపీడయును, కార్యభంగమును గల్గును. తద్దోషపరిహారమునకు దుర్గాజపమును స్వర్ణగోప్రతిమాదానమును జేయుటచేత నాయురారోగ్యమును కార్యజయమును గల్గును.

శనిదశాయాం కుజభుక్తిమాసాః ౧౩, దినాని ౯. తత్ఫలమ్.

శ్లో. మందస్యాంతర్గతే భౌమే స్వోచ్చ స్వక్షేత్రసంయుతే 51
మూలత్రికోణగేవాఽపి దుశ్చిక్యలాభగేఽపివా,
కేంద్రత్రికోణ మిత్రర్క్షే రాజసమ్మానవైభవమ్. 52
రాజ్యలాభం శత్రునాశం వ్యాపారాద్ధనసిద్ధిదం,
అశ్వగోధనలాభంచ భ్రాతృకల్యాణవైభవమ్. 53
వనకూపాదినిర్మాణం భూలాభం పుత్రవృద్ధిదం,
నూతనోద్యోగసంప్రాప్తిః వైద్యశాస్త్రప్రసంగకృత్. 54
రంధ్రారిరిష్ఫనీచస్థే పాపయుక్తే పశుక్షయం,
యత్నభంగం మనస్తాపం రాజద్వేషం మహద్భయమ్. 55
భ్రాతృనష్టం మనఃక్లేశం నృపచోరాగ్నిపీడనం,
జ్వరాతిసారరోగంచ ఋణబాధా భవిష్యతి. 56
ద్వితీయ సప్తమస్థేచ అపమృత్యుభయంభవేత్
తద్దోష పరిహారార్థం సుబ్రహ్మణ్య జపం చరేత్ 57
అనడ్వాహంప్రకుర్వీత సర్వాభీష్టనివారణమ్,

తా. శనిదశయందు నంగారకభుక్తి-౧౩ మాసములు, ౯ దినములు.—ఈయంగారకుఁడు స్వోచ్చస్వక్షేత్రమిత్రక్షేత్రమూలత్రికోణదుశ్చిక్యలాభకేంద్రత్రికోణ శుభస్థానములయందు దశానాథునితోఁ గూడియుండి శుభులచేఁ జూడఁబడినచో రాజసమ్మానవిభవమును, రాజ్యలాభమును, శత్రునాశమును, వ్యాపారమూలకధనాభివృద్ధియును, అశ్వశకటసంచారమును, గోధనాభివృద్ధియును, భ్రాతృకల్యాణసిద్ధియును, వనకూపగృహనిర్మాణమును, భూవిక్రయలాభమును, పుత్రోత్పత్తియును, నూతనోద్యోగవ్యాపారకార్యానుకూలమును, వైద్యజ్యోతిషగ్రంథవిచారమును, మనోధైర్యమును, పాకశాలకార్యములును గల్గును.

ఈయంగారకుఁడు లగ్నమునకు ౮-౧౨-౬ స్థానములయందును, నీచారి స్థానములయందును, పాపగ్రహయుతుఁడై యుండెనేని పశుధనవ్యయమును, ఋణధనపీడయును, మిత్రజనమనస్తాపమును, యత్నకార్యభంగమును, రాజద్వేషమును, భ్రాతృకలహమును, భ్రాతృజనారిష్టమును, మనఃక్లేశమును, రాజచోరాగ్నిశస్త్రవ్రణపీడయును, జ్వరాతిసారరోగమును, స్త్రీసంగమువ్యాధియు గల్గును. ఈయంగారకుఁడు ద్వితీయసప్తమస్థానములయందు నుండినను, తదీశులతోఁ జేరి మారకస్థానములయందు నుండినను, ఆరోగ్యమునకు నధిపతియైయుండినను అపమృత్యుదోషాది గండములు ప్రాప్తించును. అందులకు సుబ్రహ్మణ్యజపమును, స్వర్ణవృషభప్రతిమాదానమును జేయుటచేత నాయురారోగ్యమును, కార్యజయమును గల్గును.

శనిదశాయాం రాహుభుక్తిర్మాసాః ౩౪, దినాని ౬. తత్ఫలమ్

శ్లో. మందస్యాంతర్గతే రాహౌ కలహేన మనోవ్యథా 58
దేహపీడా మనస్తాపం పుత్రద్వేషం ధనక్షయం,
విదేశగమనంచైవ గృహక్షేత్రాది నాశనమ్. 59
రాజచోరాస్త్రపీడాచ మాత్రారిష్టం రిపుర్భయం,
నైరృత్యాం దక్షిణే భాగే ప్రయాణం కార్యనాశనమ్. 60
యంత్రసర్పాగ్నిమరణం చతుష్పాజ్జీవనాశనం,
పాపగ్రహసమాయుక్తే రాజదండాద్ధనక్షయః. 61
పంచమాధిపతైర్యుక్తే పుత్రద్వేషం మనోరుజం,
గురుణా సంయుతేదృష్టే తీర్థయాత్రా దిసంభవేత్ 62
మేషాదికన్యకా చైవ కుళీరవృషభేతథా,
మీనే కోదండసింహేషు అత్యంతసుఖదో భవేత్ 63
రాజసమ్మానవిభవం వాహనాంబరసౌఖ్యకృత్,
కేంద్రత్రికోణగే రాహౌ తదీశేన సమన్వితే. 64
యత్నకార్యానుకూలశ్చ వ్యాపారాద్ధనలాభకృత్
గృహే కల్యాణవిభవం వరభూషణసంగ్రహమ్. 65
శుభో రాజప్రసాదేన ఇష్టసిద్ధి ర్భవిష్యతి,
ద్వితీయ ద్యూనసంయుక్తే దేహజాడ్యాదిసంభవమ్. 66

మృత్యుంజయం ప్రకుర్వీత ఛాగదానం ప్రశస్యతే,
ఆయురారోగ్యమాప్నోతి సర్వసంపత్ప్రదాయకమ్. 67

తా. శనిదశయందు రాహుభుక్తి ౩౪ మాసములు, ౯ దినములు:—ఈరాహువు మనోవ్యథయును, కలహమును, దేహపీడయును, మనస్తాపమును, పుత్రద్వేషమును, ధనక్షయమును, పరదేశసంచారమును, బంధనమును, విషజంతూపద్రవమును, రాజచోరఖడ్గమంత్రతంత్రౌషధబాధయును, మాత్రారిష్ట కర్మహేతువును, శత్రుభయమును, నిరృతిదక్షిణదిశప్రయాణమును, ప్రయత్నకార్యవిఘ్నమును, యంత్రసాధనములచేతను విషసర్ప అగ్ని స్ఫోటక జ్వరాదులచేత మరణమును, చతుష్పాజ్జీవహానియును గలుగఁజేయును. మఱియు, నీరాహువు పాపగ్రహములతోఁ గూడినను, జూడఁబడినను రాజదండనముచే ధనక్షయమును, పంచమాధిపతితోఁ గూడినచోఁ బుత్రద్వేషమును, పుత్రశోకమును గల్గును. గురువుతోఁ గూడినచోఁ దీర్ఘయాత్రయును, దేవతోత్సవదర్శనమును గల్గును. ఈరాహువు మేషము, కన్య, కర్కాటకము, వృషభము, మీనము, ధనస్సు, సింహము ఈరాసులయందు శుభగ్రహయుతుఁడై యుండెనేని రాజబంధుమిత్రసన్మానమును, వాహనాంబరభూషణలాభమును, స్త్రీశయ్యాసుఖమును గల్గును. ఈరాహువు లగ్నమునకుఁ గేంద్రత్రికోణోచ్ఛస్థానములయందు శుభులతోఁగాని, ఆస్థానాధిపతులతోఁగాని గూడియుండినచోఁ బ్రయత్నకార్యానుకూలమును వ్యాపారధనలాభమును, కల్యాణాది శుభవైభవమును, మహారాజమిత్రత్వమును, మహారాజానుగ్రహముచేత నిష్టకార్యానుకూలమును గలుగును. ఈరాహువు లగ్నమునకు ౨-౭స్థానములయందు మారకగ్రహయుతుఁడై యుండినను, జూడఁబడినను దేహజాడ్యాదులు కల్గును. పరిహారము మృత్యుంజయ జపమును, స్వర్ణమేషప్రతిమాదానమును జేయుటచేత నాయురారోగ్యభాగ్యము గల్గును.

శనిదశాయాం గురుభుక్తిమాసాః ౩౦, దినాని ౧౨. తత్ఫలమ్.

శ్లో. మందస్యాంతర్గతే జీవే కేంద్రలాభ త్రికోణగే,
లగ్నాధిపేన సంయుక్తే స్వోచ్ఛ స్వక్షేత్ర సంయుతే. 68

సర్వకార్యార్థ సిద్ధిస్స్యాచ్ఛోభనం భవతిధ్రువం,
మిత్రప్రభుప్రసాదేన ధనవాహనభూషణమ్. 69
సమాన ప్రభుసమ్మానం విద్వజ్జనసమాగమం,
పుత్రకల్యాణవిభవం దేవతారాధనంభవేత్ 70
పశ్చిమాందిశమాశ్రిత్య బంధుదారార్థలాభకృత్
రత్నభూషణసంప్రాప్తిః వ్యాపారే సుఖదో భవేత్ 71
దాయేశాత్కేంద్రకోణేవా శుభగ్రహాయుతేఽపివా
కల్యాణోద్యోగసంప్రాప్తిః భూసస్యాభివృద్ధిదమ్. 72
బ్రహ్మప్రతిష్ఠాసిద్ధిశ్చ క్రతుకర్మఫలప్రదం,
దేవతాగురుభక్తిశ్చ వేదాంత శ్రవణాదికమ్. 73
లగ్నషష్ఠాష్టరాశిస్థే పాపగ్రహసమన్వితే,
నీచే శత్రురాశిస్థే రాజద్వేషం మనోరుజమ్. 74
వాహనాంబరనాశంచ ఋణద్రవ్యాది పీడనం,
విదేశగమనంచైవ కుక్షిరోగాదిసంభవమ్. 75
వ్యవహారేఽర్థనాశంచ దారపుత్రాదిపీడనం,
ద్వితీయద్యూనరాశిస్థే తదీశేన సమన్వితే. 76
కారాగృహప్రవేశంచ ఆత్మబంధువినాశనం,
దేహజాడ్యం పుత్రపీడా కార్యవిఘ్నం భవిష్యతి. 77
తద్దోషపరిహారార్థం శివసాహస్రకంజపేత్,
స్వర్ణదానంప్రకుర్వీత ఆరోగ్యం భవతిధ్రువమ్. 78

తా. శనిదశయందు గురుభుక్తి ౩౦ మాసములు, ౧౨ దినములు:—గురువు కేంద్రత్రికోణలాభస్థానములయందు శుభగ్రహయుతుఁడై యుండినను, స్వోచ్చస్వక్షేత్ర మూలత్రికోణములయందు లగ్నాధిపతితోఁ జేరియుండినను సర్వకార్యానుకూలమును, మిత్రప్రభువశాత్సుఖమును, ధనవాహనవస్త్రభూషణలాభమును, సమానప్రభుసమ్మానమును, విద్వజ్జనసమాగమమును, పుత్రకల్యాణవిభవమును, దేవతాగురుభక్తియును, పశ్చిమదిశప్రయాణముచేత బంధుకళత్రధనలాభమును, రత్నభూషణ, విక్రయలాభమును, వ్యాపారమునందు సుఖమును గల్గును. దశానాథునకు నీగురువు కేంద్రత్రికోణ

లాభములయందు శుభగ్రహయుతుఁడై యుండెనేని కల్యాణోద్యోగప్రాప్తియును, భూసస్యాభివృద్ధియును, బ్రహ్మప్రతిష్ఠ దేవప్రతిష్ఠాదియజ్ఞకార్యార్థసిద్ధియును, దేవతాగురుభక్తియును, వేదాంతగ్రంథశ్రవణమును గల్గును. ఈగురువు లగ్నమునకు షష్ఠాష్టవ్యయనీచశత్రుస్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండినచో రాజద్వేషమును, మనోవ్యాధియును, వాహనాంబరనాశమును, ఋణధనబాధయును, పరదేశసంచారమును, కుక్షిశూలాదిరోగమును, వ్యవహారమును, కళత్రపుత్రనాశమును గల్గును. లగ్నమునకు నీగురువు ద్వితీయసప్తమస్థానములయందుండినను, ఆస్థానములకు నధిపతియై యుండినను మారకగ్రహయుతుఁడై యుండినచో ఆత్మబంధుమరణమును, కారాగృహప్రవేశమును, దేహజాడ్యమును, పుత్రహానియును, కార్యవిఘ్నమునుగల్గును. తద్దోషపరిహారమునకు శివసహస్రనామపారాయణమును, స్వర్ణలింగప్రతిమాదానమును, యథావిధిగఁజేసినచో నాయురారోగ్యభాగ్యాదులును, కార్యానుకూలమును గల్గును.

ఇతి శనిదశాంతర్దశావిచారము సంపూర్ణము.

---

బుధదశాయాం బుధభుక్తిమాసాః ౨౮, దినాని ౨౭. తత్ఫలమ్.

శ్లో. సౌమ్యస్యాంతర్గతేసౌమ్యే లగ్నాత్కేంద్రత్రికోణగే.
స్వోచ్ఛ స్వక్షేత్ర మిత్రర్క్షే శుభాంశే శుభరాశిగే. 1
శుభగ్రహసమాయుక్తే ఆరోగ్యం పుత్రసంభవం,
వాణిజ్యం ధనలాభంచ విద్యాలాభం యశోధికమ్. 2
సంగీతవాద్యసద్గ్రంథశ్రవణానందదాయకం,
ముక్తావిద్రుమలాభశ్చ జ్ఞానకర్మాధికం సుఖమ్. 3
కల్యాణం బంధుసమ్మానం మాతాపితృసుఖావహం,
వ్యాపారోద్యోగసంప్రాప్తిః వ్యవహారార్థలాభకృత్ 4
షష్ఠాష్టమవ్యయేనీచే పాపయుక్తే పశుక్షయం,
ఆప్తమిత్ర విరోధశ్చ యత్న కార్యార్థనాశకృత్. 5
రాజద్వారే మహాద్వేషం కారాగృహప్రవేశకం,
ద్వితీయ ద్యూననాథేతు పాపగ్రహసమన్వితే. 6

ఆత్మసంబంధ మరణం వాతశూలాదిరోగకృత్,
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకంజపేత్ 7

తా. బుధదశయందు బుధభుక్తి ౨౮ మాసములు, ౨౭ దినములు:— ఈబుధుఁడు లగ్నమునకుఁ గేంద్రత్రికోణస్వక్షేత్రోచ్చమిత్రరాసులయందుగాని శుభాంశయందు శుభవర్గమందుగాని శుభగ్రహములతోఁ గూడినం జూడఁబడినను ఆరోగ్యమును, పుత్రజననమును, వాణిజ్యధనలాభమును,విద్యాభివృద్ధియును, సంగీతవాద్యసద్గ్రంథశ్రవణానందదాయకమును, రత్నభూషణలాభమును,జ్ఞానకర్మాధిక్యమును, కల్యాణాదిశుభవైభవమును, బంధుసమ్మానమును, మాతాపితృసౌఖ్యమును, వ్యాపారోద్యోగసంప్రాప్తియును, వ్యవహారమూలకధనలాభమును, తీర్థస్నానదేవతోత్సవదర్శనమును, ప్రయాణసిద్ధియును గల్గును. ఈబుధుఁడు షష్ఠాష్టవ్యయనీచపాపశత్రుక్షేత్రములయందుఁ బాపగ్రహములతోఁ గూడియుండినచో ధనధాన్యపశునాశమును, ఆప్తమిత్రజనద్వేషమును, ప్రయత్నకార్యార్థనాశమును, రాజద్వారమునందు వైరమును, కారాగృహప్రవేశమును గల్గును. ఈబుధుఁడు ద్వితీయ సప్తమస్థానములకు నధిపతియై యుండినను ఆస్థానములయందు మారకగ్రహయుతుఁడై యుండెనేని ఆత్మబంధుకళత్రజనారిష్టమును, వాతశూలశ్లేష్మవ్యాధిపీడయును గల్గును.అందులకు విష్ణుసహస్రనామపారాయణమును, స్వర్ణలక్ష్మీనారాయణప్రతిమాదానమును యామిళోక్తప్రకారము దానహోమతర్పణాదులు చేసినచో నాయురారోగ్య, భాగ్యములు గలుగును.

బుధదశాయాం కేతుభుక్తిమాసాః ౧౧, దినాని ౨౭. ఫలితమ్.

శ్లో. బుధస్యాంతర్గతే కేతౌ కేంద్రకోణోచ్చ సంయుతే,
లగ్నా దుపచయస్థానే లగ్నాధిప సమన్వితే. 8
శుభగ్రహసమాయుక్తే శుభాంశే శుభవర్గగే,
దేహారోగ్యం ధనప్రాప్తిం బంధుస్నేహసహాయకృత్ 9
చతుష్పాజ్జీవలాభంచ వ్యాపారోద్యోగసంభవం,
విద్యాకీర్తి ప్రసంగంచ సమానప్రభుదర్శనమ్. 10
కల్యాణాది శుభప్రాప్తిః రత్నభూషణలాభకృత్

షష్ఠాష్టమ వ్యయే నీచే పాపగ్రహసమన్వితే. 11
చోరాగ్నిరాజభీతిశ్చ పాపకర్మరతిస్తథా,
విధవా కలహంచైవ శోకరోగాది సంభవమ్. 12
రాజద్వేషం విషాద్భీతిః సంచారం భ్రమణం భవేత్,
కళత్ర పుత్ర పీడాచ ఋణబాధా భవిష్యతి. 13
ద్వితీయ సప్తమస్థానే దేహజాడ్యం ధనక్షయం,
తద్దోషపరిహారార్థం దేవీదుర్గాజపంచరేత్. 14
ఛాగదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్.

తా. బుధదశయందు కేతుభుక్తి ౧౧ మాసములు, ౨౭ దినములు:— ఈ కేతువు లగ్నమునకు కేంద్రత్రికోణోచ్చస్థానంబులయందు నుపచయస్థానంబులయందు శుభాంశశుభవర్గలయందు శుభగ్రహయుతుండై యుండెనేని దేహారోగ్యమును, ధనప్రాప్తియును, బంధుస్నేహజనులకు సహాయమును, చతుష్పాజ్జీవలాభమును, వ్యాపారోద్యోగసంప్రాప్తియును, విద్యాకీర్తియును, సమానప్రభుసమ్మానమును, కల్యాణాదిశుభప్రాప్తియును, రత్నభూషణవిక్రయలాభమును, సద్గ్రంథపఠనమును గలుగును. ఈ కేతువు ౬-౮-౧౨ స్థానములయందును నీచస్థానమునను పాపగ్రహయుతుండై యుండినచో చోరాగ్నిరాజభయమును, పాపకార్యప్రియమును, విధవస్త్రీకలహమును, శోకరోగమును, రాజజనద్వేషమును, విషజంతూపద్రవమును, విదేశగమనమును, సంచారమును, కళత్రపుత్రపీడయును, ఋణధనబాధయును గల్గును. ఈ కేతువు లగ్నమునకు ౨-౭ స్థానములయందు నుండెనేని దేహజాడ్యమును, ధనక్షయమును, కార్యవిఘ్నమును గల్గును. తద్దోషపరిహారమునకు దుర్గాజపమును, సువర్ణమేషప్రతిమాదానహోమాదులు చేసినచో నాయురారోగ్యమును, కార్యానుకూలమును గలుగును.

బుధదశాయాం శుక్రభుక్తిమాసాః ౩౪. తత్ఫలమ్.

శ్లో. సౌమ్యస్యాంతర్గతే శుక్రే కేంద్రలాభ త్రికోణగే. 15
స్వోచ్చే స్వక్షేత్ర సంయుక్తే తుంగాంశే స్వాంశగేఽపివా,
సత్కథాశ్రవణం పుణ్యం దానధర్మాదిసంగ్రహమ్. 16
మిత్రప్రభు వశాత్సౌఖ్యం భూలాభం ధాన్యసంగ్రహం,

ధర్మకర్మాధిపయుతే మహారాజాశ్రయం తథా. 17
వాపీకూపతటాకాది నూత్నమందిరనిర్మితం,
వ్యాపారే ధనలాభంచ స్వాధికారాభివృద్ధిదమ్. 18
వ్యవసాయాత్ఫలాధిక్యం రత్నభూషణసంగ్రహం,
వాహనం వరగోలాభం గృహేంకల్యాణవైభవమ్. 19
షష్ఠాష్టవ్యయగే నీచే పాపక్షేత్రసమన్వితే,
దాయేశాత్షష్ఠరంధ్రస్థే వ్యయేనీచారిరాశిగే. 20
హృద్రోగం మానహానిశ్చ సంచారం చిత్తవిభ్రమం,
ఆప్తబంధువియోగార్తిం అథవా మాతృనాశనమ్. 21
స్థానచ్యుతిం దారహాని ర్యశోవిఘ్నం నృపాద్భయం,
ఋణపీడాభవేనిత్యం వాహనాంబరనాశనమ్. 22
ద్వితీయ ద్యూననాథేతు అపమృత్యుభయం భవేత్,
తద్దోష పరిహారార్థం దుర్గాలక్ష్మీజపంచరేత్. 23

తా. బుధదశయందు శుక్రభుక్తి ౩౪ మాసములు:—ఈశుక్రుఁడు లగ్నమునకు ౧-౪-౫-౭-౯-౧౦-౧౧ స్థానములయందుఁగాని, స్వక్షేత్రోచ్చమూల త్రికోణస్థానములంగాని తుంగాంశస్వాంశలయందుఁగాని శుభగ్రహయుతుఁడై యుండెనేని సత్కథాశ్రవణమును, దానధర్మసంగ్రహమును, మిత్రప్రభువశాత్సౌఖ్యమును, భూలాభమును, ధాన్యసంగ్రహమును గల్గును. ఈశుక్రుఁడు ధర్మకర్మాధిపతులతోఁ జేరి కేంద్రత్రికోణములయందు బలియుఁడై యుండెనేని మహారాజాశ్రయమును, వాపీకూపతటాకగృహనిర్మాణములును, వ్యాపారమునందు ధనలాభమును, స్వాధికారాభివృద్ధియును, వ్యవసాయఫలాధిక్యమును, రత్నభూషణవాహనవస్త్రలాభమును, గృహమునఁ గల్యాణవైభవమును, గోలాభమును, స్త్రీశయ్యాభోగమును, పుత్రోత్పత్తియును గల్గును. ఈశుక్రుఁడు లగ్నమునకు షష్ఠాష్టవ్యయనీచశత్రురాసులయందుఁ బాపగ్రహములతోఁ గూడియుండినచో హృద్రోగమును, మానహానియును, చిత్తవైకల్యమును, సంచారమును, ఆప్తబంధువియోగదుఃఖమును, మాతృజనమృతాశౌచమును, స్థానభ్రంశమును, కళత్రకలహముగాని నష్టముగాని యగుటయును, కీర్తిహానియును, రాజదండనభయము

ను, ఋణధనపీడయును, వాహనాంబరభూషణవిక్రయమును గల్గును. ఈశుక్రుఁడు లగ్నమునకు ద్వితీయద్యూనస్థానముల కధిపతియై మారక గ్రహయుతుఁడై మారకస్థానములయందు నుండినచో నపమృత్యు వ్యాధి సంప్రాప్తమగును. తద్దోషపరిహారమునకు దుర్గా దేవీజపమును, స్వర్ణమహిషప్రతిమాదానమును, మృత్యుంజయ శ్లోకప్రకారము హోమతర్ప ణాదులతోఁ జేసినచో నాయురారోగ్యమును గార్యానుకూలమును గల్గును.

బుధదశాయాం సూర్యభుక్తిః మాసాః ౧౦, దినాని ౬, తత్ఫలమ్.

శ్లో. సౌమ్యస్యాంత ర్గతే సూర్యే స్వోచ్చే స్వక్షేత్రే కేంద్రగే,
శుభాంశే లాభతుంగాంశే శుభగ్రహసమన్వితే. 24
లగ్నాధిపేన సంయుక్తే భూలాభం గ్రామపాలనం,
వ్యాపారే ధనలాభంచ నృపసమ్మానమాప్నుయాత్ 25
పితృసౌఖ్యం శుభావాప్తిం భోజనాంబరలాభకృత్
షష్ఠాష్టమవ్యయే నీచే పాపగ్రహసమన్వితే. 26
చోరాగ్నివ్రణభీతిశ్చ పిత్తాధిక్యం మనోరుజం,
శత్రుజ్వరాదిపీడాచ ఆత్మబంధు వియోగకృత్ 27
రాజబాధారిపీడాచ విదేశగమనం భవేత్,
ద్వితీయ సప్తమాధీశే అపమృత్యు ర్భవిష్యతి. 28
తద్దోషపరిహారార్థం శాంతిం కుర్యా ద్యథావిధి,
సూర్యప్రీతికరంచైవ దద్యా ద్ధేనుం హిరణ్యకమ్. 29

తా. బుధదశయందు సూర్యభుక్తి ౧౦ మాసములు, ౬ దినములు:—ఈసూర్యుఁడు లగ్నమునకు లాభతుంగాంశశుభాంశశుభవర్గ ములయందుఁగాని, కేంద్రత్రికోణోచ్చస్వక్షేత్రములయందు లగ్నాధిపతి తోఁగూడియుండినంగాని, భూలాభమును, గ్రామాధికారమును, వ్యా పారమూలకధనలాభమును, రాజబంధుమిత్రజనసమ్మానమును, పితృ సౌఖ్యమును, కల్యాణాదిశుభములును, మృష్టాన్నభోజనమును, వాహ నఫలలాభమును, తత్త్వమార్గజ్ఞానమును, అరణ్యప్రదేశగ్రామనివాసము ను, మహాజనసంచారక్షేత్రసంచారమును గల్గును. ఈసూర్యుఁడు లగ్న మునకు షష్ఠాష్టవ్యయనీచశత్రుస్థానంబులయందుఁ బాపగ్రహయుతుఁ

డై యుండినచో రాజచోరాగ్ని వ్రణస్ఫోటక జ్వరశస్త్రఋణధనపీడలును, ఆత్మబంధుజనవియోగమును, విదేశగమనమును, పిత్రారిష్టమును గల్గును. ద్వితీయ ద్యూనములకు నీసూర్యుఁ డధిపతియై మారకగ్రహయుతుఁ డై యుండినను, మారకస్థానములయందు మారకత్వము నొందియుండినను, అపమృత్యుదోషము ప్రాప్తించును. తద్దోషపరిహారము సూర్యనమస్కారమును, గోదానహోమతర్పణాదులును జేసినచో నాయురారోగ్యము గల్గును.

బుధదశాయాం చంద్రభుక్తి మాసాః ౧౭. తత్ఫలమ్

శ్లో. సౌమ్యస్యాంతర్గతే చంద్రే లగ్నాత్కేంద్రత్రికోణగే,
స్వోచ్చే స్వక్షేత్ర సంయుక్తే గురుదృష్టి సమన్వితే. 30
యోగస్థానాధిపత్యేన యోగప్రాబల్య మాదిశేత్,
స్త్రీలాభం పుత్రలాభంచ భూషణాంబరలాభకృత్ 31
నూతనగృహనిర్మాణం నిత్యమృష్టాన్నభోజనం,
గీతవాద్యప్రసంగశ్చ శాస్త్రవిద్యాపరిశ్రమమ్. 32
దక్షిణాం దిశమాశ్రిత్య ప్రయాణం బంధుదర్శనం,
మనోధైర్యం మహోత్సాహం వస్త్రశయ్యాదిభోగకృత్. 33
కల్యాణం భూమిలాభంచ వ్యాపారాద్ధనసిద్ధికమ్
షష్ఠాష్టవ్యయనీచస్థే పాపగ్రహసమన్వితే. 34
స్థానచ్యుతిం బంధువైరం దారపుత్రవినాశనం,
భూధాన్యగృహనాశంచ రాజద్వేషం ధనక్షయమ్. 35
వాతశ్లేష్మాదిరోగంచ ఋణపీడా భవిష్యతి,
ద్వితీయ ద్యూననాథేవా దేహజాడ్యం మనోరుజమ్. 36
చోరాగ్ని నృపభీతిశ్చ దుస్త్రీసంగమసంభవేత్,
తద్దోషపరిహారార్థం దేవీదుర్గాజపం చరేత్. 37

తా. బుధదశయందుఁ జంద్రభుక్తి ౧౭ మాసములు:—ఈ చంద్రుఁడు, కేంద్రత్రికోణోచ్చస్వక్షేత్రమూలత్రికోణములయందు గురువుచేఁజూడఁబడి యోగస్థానాధిపత్యముతో నుండెనేని స్త్రీలాభమును, పుత్రవృద్ధియును, రత్నభూషణ విక్రయలాభమును, ముత్యములు, అభ్రకము మున్నగు వ్యాపారలాభమును, నూతనగృహ

నిర్యాణమును, సంగీతవాద్యశాస్త్రపరిశోధన ప్రసంగములును, దక్షిణదిశప్రయాణముచేత బంధుదర్శనమును, మనోధైర్యమును, స్వస్త్రీశయ్యాభోగమును, గృహమందు వివాహాది శుభవైభవమును, దేవతోత్సవదర్శనమును, భూసస్యాభివృద్ధియును, వ్యాపారమునందు లాభమును, బంధూపకారమును గల్గును. ఈచంద్రుఁడు షష్ఠాష్టవ్యయ నీచశత్రుపాపక్షేత్రములయందు క్షీణచంద్రుఁడై పాపగ్రహములతోఁగూడి యుండెనేని స్థానభ్రంశమును, బంధువైరమును, దారపుత్రపీడయును, భూధాన్య ధనవ్యయమును, రాజద్వేషమును, వ్యసనారిమును, వాతశ్లేష్మాది జాడ్యబాధయును, ఋణధనపీడయును, మానహానియును గల్గును. ఈచంద్రుఁడు ద్వితీయ సప్తమ స్థానములకు నధిపతియై యుండినను, ఆస్థానములయందు నుండి మారకగ్రహయుతుఁడై యుండెనేని చోరాగ్నిరాజభీతియును, దేహజాడ్యమును, దుస్త్రీసంగమపీడయుం గల్గును. తద్దోషపరిహారమునకు దుర్గాజపమును, రజతగోప్రతిమాదానము యథావిధిఁ జేసినచో, నాయురారోగ్యమును గల్గును.

బుధదశాయాం చంద్రభుక్తి మాసాః ౧౭, దినాని ౧౫. తత్ఫలమ్.

శ్లో. బుధస్యాంతర్గతే భానౌ లగ్నాత్కేంద్రత్రికోణగే,
స్వోచ్చస్వక్షేత్రసంయుక్తే దాయేశాత్కేంద్రసంయుతే. 38
శుభాంశే శుభసంయుక్తే శుభవర్గే శుభావహం,
రాజసమ్మానకీర్తించ భూలాభం సస్యవృద్ధిదమ్. 39
వాహనం గృహలాభంచ బంధుపూజ్యం ధనాగమం,
స్వాధికారాభివృద్ధిశ్చ రత్నభూషణ లాభకృత్. 40
షష్ఠాష్ట వ్యయ నీచస్థే పాపగ్రహసమన్వితే,
స్థానభ్రంశం సుహృద్భీతి ర్బంధునాశం ధనక్షయమ్. 41
ప్రయత్నకార్యవిఘ్నంచ అకస్మాత్కలహం భవేత్,
హృద్రోగం మానహానిశ్చ భ్రాతృనాశం మనోరుజమ్. 42
కారాగృహప్రవేశం చ శత్రుభీతి ర్ధనసంశయః
ద్వితీయ ద్యూననాథేతు అపమృత్యుభయం భవేత్. 43
తద్దోషపరిహారార్థం శివసాహస్రకం జపేత్,
గోభూ హిరణ్యదానేన సర్వారిష్టం వ్యపోహతు. 11

తా. బుధదశయందు నంగారకభుక్తి ౧౧ మాసములు, ౨౭ దినములు:— ఈయంగారకుఁడు కేంద్ర త్రికోణములయందుఁగాని, స్వోచ్చ స్వక్షేత్రములయందుఁగాని, దశానాథునకుఁ గేంద్ర త్రికోణ లాభస్థానములయందుఁగాని, శుభాంశ, శుభవర్గలయందుఁగాని, శుభగ్రహయుతుఁడై యుండెనేని, రాజసమ్మానమును, భూలాభమును, సస్యవృద్ధియును, వాహన గృహ శకట లాభమును, బంధుజనపూజ్యతయును, స్వాధికారాభివృద్ధిచేత ధనలాభమును, రత్నభూషణ వస్త్ర విక్రయలాభమును, దక్షిణదిశిప్రయాణముచేతఁ గార్యానుకూలమును, గృహమునఁ గల్యాణాదిశుభవైభవమును, పాకశాలనిర్మాణమును, భ్రాతృవర్గమున వివాహాదులును, పుత్రజననమును, మహాధైర్యమును, శత్రుజయమును, వ్యాపారమూలక ధనలాభమును గల్గును. ఈయంగారకుఁడు షష్ఠాష్ట వ్యయ నీచారిస్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండెనేని, స్థానభ్రంశమును, బంధునాశమును, ధనక్షయమును, ప్రయత్నకార్యవిఘ్నమును, అకస్మాత్కలహమును, హృద్రోగమును, మానహానియును, భ్రాతృనాశన కలహమును, కారాగృహప్రవేశమును, శత్రుభయమును గల్గును. ఈయంగారకుఁడు లగ్నమునకు, ౨-౭ ఇండ్లకు నధిపతియై మారకగ్రహములతోఁ జేరియుండెనేని అపమృత్యుదోషము గల్గును. పరిహారము శివసహస్రనామపారాయణమును, గోభూహిరణ్య దానములను జేసినచో శుభమగును.

బుధదశాయాం రాహుభుక్తి మాసాః ౩౦, దినాని ౧౮. తత్ఫలమ్.

శ్లో. బుధస్యాంతర్గతే రాహౌ కేంద్రలాభత్రికోణగే,
కుళీర సింహగేవాపి కన్యాయాం వృషభేఽపివా. 45
శుభాంశే శుభరాశిస్థే శుభగ్రహ సమన్వితే,
రాజానుగ్రహ శాంతిశ్చ గృహే కల్యాణసంభవమ్. 46
పుత్రోత్సవాది సంతోషం రాజప్రీతికరం భవేత్,
ఉద్యోగం,బంధుసమ్మానం వ్యాపారా ద్ధనలాభకృత్ 47
పుణ్యతీర్థాదిలాభంచ గురుదైవతదర్శనం,
ప్రయాణం మిత్రలాభంచ కార్యసిద్ధి ర్నసంశయః. 48
షష్ఠాష్టవ్యయగే నీచే పాపగ్రహసమన్వితే,

గ్రంధి శస్త్రవ్రణాదీని తాపజ్వర భయాదికమ్. 49
రాజద్వేషం బంధునాశం మానహాని ర్భవిష్యతి,
స్థానభ్రంశం చోరబాధా దారక్లేశం బుణాద్భయమ్. 50
మాతృనాశం బంధువైరం స్వాధికార వివర్జితం,
ద్వితీయ సప్తమస్థేచ అపమృత్యుభయంభవేత్. 51
అనడ్వాహం ప్రకుర్వీత మృత్యుంజయజపం చరేత్,

తా. బుధదశయందు రాహుభుక్తి 3౦ మాసములు, ౧౮ దినములు:—ఈరాహువు కేంద్ర త్రికోణ స్థానములయందుగాని, కర్కాటక సింహ కన్యా వృషభ రాసులయందుగాని, శుభాంశ శుభవర్గలయందుగాని శుభగ్రహయుతుఁడై యుండెనేని రాజానుగ్రహమును, గృహమందుఁ గల్యాణమును, పుత్రోత్సవమును, రాజప్రీతియును, ఉద్యోగసుఖంబును, బంధుసమ్మానమును, వ్యాపారమూలకధనలాభమును, పుణ్యతీర్థస్నానమును, గురుదేవతాదర్శనమును, దూరగ్రామ ప్రయాణమును, బంధుమిత్రదర్శనలాభమును, ప్రయత్నకార్యానుకూలమును గలుగును. ఈరాహువు షష్ఠాష్టవ్యయనీచారిస్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండినచో వ్రణగ్రంధి శస్త్రపీడయును, తాపజ్వరాతిసారపీడయును, రాజద్వేషమును, బంధుమిత్రజనారిష్టమును, మానహానియును, స్థానభ్రంశమును, చోరాగ్ని విషభీతియును, కళత్రక్లేశమును, బుణధనబాధయును, మాతృకర్మయును, స్వాధికారచలనమును, బంధుద్వేషమును గలుగును. ఈరాహువు లగ్నమునకు ద్వితీయ సప్తమస్థానములయందుఁ బాపగ్రహయుతుఁడైయుండెనేని అపమృత్యుదోషమును గలుగును. పరిహారము మృత్యుంజయజపమును, స్వర్ణవృషభప్రతిమాదానమును యథావిధిఁ జేసినచో నాయురారోగ్యభాగ్యమును కార్యానుకూలమును గల్గును.

బుధదశాయాం గురుభుక్తిమాసాః ౨౭, దినాని ౬. తత్ఫలమ్.

శ్లో. బుధస్యాంతర్గతేజీవే లగ్నాత్కేంద్ర త్రికోణగే. 52
తుంగస్వక్షేత్ర మిత్రస్థే స్వాంశే భాగ్యప సంయుతే,
దాయేశాత్కేంద్రకోణస్థే లాభేవా బలసంయుతే. 53
వివాహోత్సవకార్యాణి గోమహిష్యాదిలాభకృత్,

దేవతా గురుభక్తిశ్చ యజ్ఞకర్మాది సిద్ధిదమ్. 54
మహారాజాశ్రయోల్లాసం బంధుమిత్రసమాగమం,
నైరృత్యాం పశ్చిమే భాగే ప్రయాణం కార్యసిద్ధిదమ్. 55
పరోపకారసిద్ధిశ్చ ఋణద్రవ్యాదిలాభకృత్,
షష్ఠాష్టమవ్యయే నీచే పాపగ్రహసమన్వితే, 56
కళత్రబంధువైషమ్యం బంధనం రాజవిగ్రహం,
మానహాని ర్యశోహాని రాజదండా ద్ధనక్షయమ్. 57
విషాగ్నిజ్వరపీడా చ గోభూమి గృహవిక్రయం,
ఋణపీడాంగవైకల్యం మాతృకర్మాదిసిద్ధిదమ్. 58
ద్వితీయ ద్యూననాథేతు అపమృత్యు ర్భవిష్యతి,
తద్దోషపరిహారార్థం శివసాహస్రకం జపేత్. 59

తా. బుధదశయందు గురుభుక్తి ౨౭ మాసములు ౬ దినములు:—గురుడు కేంద్రత్రికోణస్వక్షేత్రోచ్చస్వాంశ మిత్రక్షేత్రములయందు ధనభాగ్యాధిపతులలో నొకనితోఁ జేరినను శుభాంశయందు భాగ్యాధిపతితోఁ జేరియుండినను దశానాథునకుఁ గేంద్రత్రికోణస్థానములయందు నుండినను లాభస్థానమునందు ధనాధిపతితోఁ జేరియుండినను వివాహకార్యమును గోమహిషలాభమును దేవతాగురుభక్తియును యజ్ఞకర్మాది సత్కార్యసిద్ధియును మాతాపితృసుఖంబును పుత్రవర్గకల్యాణాదులును మిత్రసమాగమమును మహారాజాశ్రయోల్లాసమును నిరృతితో పశ్చిమదిశ ప్రయాణముచేతఁ గార్యసిద్ధియును పరోపకారమును ఋణధనప్రాప్తియును గల్గును. గురుడు షష్ఠాష్టవ్యయ నీచారిస్థానములయందు పాపగ్రహయుక్తుఁడై యుండినచో కళత్రనాశమును బంధుద్వేషమును బంధనమును రాజవిగ్రహమును రాజదండనముచేత ధనక్షయమును విషాగ్నిజ్వరాదిపీడయును గోమహిషభూగృహనాశమును ఋణబాధపీడయును అంగవైకల్యమును మాతృకర్మయును గల్గును. గురుడు లగ్నమునకు ద్వితీయ సప్తమస్థానములయందు మారకగ్రహములతోఁ గూడియుండెనేని ఆస్థానములకు నధిపతియైయుండెనేని అపమృత్యుదోషము ప్రాప్తించును. అందులకు శివ

సహస్రనామపారాయణమును మహాకూశ్మాండదానమును జేయుటచేత నాయురారోగ్యము గల్గును.

బుధదశాయాం శనిభుక్తి మాసాః ౩౨, దినాని ౯. తత్ఫలమ్.

శ్లో. సౌమ్యస్యాంతర్గతేమందే స్వోచ్చస్వక్షేత్ర కేంద్రగే,
త్రికోణలాభగేవాపి శుభగ్రహసమన్వితే. 60
సేతుస్నానఫలావాప్తిః పుత్రోత్పత్తిర్నసంశయః,
రాజ్యలాభం మహోత్సాహం గృహే కల్యాణవర్ధనమ్. 61
వ్యాపారాద్ధనలాభంచ నీచవ్యాపారసిద్ధిదం,
భృత్యమూలాత్కార్యలాభం బంధుమిత్రసమాగమమ్. 62
పరోపకారం విజయం ధైర్యం గోధనసంకులం,
ప్రయాణం బంధుసమ్మానం రాజద్వారే శుభావహమ్. 63
షష్ఠాష్టవ్యయ నీచస్థే పాపగ్రహసమన్వితే,
కలహం దుఃఖబాహుళ్యం దారపుత్రాదిపీడనమ్. 64
బుద్ధిభ్రంశంచ కర్మనాశం విదేశగమనం భవేత్,
స్థానచ్యుతిం దేహజాడ్యం ఋణపీడార్థనాశనమ్. 65
కారాగృహనివాసంచ స్వజనే మృతిసంభవం,
ద్వితీయద్యూననాథేతు అపమృత్యుర్భవిష్యతి. 66
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపం చరేత్,
కృష్ణాంగాం మహిషీం దద్యాద్దానేనారోగ్య మాదిశేత్. 67

తా. బుధదశయందు శనిభుక్తి, ౩౨ మాసములు ౯ దినము లు:— శనైశ్చరుఁడు స్వోచ్చస్వక్షేత్ర కేంద్రత్రికోణ లాభస్థానములయందు శుభగ్రహయుతుఁడై యుండెనేని సేతుస్నానఫలమును, పుత్రజననమును, రాజ్యలాభమును, భూగృహధాన్యలాభమును, గృహమునఁ గల్యాణమును, వ్యాపారమూలకధనలాభమును, నీచజనస్నేహమును, నీచవస్తువ్యాపారమును, భృత్యజనమూలకకార్యానుకూలమును, బంధుమిత్రసమాగమమును, పరోపకారమును, మనోధైర్యమును, జయమును, రాజద్వారమునఁ గార్యసంసిద్ధియును గల్గును. ఈశని లగ్నమునకు షష్ఠాష్టవ్యయ నీచపాపక్షేత్రములయందుఁ బాపగ్రహ

యుతుఁడై యుండెనేని, కలహమును, దుఃఖమును, కళత్రపుత్రారిష్టమును, బుద్ధిభ్రంశమును, కర్మనాశమును, విదేశగమనమును, స్థానచ్యుతియును, దేహజాడ్యమునఋణధనబాధయును, కారాగృహప్రవేశాది దుష్టకష్టములును, ధనవ్యయమును, స్వజనులందు మరణమును గల్గును. ఈశని లగ్నమునకు ద్వితీయసప్తమస్థానముల నధిపతియై పాపగ్రహయుతుఁడై యుండినను, మారకగ్రహముతోఁగూడిమారకస్థానముననుండినను దేహజాడ్యాపమృత్యుదోషము గల్గును. తద్దోషపరిహారమునకు మృత్యుంజయజపమును, కపిలధేనుమహిషదానములును, హోమతర్పణాదులును యథావిధిఁ జేసినచో నాయురారోగ్యశుభములు గలుగును.

ఇట్లు బుధదశాంతర్దశావిచారము సంపూర్ణము.

కేతుదశాయాం కేతుస్వభుక్తి మాసాః ౪, దినాని ౨౭. తత్ఫలమ్.

శ్లో. కేతోరంతర్గతే కేతౌ కేంద్రలాభత్రికోణగే,
లగ్నాధిపసమాయుక్తే శుభవర్గే శుభాంశగే. 1
భాగ్యకర్మేశసంబంధే వాహనాధిపసంయుతే,
పుత్రదారాధిసౌఖ్యంచ విధవా సంగమం తథా. 2
గ్రామభూధాన్యలాభం చ వ్యాపారే ధనలాభకృత్,
అకాల భోజనంచైవ వ్యవహారే శుభావహమ్. 3
చిత్రాంబరాదిసంప్రాప్తిః మనోధైర్యం భవిష్యతి,
షష్ఠాష్టమ వ్యయే నీచే పాపగ్రహసమన్వితే. 4
నీచారికలహంచైవ హృద్రోగం కార్యనాశనం,
రాజద్వేషం మనోదుఃఖం రత్నభూషణ విక్రయమ్. 5
మానహాని ర్మతిభ్రంశం స్థాననాశం భవిష్యతి,
విషసర్పాది బాధాచ మంత్రతంత్రౌషధం భవేత్ 6
ద్వితీయ ద్యూనరాశిస్థేఽపమృత్యు ర్భవిష్యతి,
దేవీదుర్గాజపం కుర్యా త్సర్వసంపత్ప్రదాయకమ్. 7

తా. కేతుదశయందుఁ గేతుస్వభుక్తి ౪ మాసములు, ౨౭ దినములు:— ఈ కేతువు లగ్నమునకు నుపచయస్థానములయందు లగ్నాధి

పతితోనుండినను కేంద్రత్రికోణస్థానములయందు భాగ్యాధిపతితోను వాహనస్థానాధిపతితోను గూడియుండినను, శుభస్థానములయందు నుండినను, కళత్రపుత్రసౌఖ్యమును, విధవస్త్రీసంగమమును, విధవస్త్రీ ధనలాభమును, గ్రామభూధాన్య సంగ్రహమును, వ్యాపారమూలకధన లాభమును, అకాలభోజనమును, వ్యవహారజయమును, గృహమునఁ గల్యాణవిభవమును, చిత్రాభరణ విక్రయధనలాభమును, మనోధైర్యమును గలుగును. ఈ కేతువు లగ్నమునకు దుస్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండెనేని నీచశత్రుకలహమును, పితృనాశమును, హృద్రోగమును, కార్యవిఘ్నమును, రాజద్వేషమును, మనోదుఃఖమును, భూషణ ధనవ్యయమును, మానహానియు, మతిభ్రంశమును, స్థానచలనమును, విషసర్పజంతూపద్రవమును, మంత్రతంత్రౌషధ విచారమును గలుగును. ఈ కేతువు లగ్నమునకు ద్వితీయ సప్తమస్థానములయందు మారకగ్రహయుతుఁడై యుండెనేని అపమృత్యుపీడ గల్గును. పరిహారము దుర్గాజపహోమతర్పణాదులును, స్వర్ణలింగమహిష ప్రతిమాదానములును యథావిధిఁ జేసినచో నాయురారోగ్యము కల్గును.

కేతుదశాయాం శుక్రభుక్తిమాసాః ౧౪. తత్ఫలమ్.

శ్లో. కేతోశ్చాంతర్గతే శుక్రే కేంద్ర లాభ త్రికోణగే,
స్వోచ్చే స్వక్షేత్ర సంయుక్తే యోగకారకసంయుతే. 8
భాగ్యకర్మేశ సంయుక్తే పశులాభం మనస్సుఖం,
నష్టరాజ్యధనప్రాప్తిః దేవతారాధనం భవేత్. 9
మహారాజప్రసాదేన గ్రామభూమ్యాది లాభకృత్,
భోజనాంబరభూషాప్తిం గృహే కల్యాణసంభవమ్. 10
స్వస్త్రీశయ్యాది భోగంచ నటగాయకసంకులం,
వాహనం నృపసమ్మానం సౌభాగ్యంపుత్రసంభవమ్. 11
వ్యాపారాద్ధనలాభంచ ఘనగ్రామనివాసకృత్,
బంధుమిత్రవశాల్లాభం సత్కథా శ్రవణం భవేత్. 12
నీచారిరంధ్ర రిప్ఫస్థే పాపగ్రహసమన్వితే,
స్థాననాశం మనోదుఃఖం బంధుద్వేషం నృపాద్భయమ్. 13

ఋణపీడాభవేన్నిత్యం దారపుత్రాదిపీడనం,
రాజద్వారేమనస్తాపం మానహానిర్భవిష్యతి. 14
ద్వితీయ ద్యూన నాథేతు దేహజాడ్యం ధనక్షయం,
ఉన్నతాత్పతనంచైవ అపమృత్యుర్భవిష్యతి. 15
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీ జపంచరేత్,
శ్వేతాంగాం మహిషీం దద్యాదాయురారోగ్యసంభవమ్. 16

తా. కేతుదశయందు శుక్రభుక్తి ౧౮ మాసములు:— ఈ శుక్రుఁడు లగ్నమునకుఁ గేంద్రత్రికోణోచ్చ స్వక్షేత్ర స్వాంశలాభ "మూలత్రికోణస్థానములయందు యోగకారకునితోఁ గూడను ధర్మకర్మాధిపతులతోఁ గూడను జేరియుండినచో దశానాథునకుఁ గేంద్రత్రికోణోపచయస్థానములయందు శుభగ్రహయుతుఁడై యుండినచోఁ బహులాభమును, మనస్సంతోషమును, నష్టరాజ్యభూ ధనప్రాప్తియును, దేవతాదర్శనమును, మహారాజానుగ్రహముచేత గ్రామభూధాన్యలాభమును, రాజయోగాభివృద్ధియును, వస్త్రభూషణాదిక్షేత్రలాభమును, భోజనమును, గృహమందు వివాహాదిశుభవిభవమును, స్వస్త్రీశయ్యాభోగమును, సంగీతవాద్యశ్రవణానందమును, వాహనశకటయోగమును, రాజమిత్రబంధుసమ్మానమును, పుత్రోత్పత్తియును, వ్యాపారమూలకధనలాభమును, గ్రామపట్టణనివాసమును, బంధుమిత్రజనవశాత్కార్యజయలాభమును, సత్కథాశ్రవణమునుగల్గును. ఈశుక్రుఁడు దుస్థానములయందును, నీచాస్తంగతదోషాక్రాంతస్థానములయందును, పాపగ్రహయుతుఁడై యుండెనేని స్థాననాశమును, ఋణధనబాధయును బంధుద్వేషమును, స్వజనమృతాశౌచమును, రాజదండనభయమును, కళత్రపుత్రహానియును, రాజద్వారమున మనస్తాపమును, మానహానియును, ఉన్నతాత్పతనమును, వాతశ్లేష్మాదిరోగమును గలుగును. ఈశుక్రుఁడు ద్వితీయసప్తమస్థానముల కధిపతియైయుండినను, మారకగ్రహముతోఁ గూడి మారకస్థానముననుండిన నపమృత్యుదోషము గల్గును. తద్దోషపరిహారమునకు దుర్గాజపమును, శ్వేతగోమహిషములను దానము చేసినచో నాయురారోగ్యభాగ్యములు గలుగును.

కేతుదశాయాం సూర్యభుక్తిమాసాః ౪, దినాని ౬. తత్ఫలమ్.

శ్లో. కేతోరంతర్గతే సూర్యే స్వోచ్ఛస్వక్షేత్రమిత్రగే. 16
కేంద్రత్రికోణ లాభేవా శుభగ్రహ సమన్వితే,
ధనధాన్యాది లాభంచ రాజానుగ్రహవైభవమ్. 17
కల్యాణం పుత్రలాభంచ యత్నకార్యార్థ సిద్ధిదం,
సత్కథాశ్రవణంచైవ గ్రామసంచార మాప్నుయాత్ 18
షష్ఠాష్టవ్యయనీచస్థే పాపగ్రహసమన్వితే,
రాజమంత్రి విరోధశ్చ స్థాననాశం ధనక్షయమ్: 19
పితృమాతృ వియోగార్తిం శిరోరోగం భవిష్యతి,
ద్వితీయ ద్యూన నాథేతు అపమృత్యు భయం భవేత్ 20
తస్య శాంతిం ప్రకుర్వీత సూర్యమంత్ర జపం చరేత్,

తా. కేతుదశయందు సూర్యభుక్తి ౪ మాసములు, ౬ దినములు:— ఈసూర్యుఁడు లగ్నాత్కేంద్రత్రికోణస్థానములయందుఁగాని, సూర్యాత్త్రికోణలాభస్థానములయందుఁగాని, స్వక్షేత్రోచ్చమిత్రక్షేత్రములయందుఁగాని శుభగ్రహములతోఁ గూడియుండెనేని ధనధాన్య సంగ్రహమును, రాజమంత్రిప్రసాదముచేతఁ గార్యానుకూలమును, కల్యాణవైభవమును, పుత్రజననమును, తత్వగ్రంథపఠనశ్రవణానందమును, అరణ్యసమీపగ్రామసంచారమును, అరణ్యసంబంధోద్యోగమును, గోప్రచారస్నేహమును గల్గును. ఈసూర్యుఁడు షష్ఠాష్టవ్యయ నీచశత్రుస్థానములయందుఁ బాపగ్రహములతోఁ జేరి యుండెనేని రాజమంత్రి విరోధమును, స్థాననాశమును, ధనక్షయమును, మాతాపితృవియోగదుఃఖమును, శిరోకుక్షినేత్రబాధలును, జ్వరాతిసారపీడలునుగల్గును. ఈసూర్యుఁడు ద్వితీయసప్తమస్థానములకు నధిపతియై మారకగ్రహయుక్తుఁడై యుండినను మారకులతోఁ గూడి మారకస్థానములయందు నుండినను, అపమృత్యుబాధ గల్గును తద్దోషపరిహారము సూర్యనమస్కారమును స్వర్ణపద్మదానమును యథావిధిఁజేయుట పరమశ్రేయము.

కేతుదశాయాం చంద్రభుక్తిమాసాః 7. తత్ఫలమ్.

శ్లో. కేతో రంతర్గతే చంద్రే లగ్నా త్కేంద్ర త్రికోణగే. 21
లాభే కుటుంబరాశిస్థే స్వోచ్చస్వక్షేత్ర సంయుతే,
గురుణా సంయుతే దృష్టే శుభాంశే శుభవర్గగే. 22
కల్యాణాభరణప్రాప్తిః వాహనాంబరలాభకృత్
రాజప్రీతి ర్యశోవృద్ధి రర్థలాభం మహత్సుఖమ్. 23
దేవాలయతటాకాది పుణ్యకర్మాదిసంగ్రహం,
వ్యాపారాద్ధనలాభంచ కార్యసిద్ధిర్నసంశయః. 24
స్వస్త్రీశయ్యాది భోగంచ విధవా సంగమంభవేత్,
షష్ఠాష్టవ్యయ నీచస్థే క్షీణేవా పాపసంయుతే. 25
ఋణబాధా మానహాని ర్మతిభ్రంశం మహద్భయం,
దేహజాడ్యం మాతృనాశం వాహనాంబరవిక్రయః. 26
రాజస్థానే జనైర్వైరం బంధనం శత్రుపీడనం,
ద్వితీయ ద్యూన నాథేతు అపమృత్యు భయంభవేత్ 27
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీ జపంచరేత్,

తా. కేతుదశయందుఁ జంద్రభుక్తి 7 మాసములు:— ఈచంద్రుఁడు కేంద్ర త్రికోణోచ్చ స్వక్షేత్ర స్వాంశశుభవర్గమిత్రక్షేత్ర లాభధనస్థానములయందుఁ గురువుతోఁ గూడినంగాని చూడఁబడినంగాని యుండెనేని కల్యాణమును, ఆభరణప్రాప్తియును, వాహన వస్త్రలాభమును, రాజప్రీతియును, యశోవృద్ధియును, దేవాలయతటాకవన నిర్మాణాదిపుణ్యకర్మ సంగ్రహమును, వ్యాపారమూలకధనలాభమును, ప్రయత్నకార్యసిద్ధియును, స్వస్త్రీశయ్యాభోగమును, విధవస్త్రీసంగమంబును, సస్యాభివృద్ధియును గలుగును. ఈచంద్రుఁడు లగ్నమునకును,దశానాథునకును, షష్ఠాష్టవ్యయనీచారిరాసులయందుఁ బాపగ్రహ యుతుఁడై క్షీణచంద్రుఁడై యుండెనేని ఋణధనబాధయును, మానహానియును, మతిభ్రంశమును, దేహజాడ్యమును, మాతృనాశమును, వాహనాంబరగృహభూవిక్రయమును, రాజద్వేషమును, బంధనకష్టమును, శత్రుభయమును గలుగును. ఈచంద్రుఁడు ద్వితీయసప్తమస్థాన

ములకు నధిపతియై మారక గ్రహములతోఁగూడియుండినను, ఆస్థానము లయందు మారకులతోఁ గూడియుండినను అపమృత్యుదోషము గల్గును. అందులకుఁ బరిహారము దుర్గాజపమును రజతధేను ప్రతిమాదానమును జేయుటచేత శుభము.

కుదశాయాం కుజభుక్తిమాసాః-౫, దినాని ౨౭. తత్ఫలమ్.

శ్లో. కేతోరంతర్గతే భౌమే కేంద్ర కోణ సమన్వితే,
స్వోచ్ఛ స్వక్షేత్ర మిత్రర్క్షే శుభాంశే శుభవర్గగే, 28
భూలాభం గృహనిర్మాణం రాజానుగ్రహవైభవమ్.
భాగ్య కర్మేశ సంబంధే భ్రాతృమూలా ద్ధనాగమం, 29
రత్నభూషణ లాభంచ స్వాధికారాభివృద్ధిదమ్.
పుత్రలాభం మహోత్సాహం కల్యాణం బంధుదర్శనం, 30
రంధ్ర రిప్ఫ రిపుస్థానే నీచే వాఽ స్తంగతేఽపివా
పాపగ్రహసమాయుక్తే రాజచోరాగ్నిపీడనం, 31
ఋణపీడాభవేన్నిత్యం మూత్రకృచ్ఛ్రాదిరోగకృత్
రాజద్వేషం బంధునాశం భ్రాతృవర్గే జనక్షయం, 32
స్థానభ్రంశం మనోదుఃఖం యత్నకార్యార్థనాశనమ్
ద్వితీయ ద్యూనరాశిస్థే మారకగ్రహసంయుతే, 33
వ్రణతాపజ్వరాత్క్లేశం స్వస్త్రీనాశం భవిష్యతి.
అనడ్వాహం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకమ్, 34

తా. కేతుదశయందు అంగారకభుక్తి ౫ మాసములు, ౨౭ దినములు:—ఈయంగారకుఁడు కేంద్రత్రికోణమిత్రలాభస్వాంశ శుభవర్గ శుభాంశస్వోచ్ఛస్థానములయందు ధర్మకర్మాధిపతులతోఁ గూడినచో భూలాభమును, గృహనిర్మాణమును, రాజజనానుగ్రహ గౌరవమును, భ్రాతృమూలకధనప్రాప్తియును, రత్నభూషణలాభమును, స్వాధికారాభివృద్ధియును, పుత్రోత్సవమును, కల్యాణాది శుభవైభవమును, బంధుసమ్మానమును, పాకశాలావిచారమును గల్గును. ఈయంగారకుఁడు వ్యయాష్ట నీచరిపుస్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండెనేని రాజచోరాగ్ని స్ఫోటకక్షయాది వ్యాధిపీడయును, ఋణధనబాధయును, మూత్రవ్యాధియును, రాజద్వేషమును, బంధునాశమును,

భ్రాతృవర్గజనారిష్టమును, స్థానభ్రంశమును, ప్రయత్నకార్య భంగమును, మనోవ్యాధియును గల్గును. ఈయంగారకుడు ద్వితీయద్యూన స్థానాధిపతియైయుండినను ఆస్థానములయందు నుండినను మారక గ్రహయుతుడై యుండెనేని వ్రణతాపజ్వరపీడయును, కళత్రక్లేశమును గల్గును. పరిహారము సుబ్రహ్మణ్యజపమును, స్వర్ణవృషభప్రతిమాదానమును జేయుటచేత నాయురారోగ్యభాగ్యములు గలుగును.

కేతుదశాయాం రాహుభుక్తిమాసాః ౧౨, దినాని ౧౮. ఫలమ్.

శ్లో. కేతోరంతర్గతే రాహౌ కేంద్రలాభత్రికోణగే. 35
శుభగ్రహసమాయుక్తే నీచప్రభువశాత్సుఖం,
వ్యవహారార్థలాభంస్యా దన్యస్త్రీసంగమంతథా. 36
అపూర్వవస్తుసంప్రాప్తిః గ్రామభూమ్యాది లాభకృత్
గృహేకల్యాణవిభవం రత్నభూషణసంగ్రహమ్. 37
నృపమూలాత్కార్యసిద్ధి ర్వ్యాపారాద్ధనసిద్ధిదం,
ప్రయాణం మిత్రలాభంచ దేవతోత్సవదర్శనమ్. 38
రంధ్రేవా వ్యయగే రాహౌ పాపగ్రహసమన్వితే,
చాతుర్థిక జ్వరం చైవ రాజదండాద్ధనక్షయః. 39
దారాక్లేశం పుత్రనాశం స్థానభ్రంశ మనోవ్యథా,
ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు భయంభవేత్ 40
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీజపంచరేత్,

తా. ఈకేతుదశయందు రాహుభుక్తి ౧౨ మాసములు, ౧౮ దినములు:— ఈరాహువు కేంద్రలాభత్రికోణస్థానములయందు శుభాంశ శుభవర్గలయందు శుభగ్రహయుతుడై యుండెనేని నీచప్రభుమూలకధనలాభమును, నీచవ్యాపారధనలాభమును, వ్యవహారధనలాభమును, అన్యస్త్రీసంగమంబును, అపూర్వవస్తుసంప్రాప్తియును, గ్రామభూగృహలాభమును, గృహమందు కల్యాణవైభవమును, రత్నభూషణలాభమును, రాజజనమూలక కార్యానుకూలమును, వ్యాపారమూలకధనాభివృద్ధియును, ప్రయాణమును, మిత్రలాభమును, దేవతోత్సవదర్శనమును గల్గును. ఈరాహువు షష్ఠాష్టవ్యయ

నీచశత్రుస్థానములయందు మారకగ్రహయుతుండై యుండెనేని చాతుర్థికజ్వరాతిసారపీడయును, రాజదండనచేత ధనవ్యయమును, కళత్రపుత్రహానియును, స్థానభ్రంశమును, మనోవ్యధయును, అండవాయువును గల్గును. ద్వితీయ సప్తమ స్థానములయందు నీరాహువు మారకగ్రహయుతుండై యుండెనేని సర్పవిషపాండుబాధలు గల్గును. తద్దోష పరిహారమునకు దుర్గాజపహోమతర్పణాదులతో స్వర్ణనాగదానము చేసినచో నాయురారోగ్యము గల్గును.

కేతుదశాయాం గురుభుక్తిమాసాః ౧౧, దినాని ౬. ఫలమ్.

శ్లో. కేతో రంతర్గతే జీవే లగ్నాత్కేంద్రత్రికోణగే. 41
స్వోచ్చే స్వక్షేత్ర సంయుక్తే లగ్నాధిప సమన్వితే,
కర్మభాగ్యాధిప స్యుక్తే దాయేశాత్కేంద్ర కోణగే. 42
గృహేకల్యాణవిభవం పుత్రలాభం ధనాగమం,
రాజసల్లాప కార్యాణి నటగాయక సంకులమ్ 43
వాహనం భూమిలాభంచ గంధమాల్యాదిభూషణం,
దూరదేశప్రయాణంచ స్వబంధుజనపోషకమ్. 44
సత్కథాశ్రవణం స్నాన దేవతోత్సవ దర్శనం,
వ్యాపారోద్యోగలాభంచ శత్రునాశం భవిష్యతి. 45
షష్ఠాష్టవ్యయనీచస్థే పాపగ్రహ సమన్వితే,
స్థాననాశం నృపాద్భీతిః వ్యాపారాద్ధననాశనమ్. 46
మానహాని స్మృతిభ్రంశం కారాగృహప్రవేశనం,
పిత్రారిష్టం కార్యవిఘ్నం గృహభూషణ విక్రయమ్. 47
వాతశ్లేష్మాది రోగార్తిం పుత్రనాశం భవిష్యతి,
ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి. 48
తద్దోష పరిహారార్థం శివసాహస్రకం జపేత్,

తా. కేతుదశయందు గురుభుక్తి ౧౧ మాసములు, ౬ దినములు:—గురువు కేంద్రత్రికోణలాభస్థానములయందును స్వోచ్చస్వక్షేత్రములయందును లగ్నాధిపతితోను, ధర్మకర్మాధిపతితోను, ధర్మకర్మాధిపతులతో గాని గూడియుండినను దశానాథునకు కేంద్రత్రికోణ

ములయందుఁగాని శుభులతోఁ గూడియుండినచో గృహమందు కల్యాణాదివైభవమును, పుత్త్రలాభమును, రాజజనసల్లాపమును, సంగీత సత్కథాశ్రవణమును, వాహనసంచారమును, భూగృహలాభమును, గంధమాల్యభూషణలాభమును, దూరదేశప్రయాణమును, స్వబంధుజనపోషణమును, దేవతోత్సవదర్శనమును, వ్యాపారోద్యోగలాభమును, శత్త్రునాశమును గల్గును. ఈగురువు షష్ఠాష్టవ్యయనీచాస్తరాసులయందుఁ బాపగ్రహయుతుఁడై యుండెనేని స్థాననాశమును, రాజభయమును, వ్యాపారమూలకధనలాభనష్టమును మానహానియును, మతిభ్రంశమును, కారాగృహప్రవేశమును, పిత్రారిష్టమును, కార్యవిఘ్నమును, గృహభూషణవిక్రయనష్టమును, వాతశ్లేష్మాదిరోగపీడయును, పుత్త్రహానియును గలుగును. ఈగురువు ద్వితీయసప్తమస్థానములకు నధిపతియై మారకగ్రహయుతుఁడై మారకస్థానములయందునుండెనేని అపమృత్యుదోషము గలుగును. అందుకు శివసహస్రనామపారాయణమును, మహాకూశ్మాండదానమును యథావిధిఁజేసిన నాయురారోగ్యము గల్గును.

కేతుదశాయాం శనిభుక్తిర్మాసాః ౧3, దినాని ౯ తత్ఫలమ్.

శ్లో. కేతోరంతర్గతే మందే కేంద్రలాభత్రికోణగే. 49
శుభాంశే శుభసంయుక్తే స్వోచ్ఛ స్వక్షేత్ర సంయుతే,
వస్త్రాభరణలాభంచ సర్వకార్యార్థసిద్ధిదమ్. 50
కల్యాణం బంధుసమ్మానం వ్యాపారే ధనలాభకృత్,
స్వాధికారాభివృద్ధిశ్చ నీచప్రభువశాత్సుఖమ్. 51
పుణ్యతీర్థ ఫలావాప్తిః పుత్రోత్పత్తిర్నసంశయః,
షష్ఠాష్టవ్యయనీచస్థే పాపగ్రహసమన్వితే. 52
స్థానచ్యుతిం బంధునాశం రాజమూలాద్ధనక్షయం,
మాతృపీడా మృతిర్భీతిర్మతిభ్రంశం సుతక్షయమ్. 53
అన్యగృహనివాసంచ చోరాగ్నివ్రణపీడనం,
బంధనం మానహానిశ్చ కార్యవిఘ్నం మనోరుజమ్. 54
నీచస్త్రీసంగమంచైవ నీచకర్మరతోభవేత్,

ద్వితీయ ద్యూననాథేతు అపమృత్యుభయంభవేత్ 55
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపంచరేత్,
కృష్ణాంగాం మహిషీం దద్యా ద్దానేనారోగ్య మాదిశేత్. 56

తా. కేతుదశయందు శనిభుక్తి ౧౩ మాసములు, ౯ దినములు:—ఈశనైశ్చరుఁడు కేంద్రత్రికోణలాభస్థానములయందు శుభాంశ శుభవర్గులయందు స్వక్షేత్రోచ్చమిత్రక్షేత్రములయందు శుభగ్రహయుతుఁడై యుండినచో వస్త్రాభరణలాభమును, సర్వకార్యానుకూలమును, కల్యాణాదిశుభవిభవమును,బంధుసమ్మానమును, నీచవస్తువ్యాపారముచేత ధనలాభమును, స్వాధికారాభివృద్ధియును, నీచజనవశాత్కార్యానుకూలమును,పుణ్యతీర్థఫలప్రాప్తియును, పుత్రోత్పత్తియును గల్గును. ఈశని లగ్నమునకును, దశానాథునకును, షష్ఠాష్టవ్యయనీచపాపక్షేత్రములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండెనేని స్థానభ్రంశమును, బంధునాశమును, రాజవ్యసహారాదులచేత ధనవ్యయమును, మాతాపితృజనారిష్టమును, మరణభయమును, మతిభ్రంశమును, పుత్రశోకమును, అన్యగృహనివాసమును,చోరాగ్నివ్రణస్ఫోటకజ్వరాది బాధయును, బంధనమును, మానహానియు, కార్యవిఘ్నమును, మనోవ్యధయును, నీచస్త్రీసంగమమును, నీచకర్మప్రియమును గల్గును. ఈశనైశ్చరుఁడు లగ్నమునకు ద్వితీయ సప్తమస్థానములకు నధిపతియై మారకగ్రహయుతుఁడై యుండినను ఆమారకస్థానములయందు మారకగ్రహముతోఁ గూడియుండినను, అపమృత్యుగండము ప్రాప్తించును. అందులకుఁ బరిహారము మృత్యుంజయజపమును, తిలహోమమును, నల్లనియావును, మహిషదానమును యామిళోక్తప్రకారము చేసినచో నాయురారోగ్యమును, కార్యానుకూలమును కలుగును.

కేతుదశాయాం బుధభుక్తిమాసాః ౧౧, దినాని ౨౭. తత్ఫలమ్.

శ్లో. కేతోరంతర్గతేసౌమ్యే లగ్నాత్కేంద్రత్రికోణగే,
స్వోచ్చస్వక్షేత్రసంయుక్తే దాయేశా త్కేంద్రకోణగే. 57
శుభగ్రహయుతేవాఽపి భూలాభం భాగ్యవృద్ధిదం,
సత్కథాశ్రవణానందం వివాహం ధర్మసంగ్రహమ్. 58

భాగ్యకర్మాధిపైర్యుక్తే వ్యాపారోద్యోగసిద్ధిదం,
అయత్న కార్యసిద్ధిశ్చ పుత్రోత్పత్తిర్మహత్సుఖమ్. 59
పుత్రకల్యాణవిభవం వస్త్రాభరణలాభకృత్,
వ్యవసాయాత్ఫలాధిక్యం రాజద్వారే శుభావహమ్. 60
విద్వద్గోష్ఠీకలాపేన సంతోషం గ్రంథశోధనం,
పశువాహనధాన్యాది సిద్ధిదం దేవదర్శనమ్. 61
షష్ఠాష్టవ్యయనీచస్థే పాపగ్రహ సమన్వితే,
దారక్లేశం రాజభీతిర్మతిభ్రంశం ధనక్షయమ్. 62
వాతశ్లేష్మాదిరోగంచ వ్యాపారే కలహం భవేత్
అన్యస్థలనివాసంచ ఋణపీడా భవిష్యతి. 63
ద్వితీయ ద్యూనరాశిస్థే కారాగృహప్రవేశనం,
దేహపీడా కార్యహాని ర్యశోహానిర్భవిష్యతి. 64
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్,

తా. కేతుదశయందు బుధభుక్తి ౧౧, మాసములు, ౨౭ దినములు:—ఈబుధుఁడు కేంద్రత్రికోణోచ్చస్వక్షేత్రమిత్రక్షేత్రములయందును, దశానాథునకుఁ గేంద్రత్రికోణములయందును శుభగ్రహయుతుఁడై యుండినచో భూలాభమును, భాగ్యవృద్ధియును, సత్కథాశ్రవణమును, వివాహమును, ధర్మకార్యసిద్ధియును, ఈబుధుఁడు ధర్మకర్మాధిపతులతోఁ జేరి యుండెనేని వ్యాపారోద్యోగసిద్ధియును, అప్రయత్నకార్యానుకూలమును, పుత్రోత్పత్తియును, పుత్రకల్యాణవిభవమును, వ్యవసాయవృద్ధియును, రాజద్వారమున ననుకూలమును, విద్వజ్జనసమూహమునందుఁ జేరి సంతోషముతో నుండుటయును, సద్గ్రంథశోధనయును, పశువాహనలాభమును, ధాన్యసంగ్రహమును, దేవదర్శనమును గలుగును. ఈబుధుఁడు షష్ఠాష్టవ్యయనీచశత్రుస్థానములయందు పాపగ్రహములతోఁ జేరియుండినచో దారక్లేశమును, రాజభయమును,మతిభ్రంశమును,ధనక్షయమును, వాతశ్లేష్మాదిరోగములును, వ్యాపారమునందుఁ గలహమును,అన్యస్థలనివాసమును,ఋణధనపీడయును, రాజదండనయు నగును.ఈబుధుఁడు ద్వితీయసప్తమస్థానములకు నధిపతియై యుండినను, ఆస్థానములయందు పాపగ్రహయుతుఁడై యుండినను,

జాడ్యమును, కారాగృహప్రవేశమును, కార్యభంగమును, కీర్తివిఘ్నమును గలుగును. పరిహారము విష్ణుసహస్రనామపారాయణమును,స్వర్ణలక్ష్మీనారాయణప్రతిమాదానహోమతర్పణాదులు యథావిధిఁ జేసినచో నాయురారోగ్యభాగ్యము గల్గును.

ఇట్లు కేతుదశాంతర్దశావిచారము సంపూర్ణము.

శుక్రదశాయాం శుక్రస్వభుక్తిమాసాః, ౪౦. తత్ఫలమ్.

శ్లో. శుక్రస్యాంతర్గతే శుక్రే కేంద్రకోణసమన్వితే,
స్వోచ్చే స్వక్షేత్రే మిత్రర్క్షే స్వాంశే శుభసమన్వితే. 1
యానవాహనసంప్రాప్తి పురగ్రామాధిపత్యతాం,
గృహేకల్యాణసంప్రాప్తి మిష్టబంధువశాత్సుఖమ్. 2
అఖండలక్ష్మీసామ్రాజ్యం రాజసమ్మాన మేవచ,
మృదంగవాద్యఘోషైశ్చ రాజానుగ్రహశాంతికమ్. 3
స్వస్త్రీశయ్యాదిభోగం చ పుత్రోత్పత్తి ర్నసంశయః,
వ్యాపారోద్యోగసంప్రాప్తి ర్యశోవృద్ధి ర్ధనాగమమ్. 4
సత్కర్మసిద్ధిభూలాభం గృహనిర్మాణ మాప్నుయాత్,
రత్నభూషణవస్త్రాదిలాభం కార్యజయం భవేత్ 5
రాజతుల్యసుహాయోగం అన్యస్త్రీభోగసంభవం,
ధర్మకర్మపసంయుక్తే రాజయోగం భవిష్యతి. 6
షష్ఠాష్టవ్యయ నీచస్థే పాప మూఢారి రాశిగే,
అస్తబంధుజనక్లేశం మాతృనాశం మనోరుజమ్. 7
కలహోధననాశశ్చ ఋణపీడా గృహనాశనం,
కళత్రగర్భనాశంచ బంధనం మానహానికృత్ 8
ప్రయత్నకార్యవిఘ్నంచ జ్ఞాతిజనమృతిర్భవేత్
ద్వితీయ ద్యూననాథేతు అపమృత్యుభయాధికమ్. 9
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీజపం చరేత్,

తా. శుక్రదశయందు శుక్రస్వభుక్తి ౪౦ మాసములు:—ఈ శుక్రుఁడు లగ్నమునకు ౧-౪-౫-౭-౧౦-౯ స్థానములయందును, స్వక్షేత్రోచ్చమిత్రక్షేత్రస్వాంశలయందును శుభగ్రహయుతుఁడై యుండెనేని ధర్మకర్మాధిపతులతోఁ జేరియుండెనేని యానవాహనసంచారప్రాప్తియును, పురగ్రామాధిపత్యమును, గృహమందుఁ గల్యాణాదివైభవమును, ఇష్టబంధుమిత్రసల్లాపమును, సంపూర్ణలక్ష్మీకటాక్షవైభవకీర్తియును, రాజసమ్మానమును, సంగీతనృత్యసంగవాద్యఘోషమును, రాజానుగ్రహమును, స్వస్త్రీశయ్యాభోగమును, పుత్రోత్పత్తియును, వ్యాపారోద్యోగసంప్రాప్తియును, ధనధాన్యసంగ్రహమును, సత్కర్మసిద్ధియును, భూలాభమును, గృహనిర్మాణమును, రత్నభూషణవస్త్రాదిద్రవ్యపూర్వవస్తులాభమును, రాజతుల్యయోగమును, అన్యస్త్రీసంభోగమును, రాజయోగప్రాబల్యమును, పరోపకారమును గల్గును. ఈశుక్రుఁడు లగ్నమునకు ౬-౮-౧౨ స్థానములయందును, నీచాస్తంగతశత్రుస్థానములయందును, పాపగ్రహయుతుఁడై యుండెనేని, అష్టబంధుజనదుఃఖమును, మాతృనాశమును, మనోవ్యాధియును, అకస్మాత్కలహమును, ధనవ్యయమును, ఋణధనబాధయును, గృహభూపశునష్టమును, కళత్రగర్భహానియును, బంధన మానహానియును, ప్రయత్నకార్యవిఘ్నమును, దాయాదిజనమృతియును, అన్యస్థలనివాసమును, రాజజనద్వేషమును, దేహజాడ్యము, ఉన్నతాత్పతనకష్టమును, బంధుమిత్రవిరోధమును, మనశ్చింతయును, వాహననాశమును, జలగండమును గలుగును. ఈశుక్రుఁడు లగ్నమునకు ద్వితీయ సప్తమ స్థానములకు నధిపతియై పాపగ్రహయుతుఁడై యుండెనేని దేహజాడ్యాద్యపమృత్యుగండము గలుగును. తద్దోషశాంతికి, మంత్రయామిళోక్తప్రకారము దుర్గాజపహోమస్వర్ణమహిషప్రతిమాదానములు చేసినచో నాయురారోగ్యభాగ్యము గలుగును.

శుక్రదశాయాం సూర్యభుక్తి మాసాః, ౧౨. తత్ఫలమ్.

శ్లో. శుక్రస్యాంతర్గతే సూర్యే లగ్నాత్కేంద్రత్రికోణగే. 10
శుభగ్రహసమాయుక్తే ధనవాహనపైర్యుతే,
దాయేశాత్కేంద్రకోణస్థే తుంగస్వాంశ సమన్వితే. 11

భ్రాతృలాభం పుత్రలాభం భూధాన్య ధనసంగ్రహం,
శత్రునాశం రోగహాని ర్యశోవృద్ధి స్సుఖాధికమ్. 12
సద్గ్రంథపఠనం చైవ కల్యాణం బంధుపూజితమ్,
వాహనాంబరలాభం చ యోగిజనసమాగమః. 13
అరణ్య గ్రామవాసంచ తీర్థయాత్రాది సంభవః,
షష్ఠాష్టవ్యయ నీచస్థే పాపగ్రహసమన్వితే. 14
బంధనం స్థాననాశంచ సంతాపం రాజవిగ్రహం,
పితృమాతృవియోగం చ ఋణార్థ పరిపీడనమ్. 15
వ్రణచోరాగ్ని బాధాచ చిత్తవైకల్య మాదిశేత్,
ద్వితీయ ద్యూననాథేతు దేహజాడ్యం భవిష్యతి. 16
తద్దోషపరిహారార్థం సూర్యప్రీతించ కారయేత్,

తా. శుక్రదశయందు సూర్యభుక్తి ౧౨ మాసములు:— ఈ సూర్యుఁడు లగ్నమునకు ౧-४-౩-౭-౯-౫-౧౦ స్థానములయందును స్వాంశశుభస్వోచ్చస్థానములయందును లగ్నాధిపతితోఁ జేరియుండినను ధనవాహనస్థానాధిపతులతోఁ జేరియుండినను దశానాథునకుఁ గేంద్ర త్రికోణస్థానములయందు నుండినను, భ్రాతృలాభమును, పుత్రలాభమును, భూధాన్యధనసంగ్రహమును, శత్రునాశమును, రోగపరిహారమును, యశోవృద్ధియును, వ్యాపారోద్యోగమూలకధనలాభమును, వస్త్రభూషణాంబరలాభమును, సద్గ్రంథపఠనమును, కల్యాణాదివిభవమును, బంధుమిత్రజనసమ్మానమును, గురుయోగి జనసందర్శనపుణ్యమును, తీర్థయాత్రదేవతోత్సవదర్శనమును, అరణ్యగ్రామనివాసాదులును, ఉష్ణపిత్తపదార్థభోజనమును గల్గును. ఈసూర్యుఁడు షష్ఠాష్టవ్యయనీచాస్తంగతశత్రుస్థానములయందు మారకగ్రహయుతుఁడై యుండినను, దశానాథునకు షష్ఠాష్టవ్యయస్థానములయందు నుండినను, బంధనమును, స్థాననాశమును, రాజవిగ్రహమును, మాతాపితృజనవియోగమును, ఋణధనబాధయును, వ్రణచోరాగ్నిబాధయును, చిత్తవైకల్యమును గల్గును. ఈసూర్యుఁడు ద్వితీయ సప్తమ స్థానములకు నధిపతియై మారకగ్రహయుతుఁడై యుండెనేని దేహజాడ్యము గల్గును.

అందులకు సూర్యనమస్కార మరుణప్రకారముచేసినచో నాయురా రోగ్యభాగ్యము గలుగును.

శుక్రదశాయాం చంద్రభుక్తిమాసాః, ౨౦. తత్ఫలమ్.

శ్లో. శుక్రస్యాంతర్గతే చంద్రే లగ్నాత్కేంద్రత్రికోణగే 7
స్వోచ్చ స్వక్షేత్రమిత్రర్క్షే భాగ్యకర్మేశసంయుతే,
శుభయుక్తేపూర్ణచంద్రే గురుణా సంయుతేక్షితే. 18
మహానదీస్నానపుణ్యం దేవబ్రాహ్మణదర్శనం,
మహారాజప్రసాదేన వాహనాంబరలాభకృత్ 19
గీతవాద్యప్రసంగాది విద్వజ్జన సమాగమం,
వస్త్రభూషణసంప్రాప్తిః స్వస్త్రీసౌఖ్యం ధనాగమమ్. 20
ధాన్య భూపశులాభంచ దివ్యమందిరనిర్మితం,
వ్యాపారోద్యోగమూలేన కార్యసిద్ధిర్మహత్సుఖమ్. 21
నీచే వాస్తంగతే వాపి షష్ఠాష్టవ్యయరాశిగే,
ధననాశంస్థాననాశం రాజద్వేషం మనోరుజమ్. 22
విదేశగమనంచైవ దారపుత్రాదిపీడనం,
ఆప్తబంధువిరోధశ్చ స్వజనే మృత్యుసంభవమ్. 23
దేహజాడ్యం భృత్యకలహం ఋణపీడా భవిష్యతి,
ద్వితీయ ద్యూననాథేతు దేహజాడ్యం భవిష్యతి. 24
తద్దోష పరిహారార్థం దేవీదుర్గాజపం చరేత్,

తా. శుక్రదశయందుఁ జంద్రభుక్తి ౨౦ మాసములు:—ఈచంద్రుఁడు కేంద్ర త్రికోణ లాభ స్వోచ్చ మిత్రక్షేత్ర శుభాంశ శుభవర్గల యందు శుభగ్రహయుతుఁడై భాగ్యకర్మాధిపతులతోఁగాని గురువుతో గాని గూడి సంపూర్ణుఁడై యుండినచో, మహానదీస్నానమును, దేవబ్రాహ్మణదర్శనమును, మహారాజానుగ్రహముచేత, వాహనాంబర లాభమును,సంగీతవాద్యసంతోషమును, తటాకారామ గృహనిర్మాణమును, గృహమందుఁ గల్యాణవిభవమును, విద్వజ్జనసమాగమంబును, నూతన వస్త్రభూషణ లాభమును, స్వస్త్రీసౌఖ్యమును, ధాన్యధనభూపశులాభమును, వ్యాపారోద్యోగమూలక కార్యానుకూలమును, ఈచంద్రుఁడు

నీచాస్తంగతుఁడైనను, షష్ఠాష్ట వ్యయ పాపస్థానములయందు నుండినచో ధననాశమును, రాజద్వేషమును, విదేశగమనమును, దారపుత్రాదిపీడయును, ఆప్తబంధువిరోధమును, స్వజనమరణమును, దేహజాడ్యమును, భృత్యకలహమును, ఋణధనబాధయును గల్గును. ఈచంద్రుఁడు ద్వితీయ సప్తమస్థానములకు నధిపతియై మారకగ్రహయుతుఁడై యుండినచో రాజయక్ష్మాది దేహజాడ్యములు గల్గును. తద్దోషపరిహారము దుర్గాజపమును శ్వేతగోదానమును జేయుటచేత నాయురారోగ్యము గల్గును.

శుక్రదశాయాం కుజభుక్తిమాసాః, ౧౪. తత్ఫలమ్.

శ్లో. శుక్రస్యాంతర్గతే భౌమే కేంద్ర కోణ సమన్వితే. 25
స్వోచ్ఛస్వక్షేత్ర మిత్రర్క్షే లగ్నాధిపసమన్వితే,
లాభే శుభ రాశిస్థే దాయేశా త్కేంద్రకోణగే. 26
కర్మభాగ్యప సంయుక్తే తుంగాంశే శుభవర్గగే,
పుత్రోత్సవం భూమిలాభం గృహే కల్యాణసిద్ధిదమ్. 27
రత్నభూషణలాభం చ వ్యాపారే ధనలాభకృత్,
రాజపూజ్యం దేహకాంతిం సౌభాగ్యం శత్రునాశనమ్. 28
భ్రాతృవర్గే శుభంచైవ వ్యవసాయా త్ఫలాధికం,
షష్ఠాష్ట వ్యయగే నీచే పాపక్షేత్ర సమన్వితే. 29
రాజద్వేషం కార్యనాశం మానహాని ర్మతిభ్రమం,
భ్రాతృనాశం దారపీడా ఋణపీడా భవిష్యతి. 30
స్థానభ్రంశం దేహజాడ్యం నానాకష్టం భవిష్యతి,
ద్వితీయ ద్యూననాథేతు మారకగ్రహ సంయుతే. 31
జ్వరోష్ణా ధిక్య రోగశ్చ బంధనంచ మనోవ్యథా,
తద్దోష పరిహారార్థం సుబ్రహ్మణ్య జపంచరేత్ 32
అనడ్వాహం ప్రకుర్వీత సర్వారిష్టనివారణమ్,

తా. శుక్రదశయందు నంగారకభుక్తి ౧౪ మాసములు:— ఈయంగారకుఁడు కేంద్రత్రికోణస్వక్షేత్రోచ్ఛ మూలత్రికోణ శుభాంశ శుభవర్గ మిత్రక్షేత్రములయందును దశానాథునకుఁ గేంద్రత్రికో

ణకాసులయందున్న లగ్నాధిపతితోఁ జేరియుండినను లాభస్థానమున ధర్మకర్మాధిపతులతోఁ జేరియుండినను, పుత్రోత్సవమును, భూలాభమును, గృహమందు వివాహాదివిభవమును, రత్నభూషణలాభమును, వ్యాపారమూలక ధనలాభమును, రాజసన్మానమును, దేహకాంతియును, సౌభాగ్యమును, శత్రునాశమును, భ్రాతృవర్గమునందు శుభకార్యములును, వ్యవసాయఫలాధికమును, రాజసన్మానోద్యోగసంతోషమును, ధైర్యమును గల్గును. ఈయంగారకుఁడు షష్ఠాష్టవ్యయనీచ పాప శత్రుస్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండినచో రాజద్వేషమును, కార్యవిఘ్నమును, మానహానియును, మతిభ్రంశమును, భాతృవర్గహానియును, కళత్రపీడయును,ఋణపీడయును, స్థానభ్రంశమును, దేహజాడ్యమును, నానాకష్టమును గలుగును. ఈయంగారకుఁడు ద్వితీయసప్తమస్థానములకు నధిపతియైనను, ఆస్థానములయందు నుండినను, మారకగ్రహముతోఁ గూడినంగాని చూడఁబడినంగాని యుండినచో జ్వరోష్ణరోగమును, బంధనక్లేశమును గల్గును. తత్పరిహారము సుబ్రహ్మణ్యజపమును, స్వర్ణానడ్వాహ ప్రతిమాదానమును యథావిధిఁ జేసినచో నాయురారోగ్యముగల్గును.

శుక్రదశాయాం రాహుభుక్తి మాసాః, 36. తత్ఫలమ్.

శ్లో. శుక్రస్యాంత ర్గతేరాహౌ కేంద్రే లాభత్రికోణగే. 33
లగ్నా దుపచయ స్థానే తుంగ స్వాంశే శుభాంశగే,
యోగకారకసంయుక్తే శుభగ్రహనిరీక్షితే. 34
దాయేశా త్కేంద్ర కోణేవా తుంగ స్వాంశే స్థితేఽపివా,
శత్రునాశం మహోత్సాహం రాజప్రీతికరం శుభమ్. 35
ప్రయత్నకార్యసిద్ధిశ్చ పుత్రలాభం శుభావహం,
వ్యాపారోద్యోగ సిద్ధిస్స్యా ద్దన్యస్త్రీభోగసంభవమ్. 36
రాజద్వారేఽకార్యసిద్ధి ర్యశోధనవివృద్ధిదం,
కల్యాణం బంధుసన్మానం దారసౌఖ్యం ధనాగమమ్. 37
స్త్రీమూలా ద్ధనలాభంచ స్వప్రభో స్తు మహత్సుఖం,
రత్నభూషణలాభంచ చోరమూలా ద్ధనాగమమ్. 38

పశువాహనసంప్రాప్తి రన్నత్థానసిద్ధిదం,
గీతవాద్యాదిశ్రవణం గురుదైవతదర్శనమ్. 39
నష్టధాన్యధనప్రాప్తిః భూలాభంనృపపూజితం,
షష్ఠాష్టవ్యయేనీచే పాపక్షేత్రసమన్వితే. 40
రాజద్వేషంబంధునాశం స్థాననాశంధనవ్యయం,
బంధనంనిగళప్రాప్తి రన్యదేశనివాసకృత్. 41
దేహజాడ్యంమనోదుఃఖం చోరమూలాద్ధనక్షయం,
కళత్రపుత్రనాశంచ అథవామాతృనాశనమ్. 42
అకాలభోజనప్రాప్తిః స్వజనేన్మృతిసంభవం,
ఋణపీడాశత్రుపీడా నానాకష్టంభవిష్యతి. 43
ద్వితీయద్యూనరాశిస్థే మారకగ్రహసంయుతే,
దేహజాడ్యంకార్యవిఘ్నం అపమృత్యుర్భవిష్యతి. 44
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీజపంచరేత్,
స్వర్ణనాగంప్రకుర్వీత శాంతిమాప్నోత్యసంశయః. 45

తా. శుక్రదశయందు రాహుభుక్తి ౩౬ మాసములు:—ఈ రాహువు కేంద్రత్రికోణమూలత్రికోణోపచయస్థానములయందు యోగకారకునితోఁ జేరి శుభగ్రహయుతుఁడై యుండినను, స్వోచ్ఛస్వాంశ శుభాంశయందు శుభగ్రహయుతుఁడై యుండినను, దశానాథునకు కేంద్రమూలత్రికోణోపచయస్థానములయందు నుండినను, శత్రునాశమును, రాజప్రీతియును, ప్రయత్నకార్యసిద్ధియును, పుత్రోత్పత్తియును, వ్యాపారోద్యోగసంతోషమును, అన్యస్త్రీసంభోగమును, రాజద్వారమునఁ గార్యానుకూలమును, యశోధనాభివృద్ధియును, కల్యాణవైభవమును, బంధుసమ్మానమును, కళత్రసౌఖ్యమును, స్త్రీమూలకధనలాభమును, రత్నభూషణవస్త్రలాభమును, చోరధనసిద్ధియును, పశువాహనసంప్రాప్తియును, గొప్పచోటునఁ జేరి యుద్యోగముచేయుటయును,సంగీతవాద్యసత్కథాశ్రవణమును, గురుదేవతాదర్శనమును, నష్టధనధాన్యప్రాప్తియును, భూగృహలాభమును, రాజపూజయును గలుగును. ఈరాహువు లగ్నమునకు ౬-౮-౧౨ స్థలములయందు పాప

గ్రహములతోఁ జేరియుండెనేని దశానాథునకు ౬-౮-౧౨ స్థానముల యందు నుండెనేని నీచరాసులయందు నుండెనేని రాజద్వేషమును, బంధునాశమును, స్థానభ్రంశమును, చిత్తవైకల్యమును, బంధననిగళకష్టమును, అన్యదేశనివాసమును, దేహజాడ్యమును, చోరమూలకధనక్షయమును, కళత్రపుత్రహానియును, మాతృనాశమును, అకాలభోజనమును, స్వజనమృతాశౌచమును, ఋణధనపీడయును, నానావిధకష్టమును, ప్రయాణకార్యవిఘ్నమునుగల్గును. ఈరాహువు ద్వితీయసప్తమస్థానములయందు మారకగ్రహయుతుఁడై యుండెనేని అపమృత్యుగండము గల్గును. దేహజాడ్యము విషజాడ్యము గల్గును. పరిహారము దుర్గాజపమును, స్వర్ణనాగప్రతిమాదానమును, యామిళోక్తప్రకారము చేయుటచేత నాయురారోగ్యభాగ్యములు గలుగును.

శుక్రదశాయాం గురుభుక్తిమాసాః, 3.౨. తత్ఫలమ్.

శ్లో. శుక్రస్యాంతర్గతేజీవే స్వోచ్చస్వక్షేత్రసంయుతే,
కేంద్రేవాకోణగేస్వాంశే శుభాంశేమిత్రరాశిగే. 46
భాగ్యకర్మపసంయుక్తే దాయేశాత్కేంద్రకోణగే,
నష్టరాజ్యధనప్రాప్తిః పుత్రోత్పత్తిస్సుఖావహమ్. 47
పితృమాతృసుఖప్రాప్తిః బంధుమిత్రసమాగమం,
విద్వజ్జనసమాకీర్ణం శాస్త్రపాఠ పరిభ్రమమ్. 48
వ్యాపారోద్యోగలాభంచ చతుష్పాజ్జీవరక్షణం,
నైఋత్యాందిశమాశ్రిత్య ప్రయాణం మిత్రదర్శనమ్ 49
అశ్వవాహనసంప్రాప్తిః రత్నభూషణలాభకృత్
షష్ఠాష్టవ్యయనీచస్థే పాపగ్రహసమన్వితే. 50
రాజచోరాగ్నిబాధాచ దేహజాడ్యం మనోరుజం,
స్థానచ్యుతిప్రవాసంచ ధనధాన్యవినాశనమ్. 51
శత్రుపీడాపుత్రహాని ర్యశోహానిర్భవిష్యతి,
మాతాపితృవియోగంచ వ్యవహారేధననాశనమ్. 52
ద్వితీయద్యూనరాశిస్థే మారకగ్రహసంయుతే,
దేహజాడ్యంకార్యవిఘ్నం అపమృత్యుర్భవిష్యతి. 53
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపంచరేత్

తా. శుక్రదశయందు గురుభుక్తి 32 మాసములు:—ఈగురువు స్వక్షేత్రోచ్చ మిత్రక్షేత్ర స్వాంశ కేంద్ర త్రికోణస్వాంశలయందు గాని ధర్మకర్మాధిపతులతోఁ జేరి కేంద్రములయందుగాని దశానాథునకు మూలత్రికోణ కేంద్రకోణములయందుఁగాని పూర్ణచంద్రునితోఁ గూడిగాని యుండెనేని నష్టరాజ్యధనధాన్యలాభమును, పుత్రోత్పత్తియును, మాతాపితృసౌఖ్యమును, బంధుమిత్రసమాగమంబును, విద్వజ్జనపరివృతమును, శాస్త్రపఠనాసక్తియును, వ్యాపారోద్యోగలాభమును, చతుష్పాజ్జీవరక్షణమును, నిరృతి పశ్చిమదిశ ప్రయాణముచేత మిత్రదర్శనమును, శ్వేతవస్తుప్రాప్తియును, అశ్వవాహనశకటసంచారమును, రత్నభూషణ వస్త్ర లాభమును గల్గును. ఈగురువు షష్ఠాష్టవ్యయనీచస్థానములయందుగాని శత్రు పాపక్షేత్రాస్తరాసులఁగాని, దశానాథునకు దుస్థానములయందుఁగాని, పాపగ్రహములతోఁగూడి యుండెనేని రాజచోరాగ్నివ్రణజ్వరపీడలును, స్థానభ్రంశమును, ఋణధనబాధయును, కళత్రపుత్రపీడయును, కీర్తిభంగమును, రాజదండనభయమును, బంధుమిత్రకలహమును, మాతాపితృవియోగమును, వ్యవహారమూలక ధనవ్యయమును గల్గును. ఈగురువు ద్వితీయసప్తమస్థానాధిపతియై యుండినను ఆస్థానములయందు మారకగ్రహయుతుఁడై యుండినను, కార్యవిఘ్నమును, దేహజాడ్యమును, అపమృత్యుభయమును గల్గును. అందులకు మృత్యుంజయజపమును స్వర్ణలింగ మహాకూశ్మాండదాన హోమ తర్పణాదులు యథావిధిఁ జేసినచో నాయురారోగ్యభాగ్యములు గల్గును.

శుక్రదశాయాం శనిభుక్తి మాసాః-38. తత్ఫలమ్

శ్లో. శుక్రస్యాంతర్గతే మందే లగ్నాత్కేంద్రత్రికోణగే. 54
తుంగాంశే స్వాంశగేవాపి మిత్రస్వక్షేత్ర సంయుతే,
దాయేశాత్కేంద్ర కోణేవా తృతీయే లాభగేఽపివా 55
పుత్ర పౌత్ర సుఖావాప్తిం దానధర్మాదిపుణ్యకృత్,
కల్యాణం బంధుసమ్మానం వ్యాపారా ద్ధనలాభకృత్ 56
పురాణ ధర్మశ్రవణం పుత్రలాభం ధనాగమం,

పశ్చిమాం దిశ మాశ్రిత్య ప్రయాణం కార్యసిద్ధిదమ్ 57
రాజమూలా ద్ధనప్రాప్తిః అన్యస్త్రీభోగమాప్నుయాత్
నీచవ్యాపారసిద్ధి స్స్యాదిష్టమిత్రవశాత్సుఖమ్. 58
షష్ఠాష్ట వ్యయగే నీచే పాపగ్రహసమన్వితే,
అంత్య గృహే నివాసంచ బంధనం రాజదండనమ్. 59
స్థానచ్యుతిం మనోదుఃఖం ఋణపీడా ధనవ్యయం,
వ్యవసాయా త్ఫలం నష్టం వాహనాంబరనాశనమ్. 60
వ్రణాగ్నిజ్వరపీడాచ చోరభీతి ర్మనోరుజం,
ద్వితీయ ద్యూననాథే తు మారకగ్రహసంయుతే. 61
దేహజాడ్యం కార్యవిఘ్నం అపమృత్యు ర్భవిష్యతి,
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపం చరేత్. 62
స్వర్ణాంగాం మహిషీ దద్యా దాయురారోగ్యమాప్నుయాత్,

తా. శుక్రదశయందు శనిభుక్తి ౩౮ మాసములు:—ఈ శని, లగ్నమునకుఁ గేంద్ర త్రికోణ తుంగ స్వాంశ మిత్రక్షేత్రములయందుఁ గాని, దశానాథునకుఁ గేంద్రత్రికోణములయందుఁగాని తృతీయ లాభ స్థానములయందుఁగాని శుభగ్రహయుతుఁడై యుండెనేని పుత్రపౌత్ర సుఖమును, దాన ధర్మ పరోపకార పుణ్యకార్యాది లాభమును, కల్యాణమును, బంధుపూజ్యతయును, వ్యాపారధనలాభమును, పురాణ ధర్మసత్కథాశ్రవణమును, పుత్రసంభవమును, పశ్చిమదిశ ప్రయాణముచేతఁ గార్యానుకూలమును, రాజోద్యోగమూలక ధనలాభమును, రాజపూజ్యతయును, అన్యస్త్రీసంభోగమును, నీచవస్తువ్యాపారముచే ద్రవ్యలాభమును, మిత్రజనమూలక వ్యవహారాదికార్యములు జయమును గల్గును. ఈశని షష్ఠాష్ట వ్యయ నీచారి రాసులయందుఁ గాని, పాపక్షేత్రములయందుఁగాని పాపగ్రహయుతుఁడై యుండెనేని చండాలగృహనివాసమును,బన్ధనమును, రాజదండనయును, స్థానచ్యుతియును, మనోదుఃఖమును, ఋణధనబాధయును, వ్యవసాయఫలనష్టమును, వాహన పశు నష్టమును, వ్రణాగ్నిజ్వర చోర బాధయును, చిత్తవైకల్యమును గల్గును. ఈశని ద్వితీయ సప్తమస్థానముల కధిపతియై యుండినంగాని, ఆస్థానములయందుఁ బాపగ్రహయు

తుఁడై యుండినఁగాని, దేహజాడ్యమును, కార్యవిఘ్నమును, వాతశ్లేష్మవ్యాధిచేత మృత్యువును గల్గును. తద్దోషపరిహారమునకు మృత్యుంజయజపమును, స్వర్ణమహిషప్రతిమాదానహోమాదులును చేసినచో నాయురారోగ్యభాగ్యములు గల్గును.

శుక్రదశాయాం బుధభుక్తిమాసాః-33. తత్ఫలమ్.

శ్లో. శుక్రస్యాంతర్గతే సౌమ్యే కేంద్ర లాభ త్రికోణగే. 63
స్వోచ్చ స్వక్షేత్ర మిత్రర్క్షే కర్మభాగ్యపసంయుతే,
సౌభాగ్యం పుత్రలాభంచ సత్కథా శ్రవణం భవేత్ 64
యజ్ఞకర్మప్రసంగంచ సుందరాగారవాసకృత్,
వాణిజ్యే ధనలాభంచ వైశ్యమూలా ద్ధనాగమమ్. 65
ఇష్టబంధుసమాయుక్తం దేవతోత్సవదర్శనం,
గృహే కల్యాణసంసిద్ధి ర్మనోల్లాసం సుఖావహమ్. 66
ప్రయాణే కార్యసిద్ధిశ్చ దానధర్మాది చింతనం,
నూతనోద్యోగసంతోషం రాజసమ్మాన వైభవమ్. 67
బంధుకల్యాణవిభవం నిత్యమృష్టాన్నభోజనం,
తీర్థయాత్రార్థసంసిద్ధిః యోగిజనసుదర్శనమ్. 68
షష్ఠాష్టవ్యయగేనీచే పాపగ్రహసమన్వితే,
దాయేశా ద్రిపు రంధ్రస్థే వ్యయే నీచారి రాశిగే. 69
పితృమాతృవియోగశ్చ వ్యాపారే ధననాశనం,
అకస్మాత్కలహం చైవ రాజదండా ద్ధనక్షయమ్. 70
కారాగృహప్రవేశంచ స్థాననాశం మనోరుజం,
ఋణాద్రవ్యాదికష్టం చ విదేశగమనంభవేత్. 71
కళత్రపుత్రహాని శ్చ మిత్రబంధువిరోధకృత్,
ద్వితీయ ద్యూనరాశిస్థే మారకగ్రహసంయుతే. 72
దేహజాడ్యం మనఃక్లేశం అపమృత్యుభయం భవేత్,
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్. 73
స్వర్ణాం గాం మహిషీం దద్యాదాయురారోగ్యమాప్నుయాత్

తా. శుక్రదశయందు బుధభుక్తి ౩౪ మాసములు:—ఈ బుధుఁడు, కేంద్రత్రికోణ లాభోచ్చ మిత్రక్షేత్రస్వక్షేత్రములయందుఁ గాని, దశానాథునకుఁ గేంద్రత్రికోణములయందుఁగాని ధర్మకర్మాధిపతులతోఁ జేరియుండినచో సౌభాగ్యమును, పుత్రజననమును, సత్కథాశ్రవణమును, యజ్ఞకర్మవిచారమును, సుందరమందిరనివాసమును, వ్యాపారమూలక ధనలాభమును, వైశ్య జనస్నేహితమూలక ధనలాభమును, ప్రియబంధులతోఁగూడి దేవతోత్సవదర్శనము చేయుటయును, గృహమందుఁగల్యాణాదివిభవమును, మనస్సంతోషమును, ప్రయాణముచేతఁ గార్యానుకూలమును, దానధర్మ పరోపకారమును, నూతనోద్యోగసంప్రాప్తియును, రాజసమ్మానమును, బంధుకల్యాణవైభవమును, నిత్యమృష్టాన్నభోజనమును, తీర్థయాత్రార్థలాభమును, సాధుజనదర్శనమును గల్గును. ఈబుధుఁడు షష్ఠాష్టవ్యయనీచారిరాసులయందు పాపగ్రహములతోడఁ జేరియుండినచో దశానాథునకు దుస్థానమునయందునుండినచో మాతాపితృవియోగమును, వ్యాపారమునందు ధననష్టమును, అకస్మాత్కలహమును, రాజదండనచేధనవ్యయమును, కారాగృహప్రవేశమును, స్థాననాశమును, ఋణబాధయును, విదేశగమనమును, కళత్రపుత్రపీడయును, స్వజనమృతాశౌచమును, మిత్రబంధువిరోధమును గల్గును. ఈ బుధుఁడు ద్వితీయ ద్యూనస్థానముల కధిపతియైమారకగ్రహములతోఁ గూడి మారకస్థానములయందు నుండినను, ఆస్థానములయందు మారకులతోఁ జేరియుండినను, దేహజాడ్యమును, మనోదుఃఖమును, అపమృత్యుదోషమును, వాతశ్లేష్మవ్యాధియునగును. అందులకు విష్ణుమంత్రజపమును, స్వర్ణ లక్ష్మీనారాయణప్రతిమయును, గోమహిషములను దానము యథావిధిం జేసినచో నాయురారోగ్యభాగ్యములు గల్గును.

శుక్రదశాయాం కేతుభుక్తిః మాసాః-౧౪. తత్ఫలమ్.

శ్లో. శుక్రస్యాంతర్గతే కేతౌ స్వోచ్చ స్వక్షేత్ర సంయుతే. 74
యోగకారక సంబంధే మిత్రోప చయసంస్థితే,
కేంద్రకోణసమాయుక్తే శుభగ్రహసమన్వితే. 75
భూపసాత్త్వభివృద్ధిశ్చ రత్నభూషణ లాభకృత్

విచిత్రవస్తు సంప్రాప్తి రన్యస్త్రీభోగసంభవమ్. 76
సత్కథాశ్రవణానందం వ్యాపారా ద్ధనసిద్ధిదం,
అన్యగృహనివాసంచ విధవా సంగమం తథా. 77
ప్రయాణంకార్యమాలస్యం పుత్రజన్మోత్సవం భవేత్,
రాజపూజ్యం యశోవృద్ధిం నిత్యచిత్రాన్నభోజనమ్. 78
షష్ఠాష్ట వ్యయ నీచస్థే దాయేశా ద్రిష్ఫ రంధ్రగే,
పాపగ్రహసమాయుక్తే పాపగ్రహ నిరీక్షితే, 79
విష చోరాగ్ని బాధాచ వ్యాపారే ధననాశనం,
శిరోరోగం మనస్తాపం బంధుద్వేషం మనోరుజమ్. 80
భార్యా పుత్రవియోగాది కష్టం రాజదండనం,
దేహజాడ్యం కార్యవిఘ్నం పైతృకర్మాది సిద్ధిదమ్. 81
ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి,
తద్దోష పరిహారార్థం దుర్గాదేవీజపం చరేత్. 82
ఛాగదానం ప్రకుర్వీత దానే నారోగ్య మాదిశేత్.

తా. శుక్రదశయందు కేతుభుక్తి ౧౪ మాసములు:—ఈ కేతువు స్వోచ్ఛస్వక్షేత్రమిత్రక్షేత్రసమక్షేత్రోపచయస్థానములయందు యోగకారకునితోఁ గూడినను, కేంద్రకోణ స్థానములయందు శుభగ్రహములతోఁ గూడి యుండినచో భూసస్యాభివృద్ధియును, రత్నభూషణలాభమును, విచిత్రవస్తులాభమును, అన్యస్త్రీభోగమును, సత్కథాశ్రవణమును, వ్యాపారాభివృద్ధియు, ధనాగమమును, అన్యగృహ నివాసమును, విధవస్త్రీసంగమంబును, ప్రయాణముచేతఁ గార్యాలస్యమును, పుత్రోత్సవమును, రాజపూజ్యతయును, యశోవృద్ధియును, చిత్రాన్న భోజనమును గల్గును. ఈ కేతువు షష్ఠాష్టవ్యయ నీచారి రాసులయందు దశానాథునకు దుస్థానములయందుఁ బాపగ్రహయుతుఁడై యుండెనేని పాపగ్రహములచేతఁ జూడఁబడినను,విషచోరాగ్ని వ్రణజ్వరాతిసారగుల, వ్యాధిపీడలును, శిరోరోగమును, దంతబాధయును,బంధు ద్వేష

మును, భార్యాపుత్రహానియును, రాజదండనయును, దేహజాడ్యమును, కార్యవిఘ్నమును, పితృకర్మాదులును, శత్రుబాధయును గల్గును. ఈ కేతువు ద్వితీయ సప్తమస్థానములయందు మారకగ్రహయుతుఁడై యుండినచో అపమృత్యుభయము గల్గును. తద్దోషపరిహారము దుర్గాదేవీజపమును, స్వర్ణచ్ఛాగ ప్రతిమాదానమును యథావిధిఁ జేసినచో నాయురారోగ్యభాగ్యము గల్గును.

ఇట్లు శుక్రదశాంతర్దశావిచారము సంపూర్ణము.

వృద్ధపారాశర్యము
సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1923

# సంస్కృత గ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బాలరామాయణము, సటీకము | ... | 0 | 3 |
| అధ్యాత్మరామాయణము, మూలము | ... | 1 | 0 |
| బాలకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 8 |
| సుందరకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము, ఆంధ్రతాత్పర్యసహితము. చక్కనికూర్పు | | 2 | 0 |
| యజుర్వేదసంధ్యావందనము, పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకా తాత్పర్యసహితము, చిన్నసైజు, మంచికాగితములు | ... | 0 | 4 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 | 2 |
| యజుర్వేదాబ్దికమంత్రములు, మూలము, చిన్నసైజు | ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| ప్రశ్నచూడామణి, 360 ప్రశ్నములు, మంచికాగితములపై చక్కగముద్రితము | | 2 | 0 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము, అనేక విషయములఁ జేర్చి యాంధ్రమహాజనసంప్రదాయానుసారముగఁ బరిష్కరించి ముద్రించి యున్నాము | ... | 2 | 0 |
| మహాన్యాసము, చిన్నసైజు, శుద్ధప్రతి | ... | 0 | 6 |
| రుద్రము, పురుషసూక్తము పగ్గెరాలు, చిన్నసైజు | ... | 0 | 2 |
| మంత్రపుష్పము, సటీకము, చిన్నసైజు | ... | 0 | 1 |
| సంహితోపనిషత్తులు, తైత్తిరీయము, చిన్నసైజు | ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీకము, చిన్నసైజు | ... | 0 | 2 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, ఆశ్వలాయనము, చిన్నసైజు | ... | 0 | 4 |
| శ్రీవైష్ణవఆహ్నికము, చిన్నసైజు | ... | 0 | 4 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ,, | ... | 0 | 4 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 1 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 1 |
| సంధ్యావందనభాష్యము, చక్కనిప్రతి | ... | 0 | 8 |
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 3 |
| ప్రశ్నరత్నాకరము, ప్రథమభాగము | ... | 0 | 10 |
| ప్రశ్నరత్నాకరము, ద్వితీయభాగము | ... | 1 | 2 |
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| వివేకచూడామణి, సాంధ్రతాత్పర్యము ... | 0 | 12 |
| హరిమీడేస్తోత్రము, సటీకము, చక్కనికూర్పు ... | 0 | 4 |
| ఆత్మబోధము ,, ,, ... | 0 | 4 |
| సౌందర్యలహరి, ఆంధ్రటీకాసహితము, చక్కనికూర్పు ... | 0 | 4 |
| రామగీత, సటీక, చిన్నసైజు ... | 0 | 6 |
| ఉత్తరగీత, సటీక, చిన్నసైజు, మంచికాగితములు ... | 0 | 12 |
| భగవద్గీతలు, మూలము, చిన్నసైజు ... | 0 | 6 |
| భగవద్గీతలు, శ్రీరామచంద్ర సరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్యసహితము, మతత్రయభాష్యములనుండి అనేక అంశములిందుచేర్చి శ్లోకానుక్రమణికతో చక్కగముద్రింపబడినది ... | 2 | 12 |
| భగవద్గీతలు, ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనికూర్పు ... | 1 | 4 |
| డిటో, చిన్నసైజు ... | 0 | 10 |
| భగవద్గీతలు, చిన్నసైజు, శ్రీఅనిబిసెంటుగారి ఇంగ్లీషు తర్జుమాసహితము. | 0 | 8 |
| అద్వైతోపదేశపంచరత్నములు, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 2 |
| అద్వైతానుభూతి ... | 0 | 2 |
| ఆత్మవిద్యావిలాసము ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ... | 0 | 4 |
| సర్వసారోపనిషత్తు ,, ... | 0 | 2 |
| నిరాలంబోపనిషత్తు ,, ... | 0 | 2 |
| కైవల్యోపనిషత్తు ,, ... | 0 | 2 |
| అమృతబిందూపనిషత్తు ,, ... | 0 | 2 |
| స్కందోపనిషత్తు ,, ... | 0 | 2 |
| ఆత్మబోధోపనిషత్తు ,, ... | 0 | 2 |
| శారీరకోపనిషత్తు ,, ... | 0 | 2 |
| శ్రీగుణరత్నకోశము, సటీకము ... | 0 | 4 |
| ముకుందమాల, సటీక, చిన్నసైజు ... | 0 | 4 |
| సనాతనమానవధర్మములు, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు ... | 0 | 4 |
| ప్రాతఃస్మరణ, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 2 |
| నవగ్రహస్తోత్రము ... | 0 | 4 |
| పరమేశ్వరస్తోత్రకదంబము, శుద్ధప్రతి ... | 0 | 6 |
| దేవీస్తోత్రకదంబము, చిన్నసైజు ... | 0 | 6 |
| శంకరాచార్యస్తోత్రాది ... | 0 | 3 |
| లక్ష్మీహృదయము, నారాయణహృదయము ... | 0 | 3 |

ఇవిమొదలగు [illegible]ఆంధ్రగ్రంథములు అనేకములు మావద్ద దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.